# విషయసూచిక





# అన్నపూర్ణమందిరము

## మొదటి పరిచ్ఛేదము

### స తి క మ ల

ఊరిప్రక్కనే నది. అతినిర్మలమైన నీరు. ఎండకాల మగుటచే నీరంతగా లేదు. కాని నది వడిగా పాఱుచున్నది. ఒడ్డున జమీందారుగారి తోటలోని కొబ్బరిచెట్లు తలలెత్తుకొని స్థిరముగా నిలిచియున్నవి, కాని సంధ్యవేళను వీచు మంద మారుతమున ఉండియుండి మెల్లమెల్లగ తలలాడించుచున్నవి. చెట్లనడుమ దాఁగియున్న శివాలయము బయటికి కనఁబడ-కున్నను అస్తగామియగు సూర్యుని రక్తకిరణములు పడు-చుండుటవలన నాలయశిఖరముననున్న యిత్తడి త్రిశూలము మాత్రము తళుకుతళుకు మనుచు కనబడుచున్నవి.

ఇప్పటి కింక నెవ్వరును ఏటియొద్దన కానరాలేదు. బాలిక యొకతె మాత్ర మప్పుడే వచ్చి, జమీందారుగారెంతో డబ్బిచ్చి కట్టించిన చక్కని మెట్ల వెంబడి దిగుచున్నది. ఆమె భుజముపై చీరయు అంగవస్త్రమును ఉన్నవి, చంకను ఇత్తడి బిందె యొకటి యున్నది. బాలిక అడుగుమెట్టుపఱకు దిగి నాలుగువైపుల నొకమాఱు చూచి, యెవరికొఱకో కని-పెట్టుకొని యున్నట్లు కొంచెముసేపక్కడ నిలచియుండెను.

కాని ఎవ్వరును వచ్చుజాడ కానక పొడిబట్టను మెట్లపై నుంచి ఆమె నీటిలోనికి దిగినది. నీరు పుక్కిలించుచు పరధ్యానముగ నిలుచుండిపోయినది. అట్టి సమయమున మఱియొక బాలిక యేటియొడ్డునకు వచ్చి మీందిమెట్టుపై నిలచినది. మొదటి బాలిక పరధ్యానముగ నుండుట చూచి, రెండవబాలిక మెల్ల మెల్లగ మెట్లు దిగివచ్చి వెనుకను కొంచెము చప్పుడుచేసినది. చప్పుడు వినఁగానే మొదటిబాలిక యులికిపడి వెనుకకుతిరిగి చూచి కొంచెము నవ్వుచు, "అబ్బా, భయపెట్టితివే!" అని యన్నది. "ఓస్, చంటిపిల్లవు, పాపము!" అని యెగతాళిచేసి రెండవబాలిక, "ఎంత పరధ్యానమే! నేను వచ్చితినని తెలిసి-కొననైనను లేకపోతివి! నీవు వచ్చి యెంతసేపైనదే?" అని పలికినది.

"ఇప్పుడే వచ్చితిని, నీవు నేఁ డింత యాలస్యము చేసితి-వేల? ప్రతిదినముచు నీవే ముందుగ వచ్చుచుందువే!"

"అది చెప్పెదను గాని, అంత పరధ్యానముగనుండి నీవేమి యాలోచించుచుంటివో మొదట చెప్పుము."

"నే నాలోచించున దేమి యుండఁగలదు?" అని సతి కళలేనినవ్వు నవ్వుచు ననెను.

"ఏమి యాలోచించుచుంటివి, అత్తైన?" అనుచు కమల సతిపై నీళ్లు విసరెను. ఐనను సతి జవాబుచెప్పక బట్ట నుతుక

సాగెను. కమల సతిని బట్ట నూతుకనీయక, దానినినొక్కిపట్టుకొని, "చెప్పకతీఱదు, చెప్పకున్న బట్టను వదలను," అనెను.

"అబ్బా! ఏమి అది!" అని చీకాకుపడుచు సతి యనఁగానే కమల బట్టను వదలి పౌరుషముతో ముఖ మటు త్రిప్పుకొనినది.

"నీకు బహుకోపమే అక్కా!" అని సతి అనుతప్తురాలై యనుచు, "పోనిమ్ము నాదే తప్పు; మరల చెప్పుము ఏమి చెప్పుమనెదవో."

"నీ చింతకు కారణ మేమి?"

"క్రొత్తసంగతు లేమియు లేవక్కా— మాయింటి సమాచారము నీ వెఱుఁగని దేమున్నది? మాటిమాటికిని అడిగి యేమిలాభము, నాకు సిగ్గు తెప్పించుటతప్ప?"

"ఓహో! ఆచింతయా? నే ననుకొన్నది—"

"ఔ నౌను! అది నీ వనఁదగిన మాటయే—"

సతి వాక్యము పూర్తి చేయకమునుపే కమల ఇట్లన సాగెను — "నీవే నాయవస్థలో నున్నయెడల ఏమిచేసి యుందువో నే నెఱుఁగను—ఐనను చూడుము, నీవలె నేను ముఖము వాడఁబెట్టుకొని కూర్చుండ లేదు!"

సతి కనులువిప్పి కమలవైపుచూచుచు నిలచియుండెను. ప్రకృతిశోభను రెండింతలుగఁజేయుటకై ప్రవీణుఁడగు శిల్పి చక్కని ప్రతిమ నొకదానిని జేసి నదీవక్షమున స్థాపించెనా యనున ట్లామె కనఁబడుచుండెను. ఆమెజుట్టు ముడిపుంచి

తప్పించుకొన్న ముంగురులు మృదువుగ వీచుచుండుగాలిలో నాడుచుండెను. నది తన నీలవక్షోదర్పణమున ఆమూర్తిని ప్రతిబింబింపఁజేయుచుండెను. హీనతేజుఁడైనసూర్యుని రక్తకిరణములచ్చటికి ప్రాకివచ్చి యాదృశ్యమును మఱింత రమణీయముగఁ జేయుచుండెను. ప్రకృతి దయామయి, భాగ్యదేవత కరుణాహీన!

"నీకు విచార మేల కమలా? గొప్పయింటి ముద్దుబిడ్డవు నీవు, ఎటుచూచినను సుఖసంపదలు, ఐశ్వర్యము, చుట్టును నవ్వుముఖములతో అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు! వారు కష్టపడుచుండుట చూడవలసిన దురదృష్టము నీకెన్నడును కలుగదు. ఆ పరిస్థితులలో నీ కేమి దుఃఖముండఁగలదు, ఏమి కష్టము కలుగఁ గలదు?" అని మృదుస్వరముతో సతి ప్రశ్నించినది.

"ఏల యుండకూడదు సతీ? పేదయింటఁ బుట్టుటయే అన్నిటికంటె గొప్పదుఃఖమనుకొనుచున్నావా?"

"ఏమో!" అని కొంచెము దుఃఖముతో సతి జవాబు చెప్పెను.

'మేము నిరుపేదల'మని చెప్పుకొని తిరుగుచుండుట సతి స్వభావమునకు విరుద్ధమగుటచే నామె యేమియు ననక ఊఱక నిలచియుండెను. కమల యప్పుడు, "కొంచె మాలోచించి చూడుము సతీ," యనుచు ప్రారంభించినది—"నీకష్టములవంటి

కష్టములు నివారణ కాఁగలవు, కాని మనోవ్యథ కెన్నిటికిని నివారణ లేదు."

"అట్లైన, నీకట్టి కష్టమేదియో కలిగినది కాఁబోలును!" అని యనుచు సతి కొంచెము నవ్వినది—సతి నవ్వాగోరి నవ్వ లేదు.

"ఔను, నేను గొప్పయింటి పిల్లను, నాకు కష్టముగాని దుఃఖముఁగాని ఎట్లు కాఁగలదు!"

"క్షమింపుము కమలా, అపరాధము చేసితిని. సమాచార మేమో చెప్పుము."

"నాకు పెండ్లియఁట! వింటివా?"

"పెండ్లియా? ఎప్పుడు?"

"నెల నెలపదునైదు దినములలో నగును. ఎవరికిచ్చి పెండ్లి చేయుదురని యడుగ వేమి?"

"అది యెఱిఁగిన సంగతియే. *విశుదాదా కిచ్చి పెండ్లి చేయుదురు."

"కాదు కాదు, అట్లైన తమాషా యేమున్నది? నేఁడెవరో పెండ్లిమాటలకై వచ్చిరి."

సతి విస్మితురాలై, "నీవు విశుదాదానుతప్ప మఱి యెవ్వరిని పెండ్లి యాడననంటివే, మీ యమ్మ నాన్న అతని కిచ్చుట కిష్టపడ లేదు కాఁబోలు!" అని యడిగినది.

* విశు=విశేశ్వరుఁడు

దాదా=అన్న

"మా నాన్నతోఁగాని అమ్మతోఁగాని ఆ యింటి వారెన్నఁడును ఆప్రసంగము కదల్పలేదు—మా అమ్మనాన్నల నిందింపవలసిన దేమియు లేదు."

"నీవుకూడ అట్లేయనుచున్నావు! ఎవరైన వినిన నవ్వఁగలరు!"

"ఓహో! సిగ్గు భరించలేకున్నాను కదూ! మనస్సులో నున్నది చెప్పిన తప్పేమి?"

"పోనీ ఇప్పుడైనను మీనాన్నకు అమ్మకు నీ యభిప్రాయము తెలియఁజేసెదవా?"

"ఇతరులకు చెప్పుటకు ముందు ఎవరిసమ్మత మవసరమో అతని మనస్సును తెలిసికొనుట యెట్లు?"

విని సతి యాశ్చర్యము చెందుచు అన్నది, "ఎవరి మనస్సు కమలా? విశుదాదా మనస్సా? ఛీ, ఛీ సిగ్గు సిగ్గు!—నీదెంత సాహసమే!"

"వేఱు మార్గ మేమున్నది సతీ! నీవు పుస్తకము లేవియు చదువుటలేదేమో!" అని కొంచెము విసుగుఁ జెందుచు కమల యన్నది.

"నేను చదువునది రామాయణము, భారతము," అని నిరుత్సాహముతో పలికినది సతి.

కమల కొంచె మెగతాళిచేయుచు, "అట్లైన నన్నియు చదివినట్లే లెక్క!" అని నవ్వి, "నేఁడు మాయింటి కొకమాఱు

రమ్ము, నీకు చదువవలెననియున్నచో మంచి పుస్తకముల నిచ్చె దను," అని యన్నది.

సతి యులికిపడి కమలవైపు చూచి, తనయవస్థకును కమల యవస్థకునుగల భేదము హఠాత్తుగా పోల్చుకొని, దృఢస్వర ముతో, "వద్దమ్మా వద్దు, ఆ పుస్తకములతో నాకేమి అవ సరము!" అని యన్నది.

"పుస్తకము లవసరము లేక పోవచ్చును, కాని మాయింటికిమాత్రము రాక తీరదు."

"చెప్పలేను, మా పెత్తల్లి కోపపడకపోయినయెడల వచ్చెదను."

"మీయమ్మ అంత మంచిది కదా, మీపెత్తల్లిది అట్టి స్వభావమేమి సతీ?"

"చిత్రమే, ఎట్లు చెప్పగలను? కాని ఇఁక మనము పోదము రమ్ము, ఆలస్యము చేసినయెడల దారి నందఱు కనం బడుదురు."

ఇద్దఱును మెట్లెక్కసాగిరి. నిండుబిందెను ఎత్తలేక సతి కష్టపడుచుండుట చూచి కమల, "అంతపెద్ద బిందె తేకూడ" దని యనెను.

"తేకున్న ఎట్లు?"

"అది మీయమ్మ తేవచ్చునే!"

"మాయమ్మ మోయఁగలిగినప్పుడు నేనేల మోయలేను?"

"మీచెల్లి సావిత్రి తేవచ్చునే!"

"ఏమి మాట! అది చిన్నపిల్ల పాపము!"

"కమల పెదవులు విఱుచుకొనుచు," ఆహా, ఎంత చిన్న కదా! మా అమ్మతే నీకంటె రెం డేండ్లే గా చిన్న?—అంత కూడ లేదేమో!" అని యన్నది.

"అట్లనకు కమలా! నాకంటె అది మిక్కిలి ఓరిమిగలది. మీ యింటివంటి గొప్పయిండ్లలో నట్టిపిల్ల లుండరు, ఆమాట మఱవకు. మాతమ్ముఁ డెల్లప్పుడును, 'ఇది కావలెను అది కావలెను,' అనుచు అల్లరిచేయుచుండును, మా చెల్లి కోపపడక వానిని మరిపించుచుండును; మాఅన్నయ్య అనేకవిధముల నామెను కష్టపెట్టుచుండును; దొడ్డమ్మ దినమంతయు తిట్టు చుండును—ఇవి యన్నియును సావిత్రి సహించియుండును, నాన్న యెల్లప్పుడు నామె కేదో పని చెప్పుచుండును—ఆపను లన్నిటిని సావిత్రి విసుగులేక చేయుచుండును. అది భరించు దానిలో నాల్గవవంతు నేను భరించలేను, అది చేయుదానిలో సగము చేయలేను. నిరుపేదలయింటిపిల్ల గనుక దానిగుణ ములు మీకంటపడవు."

కమల కొంచెము తడఁబడుచు ఏమియు ననక నిలచి యుండెను. సతికిని కమలకును గలప్రేమ అద్భుతమైనది. కొం డెన్నడును కమల సతికి నొప్పి కలిగింపదు. కాని గొప్పయింటి యలవాటుకొలఁది మాటలు వానియంతట నవియే వచ్చు చుండును. సతికి సహించి యూరకుండు నభ్యాసము లేక గట్టిగ

రెండుమాటలననిదే వదలదు. అయినను కమలకుఁగాని సతికిఁ గాని కోపము చాలసేపుండనదికాదు.

కమల తత్తర పడినది, ఆమెకు కొంచెము కోపము వచ్చినది, కాని రెండు నిమిషములు కాకమునుపే, "నే నట్లంటినే సతీ! నీవుమాత్రము ఒకమాటకు పదిమాటలు బదులు చెప్పుచుండ లేదా!" అని యన్నది.

సతి యామెవైపు చూచి నవ్వుచు, "నిన్ను అనవద్దని నే నన లేదే!" అన్నది.

"నా కది చేత కాదమ్మా. పోనీ ఆమాట లటుండనీ —నీవు మాయింటి కెప్పుడు వచ్చెదవో చెప్పుము."

"వచ్చెద నెప్పుడో ఒకనాఁడు."

"అట్లు పనికిరాదు. నీసలహా ఒక విషయములో నాకు కావలయును. నీవు లేనిదే నే నేమియు చేయలేకున్నాను, ఆలస్యముచేయక ఒకమాఱు రమ్ము,—వచ్చెదవా?"

"ఆవా వచ్చెద."

మజాత్‌పూర్‌లో ప్రఖ్యాతిఁజెందిన జమీందారుల యింటిపిల్ల కమల, సర్వవిధముల సుఖము లనుభవించుచు మిగుల గారాబముతో పెరుఁగుచున్నది. రామశంకరభట్టాచార్యుని కొమార్తె, సతితో, నామెకు మైత్రి యెట్లు కుదిరెనో చెప్పుట కష్టము. నిరపేదలకు ధనికులతో స్నేహము కలయుట ఆశ్చర్యకరమగు విషయమే. కమల తన యింటివారి పోట్లననుభవింపకయే ఈపని సాధింపఁగలిగెనని మన మనుకొనుట

పొరపాటు. ధనికుల మాట యనుకొనునప్పుడు పేదవారి
మనస్సులయం దొకవిధమగు నభిమానము పుట్టుచుండును. అది
జ్ఞప్తియుంచుకొని సతియింటివారు ఆమెను జాగ్రత్తగనుండుమని
పలుమార్లు చెప్పిరి. ఇది కొంచెము యోచనీయ మగువిషయమని
రెండిండ్లవారికిని దోఁచుచుండెను. కాని సతీకమలలు మాత్ర
మొకరి నొకరు విడువలేదు. రూపునందును, వయస్సునందును,
బాల్యోచితమగు స్నేహాభిలాషయందును ఇద్దఱికిని పోలిక
యుండెను. ఈకారణములవలననే యీస్నేహము సంఘటిల్లి-
నదని చెప్పవచ్చును. పదమూఁడేండ్లబాలిక కమల, పండ్రెం
డేండ్లు సతికి. కనుకనే వారియం దన్యోన్యముగనుండు
నీ గాఢానురాగ మిప్పటికిని నిలిచియున్నది.

కమల యింటికివచ్చి మంచముపై పరుండియుండెను.
పెండ్లిమాట వినినప్పటినుండి కమలకు నిజముగనే దుఃఖ-
మారంభమయ్యెను. తన వరుఁడెవఁడో తనలో తాను నిశ్చయించు
కొని యిప్పటికి సుమారు మూడుసంవత్సరము లైనది. కమల
యొకనాఁ డేటిలో నీఁదఁబోయి ప్రవాహమున కొట్టుకొనిపోవు
చుండ, నొడ్డుననున్న విశ్వేశ్వరుఁ డదిచూచి ఆమెను నీటినుండి
పైకితీసి ప్రాణములను కాపాడెను. సతితప్ప మఱియెవ్వరు
నీవృత్తాంత మెఱుఁగరు. అప్పటినుండి యీ మూఁడుసంవత్సర-
ములు కమల అనేకపుస్తకములు చదివినది. అట్టిఘటనల పరి-
ణామము అన్ని గ్రంథములలో నొక్కటియే!

విశ్వేశ్వరుఁడు కురూపి కాఁడు, నవయౌవనమున నున్న

వాఁడు, స్వశాఖవాఁడు, పెండ్లి యింకను కాలేదు. కమలకూడ రూపవతి, గొప్పయింటిపిల్ల, అవివాహిత. ఇట్టి సందర్భములలో ప్రేమోదయమగుటయు, అది వివాహరూపమున పరిణమించు-టయు తప్పక జరుగుసంగతులే. వారిప్రేమ యిప్పటివఱకు రూపమును ధరింపలేదు, నిజమే, కాని దానికి తగిన కారణము లేకపోలేదు. విశ్వేశ్వరునియిల్లు దూరమున మఱియొకపేటలో నున్నది. కమలయింటి కతఁడు వచ్చిపోవు నలవాటులేదు. ఆ ఘటన జరిగిననాఁటినుండి విశ్వేశ్వరుఁడు కమలకంట నొక్కనాఁడైన పడలేదనియే చెప్పవచ్చును. కాని పైనుదాహరించిన సూత్రమునసుసరించి ప్రేమించుబాధ్యత కమలపైనుండెను— బాధ్యత యనియేకాక కమల విశ్వేశ్వరుని ప్రేమించుచుండెను. అట్లాగుననే విశ్వేశ్వరుఁడుకూడ కమల నేల ప్రేమించు చుండకూడదు? కమలకుండునట్లే విశ్వేశ్వరునికికూడ పెండ్లిచేసికొనవలెనని కోరికయున్నదనుకొనుటకు తగిన ప్రమాణము లేదు. కాని యిట్టివి పుస్తకములలో తఱచుగా సంభవించుచుండును. చివరపుటలో పాణిగ్రహణము జరుగుచుండును. దేనిలోనైన నట్టిది తుదకు జరుగనిచో కమల యాగ్రంథకర్తను శపించుచుండును—జీవననాటకమున అట్టి తుదియంకమును చూచుటకెన్నఁడును ఇష్టపడునదికాదు కమల.

## రెండవపరిచ్ఛేదము

### బీదల యిల్లు

అప్పుడే తెల్లవాఱినది. మరమ్మతులు లేక కూలుటకు సిద్ధముగనున్న చిన్న గడ్డింటియరుగుపై కూర్చుండి అకాల వృద్ధుఁడగు రామశంకరభట్టాచార్యుఁడు గుడుగుడు పీల్చు-చుండెను. దగ్గఱ చూరున వ్రేలాడుచుండు పంజరమున అప్పుడే నిద్రనుండి లేచి రామచిలుక, "దుర్గ, కృష్ణ కృష్ణ" మొదలగునామములు స్మరించి, పిమ్మట భట్టాచార్యుఁడు దగ్గి-నట్లు దగ్గి, గుడుగుడుత్రాగు శబ్దముచేసినది. కూలిపడుటకు సిద్ధముగనున్న వంటయింటి మెట్లప్రక్కను కుక్క గుఱ్ఱుపెట్టుచు హాయిగా నిద్రించుచున్నది. వాకిట రాటకు కట్టియున్న ఆవు అత్యనురాగముతో దూడను నాకుచున్నది. ఎటుచూచిన నెట్టిచలనము లేదు, అంతయు మిక్కిలి శాంతముగ నున్నది.

అంగణమున మూలలనుండు అరఁటిచెట్ల యాకులు గాలికి కొంచెము కొంచెముగ కదలుచున్నవి, కాని గాలియం దెట్టి యుత్సాహమును లేకుండుటచే చలనమున్నట్లే కనఁబడకున్నది. నిశ్చింత స్థైర్యము అంతటను వ్యాపించియున్నప్పుడు మానవుఁ డొక్కఁడే యింత యాందోళనపడుచు, ఇంత దిగులు చెందుచు నేలయుండవలెనో యని కాఁబోలు రామశంకరుఁ డాలో-చించుచున్నాఁడు ! పక్షి యుల్లాసముతో మాటలాడుచున్నది,

హాస్యమాడుచున్నది; ఆవు ప్రీతితో దూడకు ముద్దుచేయు-చున్నది, కుక్క యెట్టిచింతయు లేక నిద్రించుచున్నది— వీనిలో దేనికిని కొంచెమైన విచారము లేదు. వానికికూడ తిండి అవసరమే కాని తిండికై యవి యోచించి యోచించి చచ్చుచుండుట లేదు. తమకొఱకు తగిన యేర్పా ట్లెవరో చేయుచుందురని బాగుగ తా మెఱిఁగియున్నట్లు హాయిగా నున్నవి. మనుష్యులకొఱకు కాలోచించువారు లేకుండుట యేమి? ఎన్నియో ప్రయత్నములుచేసి, ఎన్నియో మాయలు పన్ని, ఎంతయో కష్టపడుటవలనతప్ప మనుష్యునిపొట్ట నిండ-కుండుటయేల? మనుష్యుఁడు తన సంసారమును గడపుకొనలే-కుండుట యేల? భూదేవి కింత పక్షపాత మేల? ఎవరివలన నామె కింత గౌరవముకలుగుచున్నదో వారియెడలనే యామెకు దయ లేకుండుటయేల?

ఈ రీతి నాలోచించుచు భట్టాచార్యులవారు గుడుగుడు పొగతో నొకచిన్న మేఘమును నిర్మించుచున్నాడు. ఎముకలు మాత్రము మిఁగిలియున్న దేహమువలె నున్నది వారి యిల్లు, అందు మిగిలియున్నవి ఇటికలుమాత్రమే. యింటితలుపు తెఱచి రమణియొకతె బయటికి వచ్చినది—సన్నని యెఱ్ఱంచు చీరకట్టుకొనియున్నది, చేతులకు రెండేసి శంఖపుగాజులున్నవి, నొసటను చిన్న కుంకుమబొట్టున్నది—ఆమె ఈ సామాన్య-వేషముతోనే ఆయరుగును దేదీప్యమానముచేయుచున్నది— నూతినుండి నీళ్లుతోడి వాకిటఁ జల్లినది; తులసిపీనుచుట్టు నూడ్చి

అలికినది; చేతులు కడుగుకొని చెంబెడునీళ్లు, పండ్లుపోముపుల్ల భర్తయొద్ద నుంచినది. * పిమ్మట పైటచెంగు మెడనుచుట్టుకొని భర్తయెదుటకు వచ్చి తలను నేలకుఁ దగిలించుచు భర్తకు ప్రణామముచేసి మృదుస్వరముతో, "ఇంత పెందలకడ లేచితి వేల? రాత్రి గుండెభార మంత యధికముగ నుండెను కదా, చల్లగాలి తగలనీయుచున్నావేమి?" అని యనెను.

భట్టాచార్యుఁడు హుంకా గొడకు చేరవైచి నోటి-నుండి పొగవదలి భార్యతో నిట్లనెను—"గుండెనొప్పి తగలఁ-బడ! చావు వచ్చిన బాగుండును, బాధయంతయు ఒక్కమారు వదలిపోయియుండును. చావుతప్ప మోక్షమునకు మార్గము కానరాకున్నది.

ఆసాధ్వీమణి దుఃఖితురాలై భర్తవైపు చూచుచు నిలచి యుండెను. భట్టాచార్యుఁడుకూడ మాటలు చాలించి కను బొమలు ముడుచుకొనుచు ఆ సమీపముననున్న మామిడి చెట్టువైపు చూచుచుండెను. కొంతసేపైనతరువాత ఆ రమణి "ముఖము కడుగుకొనుము," అని భర్తతో నన్నది.

"ముఖము కడుగుకొనెదనులే, కడుగుకొనుటకు తొందరేమి? ఇంట పప్పు బియ్యము ఉన్నవి కదా?"

భార్య నోటితో జబాబీయక లేదని తలయూచినది. భర్త, "భూమియమ్మినరూపాయ లైపోయినవా?" అని బిగ్గరగా నడిగెను.

* బంగాళీదేశాచారము.

ఆ రూపాయలు చాల తక్కువ, ఈ మూఁడుమాస ములును వానితోనే గడపితిమి, ఇంక ఎన్నాళ్లు రాఁగలవు?"

"నేను మాత్ర మెక్కడ తీసికొనిరాఁగలను, కన్నము వేయనా? ముష్టియెత్తనా?"

భార్య కనులు తుడుచుకొనుచు నిలిచియుండెను. భర్త విసుగుఁజెంది, "ఏడ్పుటయే మీ రెఱిఁగినది, ఏడ్పువలన కోరిక ఫలించినయెడల నేను కూడ నేడ్చియుందును," అని యనెను. కాని గొంతు తగ్గించి తక్షణమే, "నేను మఱి నేఁడు తిరుగలేను, నేటి కెట్లైన గడపుకొనుము, రేఁపటిమాట చూచుకొందము," అని యనెను.

రామశంకరుఁడు లేచి ప్రాతఃక్రియలను ముగించుకొను టకు బయలుదేఱెను. భార్య పెద్దనిట్టూర్పు విడిచి చీపురు చేతఁ బుచ్చుకొని అరుగు, వాఁకిలి తుడుచుట మొదలుపెట్టి, రెండు మూఁడు మాఱులు, 'సతీ' 'సతీ,' అని పిలిచినది.

తలుపు తెఱచి కనులు నులుముకొనుచు మొగ్గవలె కాన్పించుచుండు బాలికయొకతె అరుగుపైకి వచ్చి నిలచినది. తల్లి అంగణము తుడుచుచుండుట చూచి తల్లియొద్దకు దిగివచ్చి "ఏమమ్మా?" అని యన్నది.

"సతి యింకను లేవలేదమ్మా? అక్క వాకిలి తుడిచిన- ట్లైన నేను నీళ్లుతోడియుందును."

"నేను నీళ్లుతోడెదను," అనుచు బాలిక నూతియొద్దకు

పలుగెత్తినది. "నీవు తోడలేవే, అమ్మా, నేను వచ్చుచున్నాను బిందె అక్కడ నుండనిమ్ము," అని తల్లి బిడ్డను నివారించినది.

బాలిక ఆమాట లక్ష్యపెట్టక నీళ్లుతోడుట మొదలుపెట్టినది. మిగుల మాటలాడునది కాదు జాహ్నవి, మఱియొకటి రెండుమాటలు వద్దని కొమార్తెతో చెప్పి తనపని చేసికొనుచు పోయెను.

ఆయింటనే, వారితోఁగలసి, సతి పెద్దనాన్నగారిభార్య, వితంతువొకతె, యుండెను; ఆమె అంగణములోనికి వచ్చి నిలువఁబడి, తోడికోడలు ఇంటిపని చేయుచుండుట చూచి, పెద్ద కంఠస్వరముతో మాటలారంభించినది—"తల్లియును కూఁతురును మిగుల సందడితో పనిచేయుచున్నారు, ఆవల బియ్యము నిండుకొన్నవని ఎంత మొఱపెట్టుచున్నను మాటలు చెవినిపడనీయరు! అబ్బాయి యెక్కడికి వెళ్లినాఁడు? బజారున కిప్పుడే వెళ్లుటమంచిది, కాలీపదుఁడు లేవఁగానే అన్నము పెట్టుమనును; గొల్లది నిన్నను పాలీయనేలేదు, జ్ఞప్తియున్నదా? పాపము అదిమాత్ర మెట్లీయఁగలదు, ఈ ధోరణి చూచినచో ఏడుజన్మములవఱకు అప్పుతీర్చెదరని తోఁచ దెవరికైనను— అది, పాపము, డబ్బుగలది గనుకనా, ఎక్కడినుండి తేఁగలదు?"

జాహ్నవి భయపడుచు ప్రత్యుత్తరమిచ్చినది—"ఆ మాటలన్నియు నిప్పుడేల అక్కయ్యా? దుఃఖించి దుఃఖించి ఇప్పుడే బయటికివెళ్లినారు, వినినయెడల మిక్కిలి బాధపడుదురు! మన కిది ఎల్లప్పుడు నుండు నవస్థయే కదా! గొల్లదాని

మాట యేమంటివి? దానికి మన మంతగా నీయవలసినది లేదే, ఈ ఒక్కనెలదే మనము బాకి యున్నదంతయు!"

పెత్తల్లి ఝూంకారముతో ప్రారంభించినది, "అదిమాత్ర మేమి తక్కువా? మీకు తిన్నగా మాటలాడుటయైనను చేత కాదే! మీకక్కరలేనప్పుడు నాకుమాత్ర మెందుకు; పాలు లేక పిల్లవాడు చావనీ, మీకు చింతలేనప్పుడు నాకుమాత్ర మేల ఈబాధ!" ఇట్లు గొణుగుచు ఆవుకు గడ్డి వేయుటకు పాల లోనికి పోవ నక్కడ యామెదుఃఖము మరల రేఁగినది. "దరిద్రగొట్టు ఆవు, ఎప్పుడు చచ్చునోగాని! దూడపెద్దది కాఁగానే మఱి పాలీయదు, తిండిమాత్రము కావలెను!" అని యన్నది. సావిత్రి సంకోచించుచు, తినుటకు దానికి బాగుగ మేత దొరకుట యేదీ, పాలిచ్చుటకు!" అన్నది.

పెత్తల్లి ఆమాటలు చెవిని పడనీయలేదు. పడుకొని యున్న కుక్కదగ్గరకు పోయి కఱ్ఱతో దానివీపుపై ఒక్కపెట్టు పెట్టినది; పాప మది "కైఁ కైఁ" మనుచు లేచి పఱుగెత్తినది. ఈకథ చూచి పిట్ట భయముచెంది చూచుచుండెను. ఎదుట మఱియెవ్వరిని కానక పెత్తల్లి పిట్టపైఁబడ్డది—"అభాగ్యపు ఇంటికి అభాగ్యపు పిట్ట! ప్రొద్దుట లేచి నోటివెంట 'రామ' 'కృష్ణ' వినను లేదుకదా!"

ఈ సందడికి సతి లేచి బయటికి వచ్చి అందఱును ఏదో పనిచేయుచుండుట చూచి సిగ్గుపడుచు, 'ఎంతవేళైనది!' అని మెల్లగా అన్నది. ఆమాట పెత్తల్లి చెవినిఁబడ్డది; "దీపము వెలిఁ

గింపవలెను, పాపము, పిల్లకు చీకటిలో కండ్లు కనఁబడకున్నవి,"
అని యనుచు నామె వేళాకోళము చేసినది. సతి తప్పుచేసితినని
గ్రహించి ఆమాట కుత్తరమీయక తల్లియొద్దకు పోయి, ఆమెను
లేవమని తాను అంట్లుతోము మొదలుపెట్టినది.

"అట్లైన నేను స్నానముచేయుటకు పోయెదను,"
అన్నది జాహ్నవి.

"పొమ్ము."

భట్టాచార్యుఁడు ముఖము, కాళ్లు చేతులు, కడుగుకొని
వచ్చి అచ్చట నిలువగా అతనికొమారుఁడు, పదునాఱేండ్ల
అబ్బాయి హరిశంకరుఁడు తండ్రియొద్దకు వచ్చి ఇట్లనసాగెను.
"బడికి వెళ్లనియెడల తిట్టుట యేలుఁగుదురు, నాకు జోళ్లు లేవు,
జోళ్లు లేనిదే నలుగురిమధ్యను ఎట్లుండగలను? ఆమాత్రము
జ్ఞానముఃకుఁ—అలేదు కాబోలు! నాకు చెప్పులు కావలెను,
ఇప్పుడే కావలెను."

ఇది విని జాహ్నవి వచ్చి పిల్లవాని చేయిపట్టుకొని
వేఁడుకొనసాగెను.

"హరీ! అట్లనకుము నాయనా! ఇప్పటి కెట్లైన గడుపుకో,
తరువాత—"

"తరువాత మాత్ర మేమిటి? ఎన్నాళ్లిలాగున వెళ్లుట?
నాన్నా, నాకు నేఁడే కావలెను జోళ్లు."

"పేదయింటఁ బుట్టినవాని కింత బాబూగిరి ఎందుకయ్యా?
మన స్థితి ననుసరించి నడుచుకొనవలెను గాని మీకొఱకు

నేనిఁక కన్నము వేయుటకు బయలుదేఱవలెను కాబోలు!" అని కొంచెము తీవ్రముగా రామశంకరుఁడు జవాబిచ్చెను.

పెత్తల్లి అది విని ఝాంకారముతో పలుకనారంభించినది. "అది యంతయు వానికెట్లు తెలియును? ఆమాత్ర మీయ లేనప్పుడు తండ్రి వెట్లు కాఁగలిగితివి? పిల్లవాఁడు, బంగారు తండ్రి, ఎప్పుడును తలవాల్చుకొనియే తిరుగుచుండును. చూచుటకు సిగ్గైన కలుగదేమో?"

మూఁడేండ్ల అబ్బాయి కాళీశంకరుఁ డప్పుడు వచ్చి తల్లి చీరచెంగు పట్టుకొని, "ఆకలిగా ఉన్నదమ్మా, అన్నము పెట్టుము," అనెను. రామశంకరుఁడు వడివడిగా ఇంటిలోనికి పోయి, బట్టలచిక్కునుండి కండువాతీసెను. జాహ్నవికూడ నతని వెనుకనే ఇంటిలోనికి వచ్చి, "కండువాతీయుచున్నావు, ఎక్కడికి వెళ్లెదవు?" అని యడిగెను.

రామశంకరుఁ డామెవంక చూడక గదిలోనుండి బయటికి వచ్చెను. భార్య చిన్నకొడుకునెత్తుకొని అతనివెనుకనే యంగణములోనికి దిగి, "ఎక్కడికి పోవుచున్నావు?" అనియడిగెను.

"ఏర్పాటేదైన చేయఁగలిగినచో ఇంటికి తిరిగివచ్చెదను, లేనియెడల ఇదే ఆఖరు జాహ్నవీ," అనుచు భట్టాచార్యుఁడిల్లువెడలెను.

జాహ్నవి దిగులుఁజెందుచు పెద్దకొడుకుతో నన్నది, "హరీ, వెళ్లుము వెళ్లుము—నాన్న ఎక్కడికి వెళ్లుచున్నారో

చూడుమమ్మా, బోధపఱచి యింటికి తీసికొనిరమ్ము నాయనా, వెళ్లము తండ్రీ."

"వెళ్లుట ఎక్కడికి! ఎక్కడికిని వెళ్లఁడు—తిరిగి తిరిగి తానే మరల యిల్లుచేరుకొనును. నేను చాంద్‌పూర్ నరేన్ బాబుగారి యింటికి వెళ్లిపోవుచున్నాను. అక్కడనే ఉండిపొమ్మని నరేన్‌బాబు నన్నెంతో బలవంతపెట్టుచున్నాఁడు. మీ మాట యాలోచించి నేను దాని నొప్పుకొనకుంటిని. కాని ఇఁక మఱి ఇక్కడ నుండను—ఈ ఇంటిఅన్నము ముట్టినవాఁడు చండాలుఁడు!"

జాహ్నవినోట మాటరాలేదు, చూచుచు నచ్చటనే నిలిచిపోయినది. సతి అంట్లుతోముట మాని అన్నకడకు పఱుగెత్తి వచ్చి, "ఛీ ఛీ, అది ఏమిటి అన్నయ్యా! ఏమి నీ వనునది. నీకు పూర్తిగా మతిపోయినదా ఏమి? అట్లు పోకూడదు, రమ్ము ఇంటికి. మ మ్మిట్లు వదలి మీరు పోయిన యెడల మాగతి ఏమికాను? ఇంటివైపు మరలుము, నాన్నను తీసికొనిరమ్ము!" అని యన్నది.

"మీ కిష్టమైనట్లు మీరు చేసికొనవచ్చును, నేను మాత్రము వెళ్లక మానను."

ఇట్లనుచు హరిశంకరుఁడు ఇల్లు విడిచెను. సావిత్రి పఱుగెత్తివచ్చి అన్న చేతులు పట్టుకొని వేఁడుకొనసాగెను—"అన్నా, నీకాళ్లు పట్టుకొనుచున్నాను, కోపగింపకుము, నాన్నను పోనీయకుము, నీవు పోయి నాన్నను మరలింపు మన్నా!"

బాలికను ప్రక్కకుఁ ద్రోసి అన్న వెళ్లిపోయెను.

చిన్నవాని నెత్తుకొనియున్న జాహ్నవి ఆ యంగణము-లోనే చతికిలఁబడిపోయెను, తలపై నుండుకుసుఁగు సగము జాఱిపోయినది. బూడిదచేతులతో బొమ్మవలె నిలువఁబడి-పోయినది సతి. సావిత్రి మరల అలుకుటకు కూర్చున్నది, కాని కన్నులు నీటితో నిండుచుండుటవలన సరిగా చూడలేకున్నది. ఈవల పెత్తల్లిగారు ఈ ఘటనను దీర్ఘాలాపనతో ఏడ్పుతో వర్ణించుచు వీధివారందఱికిని చాటింపసాగెను.

రామశంకరుఁడు మనోవేగముతో ఊరిబయటికి వచ్చి రోడ్డు విడిచి పొలముగట్లపైఁబడి, ఎదుట నేదారి కనఁబడునో ఆదారినే పోవ నిశ్చయించుకొనినవానివలె, పోవుచుండెను. కాళ్లకు ముండ్లు గ్రుచ్చుకొనుచుండెను, పొలముగట్లు కాళ్లకు తగులుటచే అతడు త్రుళ్లిపడిపోవుచుండెను, కాని దేనిని లక్ష్య పెట్టకపోవుచుండెను. ప్రక్కపొలమున గూర్చుండి గొప్పు త్రవ్వుచున్న పరాణ్ మండల్ అతనిఁ జూచి, "ఇట్లెటు పోవుచున్నారు స్వామీ?" అని యడిగెను.

"యమలోకానికి," అని జబాబుచెప్పుచు రామశంకరుఁడెటు ముఖమైనను త్రిప్పక పోవుచుండెను.

అంతట, "భట్టాచార్యులుగారూ! ఈవారిని ఎక్కడికి పోవుచున్నారు?" అని మరియొకరో అడిగిరి.

భట్టాచార్యులు ముఖమెత్తి చూడ, ఆవేటలోనే నివాసము చేయుచున్న విశ్వేశ్వరమైత్ర అతనికి కనఁబడెను. చేతితో

బట్టను కొంచెమెత్తి పట్టుకొని దున్నినపొలము వెంబడి నడచుచు విశ్వేశ్వరుఁడు రామశంకరునివైపునకు వచ్చుచుండెను. రామశంకరుఁ డులికిపడి నిలిచెను. ఎవరికంటను బడకూడదని పొలముదారిపట్టిన రామశంకరుఁడు చివరకతనికి దొరికిపోయెను. విశ్వేశ్వరుఁ డతనిని సమీపించి వినయముతో మరల, "ఈదారి నెచ్చటికి పోవుచున్నారు?" అని యడిగెను.

"కోరి యెచ్చటికిని పోవుచుండలేదు, ఏ వైపునకు పోయిన నొకటే నాకు, బాబూ."

"ఇటు దారిలేదు, ఎవ్వరును ఈవైపునకు వెళ్లరు, మీ రెక్కడికి పోగోరుచున్నారీలాగు?"

"నీ వావైపునుండే వచ్చుచుండి ఎవ్వరును వెళ్లరనుచున్నా వేమి నాయనా?"

"మామూలుదారిని వెళ్లినట్లైన అలస్యమౌనని నే నీదారిని వెళ్లుచున్నాను."

"నేనుకూడ నట్లే చేయుచున్నానని అనుకొనఁగూడదా?"

"నేను తారాపూర్ ఫ్యాక్టరీ వర్తకులయొద్దకు వెళ్లియుంటిని, వర్తకమువిషయమై యేర్పాటు చేయవలసియుండెను. దగ్గఱగదా యని ఈ దారిని ఇంటికి తిరిగివచ్చుచున్నాను."

"నేను కూడ కొంచెము పనిమీఁద వెళ్లుచున్నాను బాబూ, పనిలేనిచో ఎవరైన పొలములదారి పట్టరు కదా!"

"మీరు నాదగ్గ ఱేదో దాఁచుచున్నారు భట్టాచార్యులు గారూ, చెప్పకూడనిది కానిచో నాతో చెప్పరాదా? నేను మీ వాత్సల్యమున కర్హుఁడను, పుత్రతుల్యుఁడను, నాయెదుట మీకు సంకోచమవసరము లేదు."

"సంకోచ మేల నాయనా! సంకోచ మేల?"

"నేను మీకెట్టిసాయమైన చేయఁగలిగినయెడల, కృతార్థుఁడనౌదును."

భట్టాచార్యుఁడు స్థిరనేత్రములతో ఆ యువకునివైపు పొక మాఱు చూచెను. సరళత, ఉదారత, అనురాగము వానిముఖమున కనఁబడుచుండెను—ఎట్టి నటన, ఎగతాళి, వానిలో కనఁబడలేదు. భట్టాచార్యుఁడు మృదుస్వరముతో అప్పు డిట్లనెను— "నీవు యోగ్యుఁడవని నే నెఱుఁగుదును, కాని నేనొక్కమాట యడిగెదను చెప్పుము—ఇతరులసాయమును కోరుటకు, ఇతరులకు నే నేమి సాయము చేసితిని?"

"ఉపకారరూపముగ కాదు—ప్రేమతో నిచ్చినదానిని ప్రేమతో నందుకొనుఁడు."

"ఉపాయ మేదైన చూడవలెనని బయలుదేఱితిని— ఏదియు కానరానిచో నాదారి నేను చూచుకొందును."

విశ్వేశ్వరునిదేహము కొంచెము పులకరించినది; భయపడుచు, "దేనికొఱకై మీరు చూచుచున్నారు? ఉద్యోగ మేదియైన చూచుకొన బయలుదేఱితిరా?" అని అత డడిగెను.

"మొదటి ప్రయత్నము ఉద్యోగముకొఱకే!"

"సరే, నేను చేయఁగలసాయ మందుకొనుటకు మీకిష్టము లేనప్పుడు, తారాపూర్ ఫ్యాక్టరీకి పోవుదము రండు. పది పన్ద్రెండు రూపాయల జీతముపై పనిచేయువాఁ డొకఁడు కావలెనఁట వారికి, ఆపని మీరు చేయఁగలరా?"

నేఁడే ప్రారంభించెదను. కాని జీతము మాత్రము ముందుగానే నాకు దొరకవలెను. నేఁడే జీతము నాచేతిలో పడవలెను."

"అటులే పడును, నాతో రండు."

ఇద్దఱును బయలుదేఱిరి. విశ్వేశ్వరుఁడు ముఖమటు త్రిప్పి పెద్ద నిట్టూర్పు విడిచెను—రామశంకరుఁ డెట్టియవస్థలో నున్నాఁడో అతనికి బోధపడినది.

# మూడవ పరిచ్ఛేదము

## విశ్వేశ్వరుని విషయము

విశ్వేశ్వరున దొక పల్లెటూరు. తండ్రి ధనవంతుఁడు, ఆ గ్రామములో అతనికిమించిన డబ్బు మరెవ్వరికి లేదు, కాని అతని ధోరణినిబట్టి అతఁడు ధనవంతుఁడని ఎవ్వరికినితట్టదు, అందఱును అతనిని పరమలోభి యనుచుండిరి.

అతఁడుండునది సామాన్యమైన చిన్నయిల్లు; (సాలనిండ ఆవులు, దూడలు, ఎడ్లు; కొట్లనిండ ధాన్యము, గోధుమలు. ఇంత యున్నను నౌకర్లసందడి దాసీలసందడి కనబడునదికాదు; ఇంట ఒకవంటవాఁడైనను లేఁడు. నలుగురు వచ్చి కూర్చుండు ముందుగదిలో ఒక కుర్చీ లేదు, ఒక టేబిలు లేదు—ఎట్టి ముస్తాబు లేని సామాన్యగృహస్థునియిల్లు విశ్వేశ్వరునితండ్రిది.

తండ్రి మిగుల చిక్కనివాఁడను లోకప్రఖ్యాతి. అతనికి ఒక్కఁడే కొమారుఁడు. ఈలోకములో అతనికి ఉన్నవారు, ఆకొమారుఁడు, కొమారుని పినతల్లి యొకతె. పినతల్లిసైతము చాలడబ్బుగలది యని నలుగురును అనుచుండిరి. తల్లిలేని విశ్వేశ్వరుని సంరక్షణకొఱకై పిన్ని తనయిల్లు వదలి నారాయణ చంద్రమైత్రగారియింటికి కాఁపురము మార్చినది. అదిచూచి అందఱికడుపులలో ఈర్ష్యజ్వాలలు పుట్టినవి.

ఒక్కఁడే కొడుకగుటచేత తండ్రి విశ్వేశ్వరునిపై నుండి ఒక్కక్షణమైనను కన్నులు మరలించువాఁడు కాఁడు. కను కనే విశ్వేశ్వరునకు ఆగ్రామములో ఉండు మెట్రిక్యులేషనుకు మించిన చదువు ప్రాప్తించలేదు. కాని, విశ్వవిద్యాలయములో చదువకున్నను విశ్వేశ్వరుఁడు విశేషముగ జ్ఞానమును సంపా దించెనని అందఱు ననుకొనుచుండిరి, గొప్పగొప్ప బిరుదులు పొందిన సంస్కృత పండితులుకూడ ఇతనితో చాలలేకుండిరి. ఆగ్రామముననుండు జమీందారులయింటికి పట్టణమునుండి బంధువొకఁడు ఒకమాఱు వచ్చియుండెను; అతఁడు దిగ్వి-జయుఁడగు పండితుఁడు. ఎం. ఏ. పాసైనవాఁడు. ఈ యువ కునికిఁగల భాషాజ్ఞానముచూచి యతఁడు నిశ్చేష్టుఁ డాయెను. ఇట్లనేకవిధముల అతనికీర్తి ఆగ్రామమున పురుషసంఘముల యందు వ్యాపించినది. కాని స్త్రీలసభలలోమాత్ర మతనిపేరు సుస్థాపితము కాలేదు. 'ఎన్నఁడును నోరైన తెఱవని అబ్బాయి విశ్వేశ్వరుఁడు, అని స్త్రీలనమ్మకము. కాని బుద్ధిమంతుఁడని వారు కూడ నొప్పుకొనుచుండిరి.

అసలు సంగతి యేమనిన, గ్రామములో చాలమంది అతనిని బాగుగా చూచియే యుండరు, అతని కిప్పుడు ఇరువది రెండేండ్లు. ఈ యిరువది రెండేండ్లలో విశేషభాగము ఇంటి గదులలోనే కాలముగడిపినవాఁడు విశ్వేశ్వరుఁడు. సమాన వయస్కులతో నతఁడు కలసిమెలసి తిరుగుచుండుటగాని, వారితో గంటలకొలఁది మాటలాడుచు కూర్చుండుటగాని

ఇప్పటివఱ కెన్నఁడును తటస్థించలేదు. పదునైదేండ్లప్పుడు మెట్రిక్ పాసయి స్కూలు వదలి తనగదిలో దూఱెను— ఆనాఁటినుండి నేఁటివఱకు భోజనమునకు స్నానమునకు తప్ప యాతఁడు బయటికి రాలేదనియే చెప్పవచ్చును. ఇంటి యంతఃపురముననున్న యితని గదిలోనికి పోవుటకు ఎవ్వరికిని అధికారము లేదు. ఎవరైన లోనికి వెళ్లియున్నయెడల బీరువా అంతస్తులపైని కుప్పలుకుప్పలుగనున్న పుస్తకములును, గదినడుమ చాఁపపై కూర్చుండి చదువులోమునిఁగియున్న యువకుఁడును వారికంటఁబడియుండును. పుస్తకములవిషయమై తండ్రికూడ డబ్బుకు వెనుదీయువాఁడు కాఁడు, కొడుకునకిట్టి యభ్యాస ముండుట చూచి సంతోషముకూడ పొందుచుండెను. తండ్రి సంసారచింత లేవియు కుమారునియొద్దకు నేఁటివఱకు రానీయ లేదు. కుమారునకు పెండ్లిచేసి అతనిని సంసారములో నిలబెట్టి, తనకడపటియవస్థలో కాశికి పోయి అక్కడనే కాలము గడుప వలెనని నిశ్చయించుకొనెను. కాని హఠాత్తుగా కాలదేవుని యాజ్ఞయగుటవలన, అతి ముఖ్యమైన వ్యవహారములనుగురించి కుమారునికి బోధపఱచి వానిని పిన్ని కొప్పఁజెప్పి తండ్రి జీవన యాత్రను ముగించుకొనెను.

మొదట విశ్వేశ్వరునియవస్థ నడిసముద్రముననుండు ఓడవలె నుండెను—ఎటు చూచినను దరికానరాలేదు. నిర్జన సాహిత్యమందిరమున నొంటరిగా కాలయాపనచేయుచున్న విశ్వేశ్వరుని హఠాత్తుగ సంసారసముద్రమధ్యమున వదలి

తండ్రి మాయమయ్యెను. అప్పుడే జన్మగ్రహణము చేసిన శిశువు నకువలె, విశ్వేశ్వరుని కంతయు అయోమయముగ నుండెను.

కాని సంసారము భయపడవలసినంత చిక్కైనది కాదని అతడు త్వరలో కనిపెట్టెను. ప్రతివిషయములోను తండ్రి చేసి యున్న ఏర్పాట్లు మిక్కిలి చక్కనివి. విశ్వేశ్వరునికి తెలివితేట లలో లోటులేదు. దానికికూడ ఆ తండ్రిగారే కారణము గనుక ఇంతవఱకు సాహిత్యసాగరమున నెట్టియడ్డును లేక యేరీ తిని అతఁడు ప్రయాణము చేయుచువచ్చెనో ఆదేరీతిని యిప్పుడు సంసారసాగరమునకూడ స్వచ్ఛందతతో యాత్రచేయ మొదలు పెట్టెను.

ఆ స్త్రీ మాచుకొనుట ఇంటిపనులుచక్కబెట్టుకొనుట, చేసిన తరువాతఁగూడ ప్రతిదినమును విశ్వేశ్వరునకు కావలసినంత వ్యవధి చిక్కుచుండెను. కొన్ని తోఁటలు భూములు కొని వాని యభివృద్ధికై కొంత పాటుపడుచుండెను.

కొన్నాళ్లక్రిందట ప్రారంభించియున్న గ్రామదేవత మంది రముమరమ్మతు పూర్తియైనది. పూర్తిగా పూడిపడియుండిన ఊరి పెద్దచెరువు, బురదతీయించి చక్కఁజేయుంచుటవలన, పరి శుభ్రజలముతో నిండియున్నది. మహీమ్‌పూర్ చెరువుగట్లు తెగుటవలన ప్రతిసంవత్సరము ఊరు నీట మునుగుచుండెను. ఆ గట్లుకూడ ఈ నడుమనే బలపఱుపఁబడినవి. ఈ పనులన్నియు చేయించుచుండువా రెవరో అందఱికిని సరిగా తెలియకపోయి నను, అక్కడక్కడ మాత్రము, "ఆ పసపులుబ్ధుఁడగు నారా

యణమైత్ర ధనమున కిన్నాళ్లకు సద్గతిపట్టినది,” అను మాటలు వినవచ్చుచుండెను. పరులహితమునుకోరు మహానుభావులు కొందరు విశ్వేశ్వరునియొద్దకు వచ్చి, “ఇతరులు కట్టించిన పాత వానిని బాగుచేయించుచుండుటకంటె క్రొత్తదేదైన చేయించుట మంచిది, దానివలన ఇతరులకు మేలేకాక నీకు పేరుకూడ వచ్చును,” అనుచు సదోపదేశము చేసిరి. విశ్వేశ్వరుఁ డట్టిమాటలు చెవిని పడనీయలేదు. “అంత పెద్దపనులు చేయుట నాకు సాధ్యమగునా? ఏనాలుగు రూపాయలో ఖర్చుచేసి చేయఁగల పనియే నాకు చేతనైనది,” అని యనుచుండెను. చెప్పవచ్చిన వారిలో జ్ఞానమున్నవారు కొందరు, “మీరు చేయించుచున్న పనులకు కొంచెము డబ్బగుచున్నదా?” అని యనుచుందురు. వారనుదానిలో నిజమేమియులేనట్లు తలయూడించుచు, విశ్వేశ్వరుఁడు, “అధిక మెక్కడగుచున్నది, ఖర్చుచేయఁ గల్గునంత భాగ్యవంతుఁడను కానే నేను!” అనుచుండును.

పినతల్లి అన్నపూర్ణాదేవి ఇప్పటివఱకు మనస్సున నెట్టి కలఁతయులేక యింటిభారమంతయు తానే మోయుచు, సంతోషముతో కాలముగడపుచుండెను, కాని ఒకనాఁడెందుచేతనో కాని ఇంట గొప్పవెలితియున్నట్లామెకు తోఁచినది. ఎట్టి సందడియులేక, సామాన్య సుఖదుఃఖములుకాక మరియెట్టి సందడిలేని తమ యింటిని నూతనత్వముతో నింపవలెనని కోరిక యామెకు కల్గినది; ఒకనాఁడు విశ్వేశ్వరుని పిలిచి, “నాకొక కోరిక యున్నది నాయనా విశూ,” అన్నది.

"ఏమి ఆ కోరిక పిన్నీ?"

"ఏ యిల్లు చూచినను పసిబిడ్డల నవ్వులతో కలకల్లాడు చున్నది, కాని నాయింట నేమియు లేదు!"

"దానికి మన మేమి చేయఁగలము పిన్నీ, ప్రాణములేని వస్తువులనువలె మనుష్యులను చేయలేముకదా! భగవంతుఁడు ఈయనప్పుడు మనము చేయఁగలదేమున్నది పిన్నీ?"

"కనుక నే కదా పెండ్లిచేసికొని యింటికి పిల్లను తెచ్చి యుంచుకొందురు లోకములో. చక్కనిముద్దు కోడలి నొక తెను నాయింటికి తీసికొని రావేల వికా?"

విశ్వేశ్వరుడు నవ్వుచు నిట్లనెను—"తన ముక్కు కోసి కొనియైన నితరుల ప్రయాణమున కడ్డువచ్చుట మనుష్యుని స్వభావము పిన్నీ. * పైవారి పిల్లను మనయింటికి తెచ్చుకొని చీకాకుపడుటవలన మనకు కలుగుసుఖ మేమి పిన్నీ—తల్లీ కొడుకులము ఈలాగు హాయిగా నున్నాము, మన కేమి లోపైనది చెప్పు."

"లోటేల ఉండును? కావి మన యిద్దఱితో కలిసి మఱి యొక రుండినయెడల ఇంక నెంతయానందముగా నుండునో ఊహించు."

ఒకరు వచ్చిన పిమ్మట మఱియొకరు కావలసివత్తురు. తరువాత మఱియొకరు—మానవహృదయములోని వాంఛ పెరుగుచునే యుండును. మొదటినుండి భగవంతుఁడు ఏ

* బంగాళీ సామెత.

నలుగురిని ఒక్కచోట నుంచునో ఆనలుగురు కలిసి హాయిగా నుండుటయే అన్నిటి కంటె మేలు.”

“నీయంత వెఱ్ఱివాఁడు ఈలోకములో మఱియొక్కఁడను ఉండఁడు! ఆ మాటలన్నియు నేనిఁక వినఁదలఁచుకొనలేదు, పిల్లను చూచుకొని వచ్చెదను.”

“ఆహా కావలసినంత మందిని చూచుకొనిరా పిన్నీ! నేనెఱిఁగిన నలుగురైదుగురు పిల్లల మాటకూడ నీతో చెప్పఁగలను.”

“అంతకంటె కావలసిన దేమి? ఆనలుగురిలో నొకరి నెంచుకొనిన చాలును.”

“మంచిదానవే, ఒకరినెంచుకొని మిగిలిన ముగ్గురిని పొమ్మనెదవా? అది అన్యాయము పిన్నీ, వచ్చినపిల్లలనందఱిని ఉండనీయవలెను—అప్పు డిల్లు పిల్లలతో మఱీ కలకల్లాడు చుండును.”

“ఏమి యాలోచన నా నాయనది! ఆపిచ్చిమాటలు చాలించి సరిగా చెప్పుము, పెండ్లి చేసికొనెదవా లేదా?”

నా యిష్టప్రకారము చేయవలెనని నీకున్నయెడల నీకు వచ్చినపిల్లలనందరిని ఇంటికి తీసికొని రా పిన్నీ—నేను మాత్ర-ము దేశాటనచేసి ఒకమాఱు పశ్చిమప్రాంతములుతిరిగివచ్చెదను. నీవు కాశీబృందావనములకథలు చెప్పుచుండుట, నేను కేవలము కూర్చొని వినుచుండుటమాత్రమే ఇప్పటివఱకు జరిగినది, నేను కూడ నొకమాఱు తిరిగివచ్చి నీకథలకుమించిన కథలు చెప్పెదను.

మొదట గయ వెళ్ళి నాన్నగారికి గయావర్జనము చేయవలెను. కాని పిన్నీ, నీవు నాతోకూడ నుండనియెడల నేను తిండిలేక మాడవలసివచ్చునేమో!"

"నీతో రానని నే నను చున్నానా, లేక నిన్ను వదలి వెళ్లి పోయెద ననుకొనుచున్నావా? పెండ్లి చేసికొని గయకు పోకూడదా అని నే ననునది."

"అట్లైన నన్నొక్కనినే పోనిమ్ము, నీవిక్కడనే యుండి పెండ్లియేర్పాట్లు చేయించు పిన్నీ."

"నీ విక్కడ నుండనప్పుడు పెండ్లి ఎవరికి చేయుమను చున్నావు విశూ?"

"అది నీకే తెలియవలెను?"

"ఆహా, ఏమి పిల్లవాఁడవురా నాయనా! నీవంటివాఁడు వెదకుదమన్నను దొరకఁడు! నీమాటయే కానిమ్ము, మొదట నీ వనుకొన్నదంతయు పూర్తిచేసికొని వత్తము పద. కాని నేఁడు 'నిధి' తల్లి చెప్పినమాట వినినప్పటినుండి, 'కోడలు కోడలు' అనుచు నామనస్సు ఎంతో కొట్టుకొనిపోవుచున్నది రా నాయనా!"

పిన్ని మనస్సును మరలింపగోరి, "నిధి తల్లి యేమనినది పిన్నీ—ఆమెయింట పిల్లల మంద యొకటి యున్నది చెప్పినది కాఁబోలు!" అని యడిగెను.

"ఆమెయింట పిల్లలెక్కడ? పిల్లలు కోరినంత మాత్రమున ప్రాప్తించరు, నొసట వ్రాతయుండవలెను.

"ఇప్పుడు బోధపఱచుకొనుము పిన్నీ—మనకట్టి యదృష్టము లేదని."

విశ్వేశ్వరుని మాటలు విని పిన్ని మొదట కొంచెము నవ్వి, పిమ్మట విసుకుఁజెందుచు, "చాలు చాలు! ఏమి బుద్ధిరా నాయనది! నేను నిశ్చయించుకొనినయెడల ఇంటికి ఎట్టిగా బుట్టిగా నుండు కోడలినొకతెను తీసికొని రాలేననుకొనుచున్నావా?" అని యన్నది.

విశ్వేశ్వరుఁడు మిగుల నిరుత్సాహముతో, "కాని ఒకతెతో ఇల్లువాకిలి నిండదే పిన్నీ! కనుకనే నేను అను—"

"జమీందారుగారి దాసి మన నిధితల్లితో సూచావాచా చెప్పినమాటలపైని నే నడ్డుపెట్టకపోయినయెడల ఆయింటి అమ్మాయికొఱకు ఎంతో గొప్పసంబంధము వచ్చియున్నను—"

"జమీందారుగారి దాసియింటినుండి కోడలిని తీసికొని వచ్చెదవు కాబోలు పిన్నీ? దాసికూఁతురు—" ఇట్లని మఱి పట్టలేక నవ్వసాగెను విశ్వేశ్వరుఁడు.

పిన్ని కోపముతో బిగ్గరగా నిట్లు పలికినది—"నీకేమి వెంకితనమా, విశూ? ఎవ రా దాసికూఁతురు? జమీందారుగారి కొమార్తె కమలమాట నే ననుచున్నది—గుణములలో నేమి, రూపులో నేమి, లక్ష్మీదేవివంటిది ఆమె!"

ఇంతవఱకు వచ్చి ఉత్సాహము తగ్గి పిన్ని మెల్లగా మాటలాడుట మొదలుపెట్టినది—"ఆ మాటలన్ని నీతో చెప్పి లాభమేమి? నేను వారిమాటల కేమియు జవాబీయలేదు. ఊర

కుండుంటరేమే మంచిదనుకొన్నాను. అంత పెద్దయింటిపిల్ల, వయస్సుకూడ స్వల్పముకాదు, మనవంటి సామాన్యుల యిల్లా మెకు సరిపడునా? వారితో సంబంధముచేసికొని మనము సుఖపడెదమో కష్టపడెదమో! సుఖ మెప్పుడైన సమానులతో కలియుటవల్లనే కలుగగలదు—అదికాక అసలు నీవు సగము పిచ్చి. పెండ్లిమాట వినినంతమాత్రాన వెఱ్ఱివేషము వేసి, నన్ను వదలి పాఱిపోయెదవనుచున్నావు. అందుచేత మంచిదికాదని అనుకొని నే నామాటలు వినిపించుకోలేదు."

"ఆహా, ఇదే కాఁబోలు పిన్నీ, వినిపించుకోక పోవుట!" అని విశ్వేశ్వరుఁడు పకపక నవ్వుచు, మఱియు నిట్లనసాగెను, "ఆ కోరిక నీ కస్థిగతమైపోయినది పిన్నీ, దానిముందర తీర్థయాత్ర కూడ నీ మనస్సు నాకర్షింపకున్నది."

పిన్ని కొంచెము సిగ్గుపడి, "నేనేమియు ననలేదే! జరిగిన దేదో చెప్పుచున్నాను, అంతే! పద, తీర్థయాత్ర ముందు పూర్తి చేసికొని వత్తము—తరువాత ఏది జరుగవలెనో అది జరుగును," అని యన్నది.

ఆనాఁటిసాయంకాలమే విశ్వేశ్వరుఁడు క్రొత్తగా వేయించిన అరఁటితోఁట తనిఖీచేసి యింటికి వచ్చుచుండ, కుండతో నీళ్లు మోసికొనివచ్చుచున్న బాలికయొకతె అతనికి ఎదురు పడ్డది. విశ్వేశ్వరుని చూచి ఆమె దారిప్రక్కనుండు కంచె నంటిపెట్టుకొని యతనికి దారివదలినది. అదిచూచి విశ్వేశ్వరుఁడు, "అంత ప్రక్క కేల పోవుచున్నావమ్మాయీ, ఇటువంటి వేళను

అక్కడ పాములుండవచ్చును; దారిలోనికి రమ్ము," అని మిగుల ఆతురతతో ననెను.

"మీరుమాత్ర మంతప్రక్కకు, ఆచెత్తలోనికి పోవు-చున్నారేమి?" అని యాబాలిక నవ్వుచు నడిగినది.

విశ్వేశ్వరుఁ డా ప్రశ్నకుత్తర మీయక, "దారిలోనికి రమ్ము," అనుచు తనదారిని ముందుకు నడచెను. కాని బాలిక మాత్ర మక్కడనే యూరక నిలిచియున్నది. విశ్వేశ్వరుఁడు కొంతదూరము పోయి, రోడ్డువంకలో నిలిచి వెనుకకు తిరిగి చూచెను; ఆ పిల్ల యింకను అచ్చటనే నిలిచియున్నది. విశ్వేశ్వరుఁడు కొంచెమాశ్చర్యముఁజెంది ఆమెవైపుచూచుచు నిలిచెను. పిల్ల అతనివైపే చూచుచుండెను; విశ్వేశ్వరునికన్నులామెవంక తిరుగఁగానే బాలిక ముఖము వాల్చినది. పాప మా బాలిక కేదో యతనితో మాటలాడవలసిన యవసరమున్నదని హఠాత్తుగా విశ్వేశ్వరునకుతోఁచినది; ఆ క్షణమే యామె తానెఱిఁగిన బాలికయని అతనికి తట్టినది; ఆమె యెవరిపిల్లయో అతనికి జ్ఞప్తికి రాలేదు. కాని ఇంతకుపూర్వము రెండుమూఁడు మాఱు లెక్కడనో చూచియున్నట్లుతోఁచినది. అతఁడు మరల నా బాలికయొద్దకు వచ్చి, "నీ వెవరి పిల్ల వమ్మాయీ?" అని యడిగెను.

"భట్టాచార్యులుగారి కొమార్తెను."

"ఏ భట్టాచార్యులు! రామశంకరభట్టాచార్యులా?"

"ఔను."

బాలిక మఱియేమియు ననలేదు, విశ్వేశ్వరుఁడు మరల తనదారినిపోయెను. తానుకోరి ఎవరినైనను ఎట్టి ప్రశ్నయు నడుగుట విశ్వేశ్వరునకు స్వభావవిరుద్ధము. ఎదుటివాఁడు తనతో నేదో మాటలాడఁగోరుచు, సంకోచమును జయించలేక ఊరకున్నాఁడని యెఱిఁగియున్నప్పుడుకూడ విశ్వేశ్వరుఁ డెట్టి యుపాయమును కానక గంపెడు సిగ్గుతో తలవాల్చుకొని ఊరకచూచుచుండవలసినవాఁడు. ఐనను ఆనాడు రామశంకరభట్టాచార్యుని కొమార్తెతో నట్లు మాటలాడఁగలుగుట కొకకారణముండెను. పిన్ని చెప్పుచుండఁగా వారి దురవస్థను గుఱించి యాతఁడు కొంచెము వినియుండెను. విన్నప్పటినుండి అతని కోమలహృదయమున మిక్కిలి బాధకలుగుచుండెను. భట్టాచార్యునకో అతని కొమారునకో ఏదైన పని యిప్పింపనిచో వారి కష్టములు దూరముకావని అతడు నిశ్చయించుకొనెను. ధనసాహాయ్యముగాని ఇతర సాహాయ్యమెట్టిదైననుగాని చేయుమని ఈలోకమున నెవ్వరైన తన నడుగవచ్చునని విశ్వేశ్వరుఁడెన్నఁడు కలలోనైన ననుకొనలేదు. భట్టాచార్యునికి పని కుదిర్చినపిదప అతనియవస్థ ఎట్లున్నదో విశ్వేశ్వరుఁడు తెలిసికొన ప్రయత్నింపలేదు.

విశ్వేశ్వరుఁడు పోవుచుండ ఆ బాలిక మరల నతనివంకఁ జూచినది. అప్పుడు విశ్వేశ్వరుఁ డామెకు మిక్కిలిదగ్గఱగావచ్చి, "నిన్ను నేను చాలసారులు చూచినాను, నీవు జమీందారుగారిరేవున ప్రతిదినమును స్నానముచేయుటకు వచ్చుచుందువు

కదూ?" అని యడిగెను. బాలిక మాటలాడఁ గోరుచున్నను సిగ్గుచే మాటలాడ లేకున్నదని విశ్వేశ్వరుఁడు కనిపెట్టి, ఆమెకు ధైర్యము తెప్పింప గోరి, ఆ బాలిక తిన్నగా జమీాందారుగారి రేవునుండి వచ్చుచుండుట కనిపెట్టి ఊహవలన పై ప్రశ్న నడిగెను.

సతి చిఱునవ్వు నవ్వుచు, "ఔను, ఆ రేవుననే మీారు కమలను నీటినుండి పైకితీసి బ్రతికించితిరి," అన్నది.

"కమలా ! కమల యెవరు?"

సతి కొంచెము దుఃఖముతోను, ఆశ్చర్యముతోను, "కమలను మీా రెఱుఁగరా? జమీాందారుగారి పిల్ల. ఆమెను మీారే యొకనాడు నీటినుండి తీసి బ్రతికించితిరి!" అన్నది.

విశ్వేశ్వరుఁ డాశ్చర్యపడుచు, "అది చాలరోజులక్రిందటి మాట. ఓహో, ఆమె పేరు కమలా!" అనుచు నవ్వెను.

ఆవిషయమై ప్రసంగించుటకు సతి సిద్ధముగ లేకుండినను, నేఁడు విశ్వేశ్వరుఁడు హఠాత్తుగా కనఁబడఁగానే సతి ఇన్నాళ్లు చెప్పుచుండిన కథలన్నియు నామెకు జ్ఞప్తికివచ్చినవి, కొంచెము కుతూహలముకూడ కలిగినది. కమల తనయభిప్రాయమును దాసీ మూలమున తల్లికి తెలియఁజేయఁగా తల్లి కోపగించినను, విశ్వేశ్వరుని యింటికి దాసిని పంపి వారిని కదిపి చూచి, వారియభిప్రాయము కనుఁగొనవలెనని నిశ్చయించుకొన్నది. ఇది సతి యెఱుఁగును. కమలను విశ్వేశ్వరుని కిచ్చి పెండ్లిచేయుదురని సతికి పూర్తియైన నమ్మకము. పెండ్లికాకపోవుట యెట్లుజరుగ

గలదు? ఇట్టిసంబంధ మెవరైన ఎప్పుడైనను వదలుకొందురా? కనుకనే విశ్వేశ్వరుఁడు కనబడగానే అతఁడు కాఁబోవు తన కములమగఁడని సతికి తోఁచినది; ఆతఁడు తనకుకూడ కావలసినవాఁడే యనుభావ మామెమనస్సున పుట్టినది. నాఁడు రేవున జరిగిన ఘటననుగుఱించి సతి ముచ్చటించినపైని, ఆమెసరళబుద్ధిని చూచి కొంచెము ప్రసంగించి కథను మఱికొంతదూరము నడపవలెనను కోరిక విశ్వేశ్వరునికి కలిగినది, కాని యతఁడు సిగ్గువలన నోరు విప్పలేకుండెను.

విశ్వేశ్వరునికి పిన్ని మాటలు జ్ఞప్తికి వచ్చినవి. ఎట్టిపరిచయమును లేని యాబాలిక హఠాత్తుగా నంతస్నేహముతో పలికిన మూఁడునాలుగుమాటలవలన ఆమెకూడ ఆ సమాచారమంతయు నెఱుఁగునని విశ్వేశ్వరుఁడు పోల్చుకొనెను. పినతల్లి హృదయమున నకస్మాత్తుగపుట్టిన యాకోరికకు మూలకారణము, అస్థైన, ఈజమీందారుగారిపిల్ల, కమల—ఇప్పుడు తనతో మాటలాడుచున్న యీ బాలికకు సఖి. ఈబాలిక యొక్కసరళత విశ్వేశ్వరునిసహజ సంకోచమును సగముచేసినది; లోనుండి పొంగివచ్చుచున్న నవ్వు నణఁచుకొనుచు అతఁడు, "ఆ పిల్ల కేదోసంబంధము వచ్చినదఁట కదూ?" అనియడిగెను.

"ఔను," అనుచు గుటక మ్రింగి, "మీపెండ్లిమాటలు కూడ జరుగుచుండ లేదా?" అని యడిగినది.

విశ్వేశ్వరుఁడు మఱియాపుకొనలేక నవ్వసాగెను. పిన్ని మాట లింతలో ఊరంతయు వ్యాపించెనని తెలిసికొని అతనికి

మిగుల నామోదము కలిగినది. అతడు, "ఔను నిజమే, కాని కమలపెండ్లితో ఆమాటల కేమి సంబంధము?" అని యడిగెను. తలవాల్చుకొని, సతి మృదుస్వరముతో, "కమలను మీకిచ్చి పెండ్లి చేయరా?" అని యడిగినది.

ప్రశ్నవిని విశ్వేశ్వరుఁ డాశ్చర్యమొందెను, ఆశ్చర్య-మునకుమించిన నవ్వు నవ్వెను. కాని సతి సిగ్గు పడుచుండుట చూచి ఆమె యెదుట నంత నవ్వుట యుచితము కాదని భావించి, "ఏమి, మఱియెక్కడినుండియు సంబంధము రాలేదా?" అని యడిగెను.

విశ్వేశ్వరుఁడు వేళాకోళము చేయుచుండుట బోధ-పరచుకొనలేక సతి అమాయికముగా జవాబు చెప్పినది—
"రాకేమి? చాంద్‌పూర్ జమీందారుగారి యింటినుండి వచ్చి-నది, కాని చేసికొనదు."

"ఎవరు చేసికొనరు?"

"కమల."

"పెండ్లి చేసికొనదా? నిజమే?"

"చేసికొనదు, నిజమే!"

"ఏమి?"

బాలిక యాప్రశ్నకుత్తర మీయలేకుండెను. గ్రామ బాలికలు తననే పెండ్లికొడుకునుచేసి సరదాగా ఆటలాడుచు, మాటలు జరుపుచున్నారని విశ్వేశ్వరుఁ డీ సంభాషణవలన పోల్చుకొనెను. విశ్వేశ్వరునకు అంతకంతకు నవ్వు వచ్చు

చున్నను, బాలికకు సిగ్గుతెప్పించుట తప్పని భావించి గంభీరముగ, "వారి అబ్బాయినే పెండ్లిచేసి కొనుమని చెప్పు చున్నారు, ఊరిలో గొప్ప ఉత్సవముజరుగును, మనకు ఫల హారములు విందులు ప్రాప్తించును. వారు బహుధనికులు," అని యనెను.

సతి సిగ్గుచే కనులు దించి, "మీరు మాత్రము గొప్ప వారు కారా? మీరు కూడ గొప్పగానే పెండ్లిచేయఁ గలరు," అన్నది.

"పిచ్చిదానవు! వారితో మమ్ము సరిపోల్చెదవా!"

"అట్లైన మీ రంగీకరింపలేదా? ఏమి మీ రన్నది?"

విశ్వేశ్వరుఁడు పకపక నవ్వసాగెను, కాని తత్క్షణమే న వ్వాపుకొని, "నేనే వరుఁడనైనయెడల ఫలహారములు విందులు నాకు లభింపవు, వరుఁ డుపవాసములతో చావ వలసినదే కదా! ఈ పెండ్లిలో కడుపార తినవలెనని ఎన్ని రోజులనుండియో ఆశించుచు కూర్చుండి యున్నాను, కనుక నేనుపెండ్లికొడుకును కాలేను—తెలిసినదా అమ్మాయి?" అని యనెను.

సతికి దుఃఖము కలిగినను విశ్వేశ్వరుని మాటలకు నవ్వి, "మీరు వేళాకోళము చేయుచున్నారు," అని అన్నది.

"లేదు, నిజముగా చెప్పుచున్నాను, వారిమాట నిలుప

లేనందుకు దుఃఖముగానున్నది; కాని యేమి చేయగలను, ఎంత ప్రయత్నించినను విందువాంఛ వదులుకోలేకున్నాను."

సతి పోఁబోవుట చూచి, "నీ పేరేమి అమ్మాయి? అని విశ్వేశ్వరుఁ డడిగెను.

"సతి."

"మీ అన్న యింటికి తిరిగివచ్చినాఁడా? ఆనాఁడు మీ నాన్నగారు నాతో—"

"వచ్చినాఁడు," అనుచు సతి పోవుచుండెను. విశ్వేశ్వ-రుఁడు సంకోచించుచు, "మీనాన్నగారు తారాపూర్-ఫ్యాక్టరీకి, పనిచేయుటకు ప్రతిదినమును వెళ్లుచున్నారా?" అని యడిగెను.

"వెళ్లుచున్నారు," అని వెనుకకుతిరుగక ముందుకు నడుచుచునే జబాబుచెప్పినది.

ఆమెను మఱికొన్ని సంగతులడుగవలెనని విశ్వేశ్వరు-నకు కోరికఁగలిగినది. వారిప్పుడే యువస్థలో నున్నారు? హాయిగా నున్నారా, కష్టములు పడుచున్నారా? కాని ప్రారంభములోనే సతి తొందరతొందరగా వెళ్లిపోయినది. సంకోచమువదలి ప్రశ్నపైప్రశ్న వేయుటకు తగిన సాహసము విశ్వేశ్వరుని కింకను కలుగలేదు. ఫ్యాక్టరీలో పనికుదిర్చిన నాఁటినుండి రామశంకరభట్టాచార్యు లతనికి మఱి కనఁబడ లేదు. ఆతని నొకమారు చూచిరావలెననుకోరిక విశ్వేశ్వరునికి

రెండుమూఁడు రోజులవఱకు వదలలేదు. ఐనను వారేమను కొందురో యను సంశయమువలన విశ్వేశ్వరుఁడు వారియింటికి పోఁజాలకుండెను. అప్పటినుండి యేవార్తయు లేకుండుటచేత వారు హాయిగానున్నారని యూహించెను. తిండికిలేకమాఁడు చున్న ఆకుటుంబముపైనుండి ఆపదనుతొలఁగించు మార్గమొకటి కనబఱచఁగలిగినందుకు విశ్వేశ్వరుఁడు భగవంతునకు, తన మనస్సులో నొక ప్రణామము నర్పించెను.



## నాల్గవ పరిచ్ఛేదము

### తల్లి బిడ్డల కష్టములు

నెలకు పదేసి రూపాయలచొప్పున తెచ్చి యింటి కిచ్చి భార్యాపుత్రులఋణమునుండి విముక్తుఁడనైతిననియు, వారి విషయమై తాను చేయవలసినదిగాని, యోచింపవలసినదిగాని మఱియేమియు లేదనియు భట్టాచార్యుఁడు భావించుచుండెను. మనస్సున నెట్టి విచారమును లేక వేళకు స్నానపానాదులు ముగించి, రెండుమూఁడుచిలుములు గుడుగుడు పీల్చి కొంచెము నిద్రించి లేచి, శ్రద్ధతో భార్య అందిచ్చు నీళ్లతో ముఖము కాళ్లుచేతులు కడుగుకొని, ధోవతి రెండుమాఱులు దులిపి కట్టుకొని, కండువాను పైనివేసికొని, పనికి ప్రతిదినమును బోవుచుండెను. రాత్రి యొనిమిది తొమ్మిదిగంటల కింటికి తిరిగివచ్చి భార్య భక్తితో నర్పించిన వేఁడియన్నము కూర తిని ఆఁకలి చల్లార్చుకొని హాయిగా నిద్రించుచుండెను.

పెద్దకొమారుఁడు హరిశంకరుఁడు బడి విడిచిపెట్టి కొంత కాలమైనది. ఎప్పుడో తప్ప, అతఁడు సదా చాంద్‌పూర్ జమీందారుగారి యింటియొద్దనే యుండువాఁడు. వారు వేడుకకై నాటకసంఘ మొకటి యేర్పఱచిరి. దాని ముఖ్య సామగ్రిలో హరిశంకరుఁ డొకఁడు. స్త్రీభూమికలో హరి యద్వితీయుఁడు. అతఁడు వేయు స్త్రీవేషము మిగుల చక్కఁగ

నుండునది. అందుచేతనే ఆ జమీందారు లతనిని విడువరు. మాసమున కేరెండు రోజులలో హరి యింటికి వచ్చుచుండును. తల్లిని, చెల్లెళ్లను, తమ్ముని కన్నీటిలో ముంచి మిక్కిలి చీకాకు పడుచు నిల్లు వదలుచుండును. ఆ పాడింటి పాడుతిండి, పాడు కూరలు, పాడు పఱపు వానికి అసహ్యకరముగ నుండెను. ఇది చూచి భట్టాచార్యు డంతగా దుఃఖించలేదు, గొప్పవారి నజరులోనికి వచ్చి కొడుకు చివర కొక మంచియుద్యోగమేదైన సంపాదించునని యాశించుచు నిశ్చింతగానుండెను; వాని తల దువ్వు రీతి, వాని చేతికఱ్ఱ, వానికమీజు, ధోవతి, సిగరెట్టు చూచి యెట్టి విచారమును లేక కూర్చుండి గుడుగుడు పీల్చు-చుండును. జాహ్నవీదేవి మాత్రము ఉండియుండి కన్నులు తుడుచుకొనుచుండును, తల్లి కన్నులనీరు చూచి కొమార్తె లిద్దఱును ఏడ్చుచుందురు.

ఎట్టి విశ్రాంతియు లేనివారీ ముగ్గురు ప్రాణులు మాత్రమే. ఇంటిపనులనడుమ వ్యవధి చిక్కినప్పుడెల్లను ప్రత్తి విప్పుట, యజ్ఞోపవీతములు వడకుట, చేతుతో త్రాళ్లు వేయుట మొదలగు పనులుచేయుచుందురు. బాలికలిద్దఱును తల్లికి సాయముచేయుచుందురు. కుట్టుపనికూడ జాహ్నవి బాగుగా నెఱుఁగును, కాని దానివలన అంతగా డబ్బురాదు. కనుక నిట్టి చిన్నచిన్న పనులు సదా చేయుచు నామె తమ లేమిని తగ్గించుటకు ప్రయత్నించుచుండెను. పది రూపాయలు అన్నిఖర్చులకును చాలవుకదా, పైఁగా రాఁబోవు రోజు

లెట్టివో!—సమయాసమయములకొఱకేదైన కొంచెము దాని యుంచుకొనవలసియున్నదే!

భర్తది రుగ్నశరీరము—శ్వాసరోగ మున్న దతనికి. పిల్లలిద్దఱికిని వయస్సు వచ్చుచున్నది; ఇద్దఱును మిగుల చక్కనివారు. ఐనను రూపులోను గుణములలోను ఉండు లోపములను దాచియుంచఁగలదేదియు నింటిలో లేనప్పుడు రూపు గుణములున్నను చూచి ఎవరు వారిని పెండ్లాడెదరు? ఆ అమ్మాయిల పెండ్లికై ప్రయత్నము చేయువారుమాత్ర-మేరి? జాహ్నవి యూరక కూర్చుండి నిట్టూర్పువిడుచుచు భగవంతుని స్మరించుచుండును.

మధ్యాహ్నము నిశ్శబ్దముగ నున్నది. అంట్లుతోముట, ఇల్లలుకుట మొదలగు పనులన్నియు ముగిసినవి. జాహ్నవి నారపోగులను తెచ్చి మెత్తనగునట్లు వానిని నీటిలో నాన బెట్టుచున్నది, సావిత్రి వానిని తీసి సరిచేసి పేర్చుచున్నది.

సతి తల్లివైపు చూచుచు, సంకోచముతో, "అమ్మా, కమల అత్తవారింటినుండివచ్చినది, ఒకమాఱు వెళ్లివచ్చెదను." అన్నది.

"వెళ్ళు మమ్మా; కాని ఇప్పుడెండ తీక్ష్ణముగా నున్నది, మఱి కొంచెము తాళి వెళ్లిన బాగుగ నుండదా?"

"ఎండగానున్నను బాధలేదు, మఱి కొంతసేపటికి దారిని మనుష్యులుందురు. సావిత్రీ, నాతో వచ్చెదవే?"

సావిత్రి రాననుచు తలయూచినది.

"అట్లైన నాతో ఎవరు వచ్చెదరమ్మా? నన్నొక్కదానినే వెళ్లుమనెదవా?"

"సావిత్రీ, వెళ్లుము తల్లీ! అక్క ఒక్కతే ఎట్లు పోగలదమ్మా?" అని తల్లియన్నది.

సావిత్రి యెండవలన నెఱ్ఱగ కందియున్న ముఖము నటు త్రిప్పి కన్నులపై పడుచుండు జుట్టును చేతితో వెనుకకు తోసి, విసుతెలియఁజేయు నేత్రములతో అక్కను చూచుచు, "నీవు తమ్ముని తీసికొని వెళ్లుమక్కా, నే నమ్మతో కలసి నేఁడుత్రాళ్లు పేని చూచెదను, నాకు చేతనౌనేమో," అని యనెను.

తమ్మునకు ఇది యిచ్చెద నదియిచ్చెదనని ఆశ చూపించి వానితలపై నొక తడితువాలు వేసి యెత్తుకొని సతి బయలు దేఱినది. "నీవుకూడ తలమీఁద నొక తడిగావంచా వేసికొని పొమ్మమ్మా, ఎండ తీవ్రముగానున్నది," అనుచు తల్లి వెనుకనుండి కేక వేసినది. సతి యామాట వినిపించుకొనక వెళ్లిపోయినది.

గొప్పవారియిల్లు. ఇంటిలో నడుగుపెట్టఁగానే సతికి కాళ్లు వణఁకుట మొదలుపెట్టినవి. కమల అత్తవారింటికి వెళ్లి సుమారు రెండేండ్లైనది, అప్పటినుండి సతి ఈ యింటి కొక్కమారైన రాలేదు. అప్పటికంటె వయస్సున పెద్దదయినది, సంకోచముకూడ అధికమైనది. ధనగర్వితులగువారు నోటితో మాటలాడరు; కనులతో చూచియు చూడరు. ఇఁక నెప్పుడును ఈ యింటికివచ్చుట కానిపని యని సతి తనలోతా ననుకొన్నది.

కాని కమల సతిని చూచి పఱుగెత్తుకొనివచ్చి ఆమెను కౌఁగిలించుకొనఁగానే సతి వైరాగ్యమంతయు మాయమైనది. ఈ రెండేండ్లలో కమలకు మునుపటికంటె రూపువచ్చినది, ఆమె మునుపటికంటె పుష్టిగానున్నది. సౌభాగ్య మామె కొకవిధమైన దీప్తినిచ్చినది; చక్కనివస్త్రములు, ఆభరణములు ఆమె యందమును పరిస్ఫుటము చేయుచున్నవి. సతి కమలను చూచి విస్మితురాలై నిలిచిపోయినది. కమలకూడ మొదట నేమియు ననలేకపోయినది, ఈ సతి మునుపటి నా సతి కాదా యను సందేహము కలిగినట్లె నది యామెకు. నిరుపేదయగు సతి మనస్సునందు ఆత్మగౌరవము నామెముఖమున కొక చక్కదనపు రమణీయత నిచ్చుచున్నది. సతి తనకంటె పొడవైనది, మునుపటివలె సన్నముగ నున్నది, వ్రేలాడుచున్న జుట్టు ఛాయవలె ఆమె సుకుమారశరీరము నావరించియున్నది, పెదవులపై చిఱునవ్వాడుచున్నది. వాడియున్న పెద్దపెద్ద కనులలో మాత్రము దుఃఖము దాగియున్నట్లు కనఁబడుచున్నది. కమల మెడరెత్తి, "ఎంత కఠినమైన మనసైపోయినదే నీది, మూఁడురోజులయినది నేను వచ్చి, వారమురోజులుమాత్రమే యుండఁగలను! నేనే రాఁగలిగియున్నచో వచ్చినతోడనే నీ యొద్దకు పఱుగెత్తుకొనివచ్చియుందును, అద్భుతమైనదానవే నీవు!" అన్నది. విని సతి కొంచెము నవ్వినది.

"ఇంత నీరసముగా నున్నా వేమి?" అని కమల యడిగినది.

"నీరసమా? లేదే! ఎన్నాళ్లకు నిన్ను చూచినానే అక్కా!"

"సుమారు రెండేండ్లైపోయినది. నేనుండునది యెట్టి-స్థలమో యెఱుఁగుదువా? ఒక్క దినమైనను సెలవు దొరకదు. ఎంతో ప్రయత్నముపైని ఈ నాలుగురోజులు రాగలిగితిని." ఇట్లనుచు కమల కొంచెము నవ్వినది. కమల నవ్వుట చూచి సతికూడ నవ్వుచు, "ఒప్పుకొననివా రెవరు, ఇంటివారా?" అని అడిగినది.

"మఱి యెవరు? మా అత్తమామలకు వారి కొమా-రులపై నెట్టి యధికారమును లేదు. మాతోడికోడలు మాత్రము అప్పు డప్పుడు పుట్టినింటికి వెళ్లుచుండును. నాకా యదృష్టము లేదు. తోడికోడలితో నే నామాట అన్నప్పు డామె వేళాకోళముచేయుచు, 'ఇప్పు డింకను క్రొత్త కదా! మఱి నాలుగురోజులు పోయిన తరువాత నెట్టి యభ్యంతరమును ఉండదు, క్రొత్తప్పుడు మాయవస్థ కూడ ఇప్పుడు నీ యవస్థవంటిదే!" అన్నది.

"ఎట్టి మనుష్యులే చెల్లీ, పుట్టింటికిరానీయరు!"

ఇట్లిద్దఱును మాటలాడుచు కూర్చుండిరి. కమల యనుభవించుచుండు సుఖసంపదలను గూర్చి విని సతి నిజముగ నానం-దించుచుండెను. రెండేండ్ల క్రిందటి ముచ్చట జ్ఞప్తికి వచ్చి "కమల ఎట్లున్నదో కదా!" అనుకొనుచు సతి అప్పుడప్పుడు వ్యాకులపడుచుండెను. ఎట్టి యానందములేక చీకాకు పడు

చుండు కమలముఖము వివాహసమయమున మిగుల వాడి యుండుట చూచి సతికి మిక్కిలి దుఃఖము కలిగియుండెను. అప్పు డామెకు విశ్వేశ్వరునిపై కూడ కోపము వచ్చియుండెను.

ఇన్నాళ్లకు దుఃఖముపోయినది. ప్రశ్నయొకటి యడుగ వలెనని యామెకు మిక్కిలి కుతూహలము కలిగినది, కాని యడుగకూడదేమో యని తోచి యడుగలేకుండెను. చాలసే పిట్లు మాటలైన తరువాత కమల, "కేవలము నాకథయే చెప్పు చున్నాను, ఇఁక నీసంగతి కొంచెము చెప్పుము వినెదను," అన్నది.

" నాసంగతి యేమున్నది?"

"నీ పెండ్లిమాట చెప్పవే సతీ. ఇంకెన్నాళ్లు పెండ్లి లేకుండ నుండెదవు? పెండ్లి చేసికొనవా?"

సతి కొంచెము నవ్వినది.

"నవ్వి తప్పించుకొనలేవు, చెప్పుము; పెండ్లిమాట లేమియు జరుగుచుండలేదా?"

"నాకేమి తెలియును?"

"చఁటిపిల్లవు పాపము! వయస్సు కదలక కూర్చున్నది కదూ!"

"నేనేమి చేయఁగలను, అనినంతమాత్రమున పెండ్లి అయిపోదుకదా కమలా! ప్రయత్నము చేసిచేసి అమ్మకు నాన్నకు మతిపోయి పిచ్చెత్తవలెను, ఇల్లువాకిలి అమ్మి,

చెట్టుక్రింద వంటపెట్టుకోవలెను—ఇదియంతయుం జరిగిన తరు వాత కదా నావంటిదానికి పెండ్లి కాఁగలదు!"

"చాలుచాలు, ఏమే నీవనునది! చక్కనిదానవు, కన్నుల నద్దుకొని తీసికొందు రెవ్వరైనను."

"నీవు తీసికొనెదవా? అట్లైన చెప్పుము."—ఇట్లనుచు సతి నవ్వినది. ఆ నవ్వు చూచి కమలకన్నులు తడిసినవి. "నిజమే! ఔను, అట్లైన ఉపాయ మేమి?" అని మెల్లఁగా అన్నది కమల.

"దేనికి ఉపాయము? ఇట్లేయుండి తల్లిదండ్రుల గుండెలలోని రక్తము నీరుచేయుచుందును. అంతకంటె నేను చేయఁగలదేమియున్నది! నా కీలాగుననే యుండుట అనిష్టమును కొనకుము. కాని అసలే కష్టపడుచున్నవారి పీకను పట్టుకొని యున్నాను కదా అని నాకు బాధగానున్నది!"

ఇట్లనుచు సతి లేచుచుండుట చూచి, "అప్పుడే లేచి పోవుచున్నావేమే, సతీ?" అని కమల యనెను.

"ఇఁక మఱి యుండలేను, ఇప్పుడే పోనిమ్ము దారిలో మనుష్యులుందురు, ఆలస్యమైన."

"రేపు మరల రావలెను అట్లైన."

"రేపు రాలేనేమో కాని నీవు వెళ్లిపోకముందు మఱి యొకమా తెప్పుడైన వచ్చెదను."

"ఒకమా తెప్పుడైన వచ్చెదవా! ఎట్టిదాన వైతివే సతీ! నీ వెప్పుడు కనఁబడెదవో యని నేను రాత్రింబగళ్లు చూచు

చుంటివి; ఒకమాటెప్పుడో వచ్చెదనని చెప్పుచున్నావు, అతి శాంతముగా—ఎక్కడ పోయినదే నీమనస్సు!"

తన్ను నెత్తికొని సతి యింటికి పోయినది. ఇంటికి రాఁగానే తుఫా నొకటి ప్రారంభమైనది. "పదునాలుగేండ్ల పిల్ల—పెద్ద గడెకఱ్ఱవలె నున్నది—పెద్దవారియింటికి పోనిచ్చు-టకు సిగ్గైనను లేదు," అనుచు పెత్తల్లి భరింపలేని సిగ్గుతోను, సహింపలేని అసహ్యముతోను, సప్తమస్వరమున ప్రారంభించినది; "మఱిది యింటికి రానిమ్ము సాయంకాలము, దీనికి తగిన శాస్తి చేయించనిదే నీళ్లైనను ముట్టుకొనను," అన్నది.

రాత్రి యెనిమిదైన తరువాత రామశంకరుఁ డింటికి వచ్చెను. తండ్రికి కాళ్లు చేతులు కడుగుకొనుటకు నీళ్లిచ్చినది సావిత్రి, తుడుచుకొనుటకు గావంచా యిచ్చినది; తండ్రి కాళ్లుచేతులు కడుగుకొని కూర్చుండిన తరువాత, విసనకఱ్ఱ పట్టుకొని విసరుటకు మొదలుపెట్టినది. జాహ్నవి అన్నము కూర వడ్డించినది, రామశంకరుఁడు భోజనమునకై కూర్చుండెను.

జాహ్నవి భర్తభోజనము చూచుచు ద్వారముకడ నిలిచి యుండెను. పరిస్ఫుటముగ వెలుగుచుండు ఆదీపపుకాంతిని జాహ్నవిదృష్టి హఠాత్తుగ సతిపైఁ బడినది. నిండువెన్నెల కాయుచుండ, నిరుపేదల యింటి అంగణమున ఆ యర్ధనిమీలిత-ముగు కుసుమకలికను చూచుచు ఆమె తా నెఱుఁగకయే పెద్ద నిట్టూర్పును విడిచెను. సతి అది విని అమ్మవైపు చూచెను.

గుఱ్ఱుపెట్టుచు నిప్పటివఱకు హాయిగా నిద్రించుచున్న పెత్తల్లికి హఠాత్తుగ నిద్రభంగము కలిగినది; ఆమె ఉచిత సమయమున దబ్బుదబ్బుమని అడుగులు వేయుచు వంటింటి అరుగెక్కినది. నెత్తిమీఁద నాపద పడఁబోవుచున్నదని తెలిసికొని అందఱును భయపడసాగిరి. పెత్తల్లి వంటయింట ప్రవేశించి పీటయొకటి వేసికొని మఱఁదియెదుట కూర్చుండెను. రామశంకరుఁడు తలయెత్తి ఆమెవంక నొకమాఱు చూచి మరల మనసార భోజనము చేయసాగెను. ఓర్పు వహించి యుండుట కసాధ్యమై పెత్తల్లి ప్రారంభించినది, గొంతెత్తి— "మెతుకు లేలాగున దిగుచున్నవో తెలియదు! ఈవల పదునాలుగేండ్ల పిల్ల ఒకతె, పండ్రెండేండ్లది ఒకతె—ఈ ఇద్దఱు పిల్లలు గొంతుక కడ్డుపడుచుండ లేదా?"

"ఏమి చేయఁగలను? రూపాయలు లేనిదే పిల్లలను వద లించుకొనుట యెట్లు?" అని విసుగు చెందుచు రామశంకరుఁ డన్నాఁడు.

"అట్లైన తండ్రివెట్లు కాఁగలిగితివి? పిల్ల లిద్దఱును దుఃఖపడుచు తిరుగుచున్నారు, వారివైపు చూచువారైనను లేరు. ఎట్టి కసాయివాండ్రు బాబూ, ఈ తల్లిదండ్రులు!

"ఆమాటలన్నియు ఇప్పు డేల అక్కా, అవి యెప్పుడును ఉన్నవే కదా! ఇప్పుడు—" అని మృదుస్వరముతో జాహ్నవి ప్రారంభించినది.

జాహ్నవిని మాటాడనీయక ఆకాశము బ్రద్దలగునంత బిగ్గరగ కేకలువేయుచు ప్రత్యుత్తరమిచ్చినది తోడికోడలు: "కనుకనే నా కీయింట నుండవలెనని లేదు. నన్ను పోనిండు; నాకెందుకీ అక్కరలేని బాధ! అమ్మ అయ్య హాయిగా నున్నారు, తమ కేమియు జోక్యములేనట్టు, నే నెందుకు దుఃఖ పడవలెను మధ్య? నాకేమి బాధ్యత యిందులో? నా జాతి పోదు, జాతలకు సున్నముబొట్లైనరును పెట్టరు, నన్ను చూచి యే శత్రువు నవ్వడు."

రామశంకరుఁడు భోజనము వదలి లేచి పోఁబోవు చుండ, సతి తండ్రి పాదములపై చేతులువేసి, "లేవకు, నాన్నా, భోజనముచేసి వెళ్లు," అనెను.

రామశంకరుఁడు కోపముతో కాళ్లు విసరుచు బిగ్గరగా మాటలాడసాగెను—

"మీరైనను చావవలెను, నేనైనను—" మాట పూర్తి చేయనీయకుండ ఎగశ్వాశ వచ్చినది; దగ్గిదగ్గి అతను నేలకూలఁ బడెను.

జాహ్నవి దిగులుఁజెందుచు వచ్చి యతనిగుండెపైని వీఁపుపైని చేతితో రాయసాగినది; సావిత్రి పఱుగెత్తుకొనివచ్చి తండ్రికి విసర నారంభించినది; సతి కఱ్ఱబొమ్మవలె నేలకూల బడినది.

దగ్గు సరుదుకొనిన కొంతసేపటికి, జాహ్నవి యెంతో వేఁడుకొనఁగా రామశంకరుఁడు భోజనము ముగించెను.

జాహ్నవి భర్తకు తాంబూలమిచ్చుటకు పోయినది. సతి మెల్లమెల్లగపోయి పండుకొనినది. భర్త నిద్రించుటచూచి జాహ్నవి వంటయింటికి వచ్చినది. నిద్రతో జోగుచు సావిత్రి విస్తరిప్రక్కను కూర్చుండి పిల్లిని యదరుచున్నది. "అక్క ఏదమ్మా?" అని తల్లియడిగినది.

"అక్క పండుకొనుటకు వెళ్లినది, నీవు వడ్డింపు మమ్మా! నే నక్కను పిలుచుకొని వచ్చెదను."

సావిత్రి పోయి, "అక్కా భోజనమునకు రమ్ము" అని పిలిచినది. అక్క ఏమియు నుత్తర మీయలేదు.

"అక్కా, భోజనమునకు రమ్ము, అమ్మ కనిపెట్టుకొని యున్నది, లెమ్ము."

అక్క లేవలేదు.

"లెమ్మక్కా, నీకాళ్లు పట్టుకొనెదను. నాన్న అన్న-దానిలో కోపమున కేమున్నదక్కా? దుఃఖముకొలది అన్న మాట అది."

సతి, ఏడ్చుచు, సరిగా మాటలాడలేక, "నీవు వెళ్లుము చెల్లీ, నేను భోజనముచేయను నేడు, నా కాకలి లేదు. మీరందరును భోజనము చేయుడు," అని యన్నది.

"అట్లైన నీపాదములయొద్దనే తల పగులగొట్టుకొని చచ్చిపోయెదను, లెమ్ము, అక్కా."

"సావిత్రీ, బంగారుతల్లివి! నీవువెళ్లి భోజనముచేయుము చెల్లీ; నా ఒంట్లో నేడేమియు బాగులేదు."

"నే నొప్పుకొననక్కా, రెండు మెతుకులైనను నోటిలో వేసికొని తీఱవలెను."

జాహ్నవి వచ్చి సతిని చేయిపట్టి లెవనెత్తుచు, బిగ్గరగా నిట్లు కేకలువేసెను—"బుద్ధిలేక మీారందఱును ఇట్టి పనులు చేయుచుండిన నాకు చావే మేలు—లెండు భోజనమునకు."

మారు మాటాడక అందఱును కలిసివెళ్లి భోజనము ముగించిరి.

ఉదయము లేచి రామశంకరుఁడు రెండుమూఁడు చిలుములు గుడుగుడుపీల్చి బాగుగా నాలోచించుచు భార్యతో ప్రస్తావన మొదలుపెట్టెను: "పెండ్లికొడుకును చూచుటకు నేఁడే ప్రయత్నము మొదలుపెట్టుచున్నాను; కాని ఒక సంగతి మాత్రము మఱువ వద్దు. మనకున్న యాస్తియంతయు ఈయిల్లే! ఎట్టి వరుఁడైన నాలుగైదువందలకంటె తక్కువకు రాఁడు కదా! ఇల్లు అమ్మి రూపాయలు తేవలెను, లేదా తాకట్టుపెట్టి తేవలెను—వేఱుమార్గమేదియు లేదు; జమీాందారుగారియొద్ద తాకట్టుంచి తేఁగలనేమో చూచెదను."

"వరుఁడు దొరకిన తరువాత రూపాయల ప్రయత్నము చేయవచ్చును," అని యన్నది జాహ్నవి.

"నీవు చెప్పిన దదియే, నే నెఱుఁగుదును; కాని రూపాయలు మొదట యవసరము. ఎన్ని రూపాయలో అట్టి

వరుఁడు దొరకును. ఈ పిల్లకోసము ఇల్లుముక్కకూడ నీమాఁటు ఎగిరిపోవును, ” అని యన్నాఁడు భర్త.

జాహ్నవి పోయి గదిలోనికి తొంగి చూచినది; సతి యింకను నిద్రపోవుచున్నది—ఈమాట లామెకు వినఁబడి-యుండవు—ఇట్లనుకొనుచు తల్లి కొంచెము శాంతినొంది నిట్టూర్పువిడిచినది.

---

# ఐదవ పరిచ్ఛేదము

## సతి పెండ్లి మాటలు

అన్నపూర్ణాదేవి సావిత్రీవ్రతము నతివైభవముగా జరుపుచున్నది. సదా నిశ్శబ్దమే యేలుచుండు ఆ యంగణమున దేశముననుండు ప్రజ యంతయు నేడు జమకూడినది. పిన్ని ఎప్పుడేవి చేయింపుమని చెప్పుచుండునో అది అత్యుత్సాహ-ముతో చేయించుచున్నాఁడు విశ్వేశ్వరుఁడు. వ్రతము సమాప్త మైనతరువాత పట్టుబట్టలు కట్టుకొని శాంతమూర్తియగు అన్నపూర్ణాదేవి ఎక్కడను ఎట్టిలోటును ఉండకూడదని తలఁచి, ఇది యది చూచుచు తిరుగుచున్నది.

విందు ముగిసినది, అన్నపూర్ణాదేవి ఇచ్చుచున్న తాంబూలము, యజ్ఞోపవీతములు, దక్షిణ అందుకొని బ్రాహ్మణు-లామె నాశీర్వదించుచుండిరి. ప్రేమార్ద్రనేత్రములతో అన్న-పూర్ణ విశ్వేశ్వరునిచేత అందఱికిని ప్రణామిము చేయించుచు, "వీనిని ఆశీర్వదింపుఁడు," అని యనుచున్నది.

స్త్రీలకు వేఱుగా విందుజరిగినది. సతిని సావిత్రిని తీసికొని జాహ్నవికూడ విందునకు వచ్చినది. అన్నపూర్ణ విస్మితురాలగుచు ఉండియుండి సతివంకఁ జూచుచుండెను. భోజనము చేసి తాంబూలము, బట్టలు, దక్షిణ అందుకొని

ఒక్కొక్కరు సెలవుపుచ్చుకొనిపోవుచుండిరి. అన్నపూర్ణ జాహ్నవియొద్దకు వచ్చి, "వదినా నీవు కొంచెము కూర్చుండుము. సావకాశముగా వెళ్ళవచ్చును," అన్నది. జాహ్నవి వేచియుండక తీరినది కాదు.

అందఱును వెళ్లిన తరువాత అన్నపూర్ణ వచ్చి పీట యొకటి దగ్గఱవేసికొని కూర్చున్నది. "మీ పెద్ద యమ్మాయి వయస్సెంత వదినా?" అని యడిగినది అన్నపూర్ణ.

"పదుమూడు పదునాలుగునకు తక్కువ ఉండదు," అని వాడినముఖముతో జాహ్నవి జబాబుచెప్పినది.

"పెండ్లిమాట లెవరితోనైన జరుగుచున్నవా?"

"ప్రయత్నము చేయుచున్నాను. ఇప్పటి కింకను ఎవరితోను మాటలు జరుగలేదు."

"ఇంత చక్కనిపిల్ల, ఎవరైన కనుల నద్దుకొని తీసికొనెదరు కదా, ఇంత ఆలస్యమైన దేల?" అని అన్నది అన్నపూర్ణ. జాహ్నవి ఏమియు ననలేదు. ఒక్క నిమిషమూరకుండి అన్నపూర్ణ, "మా విశుకొఱకు ఇటువంటిపిల్ల దొరకినయెడల, ఆహా, ఎంత ఆనందింతుము!" అన్నది. తల వాల్చుకొని మూలను కూర్చుండియున్న సతికి చెమటలుపట్టుచున్నవి.

జాహ్నవి, "విశుకొఱకు పిల్లలకు కొదవేమి వదినా? దీనికంటె మంచివారు లెక్కలేనంతమంది ఉన్నారు" అని మెల్లమెల్లగ నన్నది.

"నీ కొమార్తె బిడ్డలను మంచి బుద్ధిగలవారని విను చున్నాను. ఎదుగుచున్నారు, నా కొక్క మాత్రైనను కనఁబడ లేదు. మీ పెద్ద అమ్మాయిని మాకిమ్ము వదినా, నామనస్సునను౦డు మాట."

జాహ్నవి మాటలాడుశక్తిపోయినదానివలె కొంత సే- పూరకుండి, అతితీక్ష్ణస్వరముతో నిట్లనసాగెను—

"మాపిల్లదాని కట్టి యదృష్టమా! మీరు దానిని—"

"అట్టిమాటలు నిలువుము. అటువంటి పిల్లలు కాక మఱియెవ రదృష్టవంతురాం...?" నా బంగారుతల్లి, మహా- లక్ష్మివి, ర మ్మమ్మా ఇటు-పాపము ఎంత చెమటపోసినదో నన్ను కొంచెము విసరనిమ్ము."

అన్నపూర్ణ పైటచెంగుతో సతిని విసరఁబోవ, సతికి చెమట నాలుగింత లైనది. సావిత్రి అక్కకు దగ్గఱగ వచ్చి కూర్చుండి ఉండియుండి నవ్వుముఖముతో ఆమెవంక చూచు చుండెను.

"రాత్రియైనది వదినా, నాకింక సెలవిమ్ము," అని జాహ్నవి యన్నది.

"నే నడిగిన ప్రశ్న కేమందువు? సతిని మా కీయవా?"

"మీపాదములకడ సతికి స్థానము దొరకినయెడల సతి- వంటి యదృష్టవంతురాలు మఱియొక రుండదు, సతి మీపిల్లయే; ఆ విషయములో నేము చెప్పఁగలదేమున్నది? కాని విభు ఇష్టపడవలెను కదా!"

"పతినికూడ ఇష్టపడనప్పుడు వివాహము వాని నొసట లేదన్నమాట. కాని, వదినా, ఈమాటమాత్ర మిప్పు డెవ్వారికిని తెలియనీయకు. మా అబ్బాయి యెటువంటివాఁడో యెఱుఁగు-దువా? ఈ మాట యెవరినోట నైన వినినయెడల పట్టుపట్టి కూర్చుండి మన ఆశయంతయు భంగము చేయవచ్చును. నేను మెల్లమెల్లగ నంతయు స్థిరపఱచెదను, నీ వెంతమాత్రము భయపడకుము. నీ కొమార్తెను జూచి యిష్టపడని అబ్బాయి యెక్కడను ఉండఁడు. ఒకటిరెండు నెలలు తాళుము, నేను నీకు మాట ఇచ్చుచున్నాను."

ఇంటికి వచ్చి జాహ్నవి జరిగినదంతయు భర్తతో చెప్పి-నది. పండుకొనియున్న భట్టాచార్యులు లేచి కూర్చుండి, మాట-లాడ మొదలు పెట్టెను. "అట్లైన మన కెట్టిచింతయు నక్కర-లేదు. విశ్వేశ్వరుఁ డెట్టివాఁడో నీవెఱుఁగుదువా! అతఁ డొక్క పైసయైన నడుగఁడు, మనయిల్లు మనకే యుండును. పెండ్లిఖర్చుల కెక్కడనైన బదులు తెచ్చిన చాలును—ఔనా! వెనుకనుండి కొంచెము కొంచెముగ తీర్చుకొనవచ్చును." ఈధోరణిని మాట్లాడుచు పోయెను రామశంకరుఁడు.

"ఇప్పుడే అంత ఆనందింపకూడదు, వ్రాత ఉండవలెను కదా, ఇప్పు డేమియు చెప్పలేము," అని జాహ్నవి యన్నది.

"అట్లనకుము, వా రిన్నిమాటలాడువారు కారు. విశు-కూడ బహు మంచివాఁడు. ఇదికాక నాపిల్లలకు రూపులో

నెట్టిలోటును లేదు. ఈగ్రామమంతటిలో నా కొమార్తెలంత చక్కని పిల్ల లెవరైన నున్నారేమో చెప్పుము."

బిడ్డల సౌందర్యమునుగుఱించి యనుకొనుటవలన తండ్రి హృదయము గర్వముతో నిండుచుండెను. జాహ్నవి యేమియు ననలేదు. ఇంత పెద్ద యాశ అసందర్భమైన దనియు అసంభవ-మైనదనియు నామెకు తోఁచుచుండెను. అది యామె మనస్సులో నిముడకుండెను.

రెండు మూఁడు రోజులు గడచిన తరువాత అన్నపూర్ణ సతిని సావిత్రిని భోజనమునకు పిలిచినది. సతి వెళ్లుటకు మిగుల సిగ్గుపడుచుండెను, కాని వెళ్లక తీఱినది కాదు. అన్నపూర్ణ మిక్కిలి ముద్దుతో నిద్దఱిని దగ్గఱ కూర్చుండఁ బెట్టుకొని మాట-లాడుచుండెను. స్నానముచేసి, పొడిబట్టలు కట్టుకొని తెల్లని యజ్ఞోపవీతముల నొత్తుకొనుచు విశ్వేశ్వరుఁడు భోజనమునకు పిన్ని కడకు వచ్చుచుండెను. పిల్లలను చూచి యతఁడు మొదట కొంచె మాగెను, కాని మరల నేమి తలంచెనో కాని పిన్నికి దగ్గఱగ వచ్చి నిలిచి, "ఎవరి పిల్లలు పిన్నీ, ఆ యిద్దఱును?" అని యడిగెను.

"ఎవరి అమ్మాయిలో పోల్చుకొనుము," అని కుతూహలముతో పిన్ని యన్నది. సతి సిగ్గుకొలఁది తలవాల్చుకొన్నది. పిన్నిమనస్సున నున్నది ఎఱిఁగియుండుటచే సావిత్రి కూడ కొంచెము సిగ్గుపడ్డది.

విశ్వేశ్వరుఁడు, "ఈమె సతి, నేనెఱుఁగుదును, కాని ఆమె యెవరు పిన్నీ?" అని యడిగెను.

"ఆమె సతి చెల్లెలు, సావిత్రి. నీకంటికి ఎట్లు కనబడు చున్నారు విశూ?"

"బహు చక్కనివాళ్లే పిన్నీ; విందుకై పిలిచితివి కాఁబోలు, నేఁ డేమి వ్రతము పిన్నీ?"

"వ్రతము లేనిచో తమవారినైన విందుకు పిలువఁ గూడదా! వీరితో నీవు మాటలాడుచుండుము, నే నంతలో వడ్డించెదను."

పిన్ని బయటికి వెళ్లినది. విశ్వేశ్వరుఁడు కిటికీపై కూర్చుండి, "సతీ మాతమ్ముని పేరేమి? వానిని తీసికొనిరాలే దేమి?"

సిగ్గుచేత సతి ప్రాణము లెగిరిపోవుచున్నవి, ఆమెముఖ మెఱ్ఱజేసికొనుచున్నది.

సతి గడబడపడుచుండుట చూచి సావిత్రి, "మాతమ్ముని పేరు కాళీపదుఁడు, మేము బయలుదేరునప్పుడు వాఁడు నిద్రపోవుచుండెను," అని మెల్లఁగా నన్నది.

"నీపేరు సావిత్రి, కాదూ?"

"ఔను."

"నీవు మిక్కిలి చిన్నదానవై యున్నప్పుడు, అనేక సంవత్సరముల క్రిందట, ఎప్పుడో ఒకమాఱు నిన్ను చూచి-నాను, అందుచేత నేఁడు పోల్చుకొనలేకపోయినాను. సతిని

నేను చాలసార్లు చూచినాను. సతీ, నీవు చదువగలవా? ఏ యేపుస్తకములు చదివినావు—రామాయణము భారతము చదివినావా?"

అప్పటికిని సతినోటివెంట మాట రాలేదు. సతి యింతగా సిగ్గుపడుచుండుట చూచి విశ్వేశ్వరుఁడు కలవర పడుచుండెను. సావిత్రి అక్కతరఫున జవాబుచెప్పినది—"అక్క రామాయ-ణము, మహాభారతము చదివినది."

"నీవుకూడ చదివితివి కదూ?"

సావిత్రి తల వాల్చుకొన్నది.

భోజనముచేసి సతియు సావిత్రియు తమయింటికి పోయిరి. అప్పుడు పిన్ని, "ఆ యిద్దరిలో ఎక్కువ చక్కదన మెవరిది చెప్పుము చూతము," అని విశ్వేశ్వరు నడిగినది.

"ఎక్కువ చక్కదనమా!?" అని ఆశ్చర్యపడుచు, "ఇద్దఱును నాకంటికి చక్కగానే ఉన్నారు. ఎవరి చక్కదన మెక్కువయో చెప్పగలిగినంత బాగుగా పరిశీలించి చూడ లేదు,—కాని అట్లడుగుచున్నావేమి పిన్నీ?" అని విశ్వేశ్వరుఁ డనెను.

"జ్ఞానము వచ్చిన యబ్బాయివి కనుక నిన్ను పరీక్షించు చున్నాను. నేను మాత్రము సతిపైనుండి కన్నులు మరలించు కొనలేకుంటిని."

"నిజముగానే! ఔనౌను, నిజము కావచ్చును, పిల్లలిద్ద-

అను మంచిచక్కనివారు పిన్నీ, వారి కిప్పు డెట్టికష్టములులేవు గదా."

"కష్టములు లేక పోవచ్చును, కాని యెదిగిన పిల్ల యింటిలో నుండుటవలన వారికి గొప్ప చింతపట్టుకొన్నది."

"చింత యేల పిన్నీ?"

"పెండ్లి చేయలేకపోవుట చింతకు కారణము కాదా? డబ్బులేదు, పిల్లలెంత చక్కనివారైనను డబ్బులేనిదే మంచి-పెండ్లికొడుకు దొరకఁడు కదా!"

"అట్లైన నీవు రూపాయలు బదులీయ వేల పిన్నీ, మంచి పిల్లలు పాపము!" అని మిగుల ఉత్సాహముతో విశ్వేశ్వరుఁ డనెను.

"నాయింటినిండ రూపాయలు పడియున్న వనుకొన్నా-వా? సలహా యిచ్చుటకు వచ్చినాఁడు అబ్బాయి, సిగ్గులేక! రూపాయ లున్నంత మాత్రాన మంచి వరుఁడు దొరకును కాఁబోలు! అటువంటిపిల్లకుతగిన వరుఁడు సులభముగా దొర-కఁడు, అది ఎఱుగవేమో!" అని పిన్ని కోపముతో ననెను.

"నీ వనునది నిజమే పిన్నీ. అట్లైన నేను మంచివరుని కొఱకు ప్రయత్నించెదను. కాని వరుఁడు దొరకినయెడల నీవు రూపాయ లిచ్చెదవా?"

పిన్ని కోపమాపుకొనలేక, "పొమ్ము, నీతో నేను మఱి

వాదనచేయలేను, పో!...ఆహా, ఏమిబుద్ధికదా అబ్బాయిది!" అని యన్నది.

పిన్నికేల అంతకోపము వచ్చుచుండెనో తెలిసికొనలేక విశ్వేశ్వరుఁడు నవ్వుచు తన చదువుగదిలోనికి పోయెను.

ఇది జరిగిన మాసమునకు ఏదోపనిసందర్భమున విశ్వేశ్వరు డొకనాఁడు భట్టాచార్యులయింటియెదుటనుండి పోవుచుండెను. దూడతో నాడుకొనుచుండు చక్కని పసిబాలుఁ డొకఁడు విశ్వేశ్వరుని కంటఁబడెను. ఆ బాలుడే సతితమ్ముడు కాళిపదుఁడు. దూడతో నాడుకొనుచుండు ఆబాలుని పొడుచుటకు ఆ వొకటి పరుగెత్తుకొని వచ్చుచుండెను. కాని ఉల్లాస ప్రమత్తుఁడై యున్న యా బాలుని దృష్టి యటువైపునకు పోలేదు. విశ్వేశ్వరుఁ డది చూచి ఒక్కగంతున నా బాలునిచేరుకొని వానినెత్తుకొని ప్రక్కకు తొలఁగెను. దూడ విముక్తురాలగుట చూచి ఆ వాబాలుని వదలి దూడ వైపునకు పోయెను.

విశ్వేశ్వరుఁ డాబాలకునకు ధైర్యము నిచ్చుచు, మిగుల ముద్దుతో, "నీపే రేమి చిట్టివాఁడా?" అని యడిగెను.

"చిట్టివాఁడను కాను నేను. నేను కాళీపద."

"కాళీపదా! ఇప్పుడే ఆవు నిన్ను పొడిచి త్రోసివేసి యుండునే!"

"ఓస్! ఎంత తోయగలదు! దాని నొక్కతాపు తన్ని తోసియుందును!"

పిల్లవాని వణ కిప్పటికిని పూర్తిగా పోలేదు. విశ్వేశ్వరుఁడు వానికి ధైర్యమిచ్చుచుండ ద్వారము దగ్గఱనుండి "కాళీ" అని పిలుపు వినబడినది; విశ్వేశ్వరుఁడు తలయెత్తగానే సతి కంటబడినది.

సతి యులికిపడినది. విశ్వేశ్వరుఁడు దగ్గఱకు వచ్చి, "మీరింతమ్మ నిప్పుడు ఆవు ఘోరముగ పొడిచి యుండును, పిల్లవానిని జాగ్రత్తగాఉంచనియెడల ప్రమాదము జరుగవచ్చును," అని యన్నాఁడు. సతి యేమియు ననలేదు. విశ్వేశ్వరుఁడు పిల్లవానిని ఆమెచేతి కీయఁబోవుచుండ ఆమెకొంచెము వెనుకకు జరిగినది, అప్పు డెవరికంటనైన పడినచో ఏమనుకొందురో యని సతి సంకోచించినది.

విశ్వేశ్వరుఁడు పిల్లవానిని దించి సతితో, "పిల్లవానిని నెత్తుకొనుము, ఇప్పటికిని వణఁకు వదలలేదు," అన్నాఁడు. సతి తమ్ము నెత్తికొన్నది, సిగ్గుచే నామెకూడ వణఁకసాగినది.

"మా పిన్నిదగ్గఱకు వచ్చుట మానివేసినా రేమి?" అని విశ్వేశ్వరుఁ డడిగెను.

సతి జవాబుచెప్పక యింటిలోనికి పోయినది. విశ్వేశ్వరునకు కొంచెము దుఃఖము కలిగినది. సతి యేమైన ననవలసి యుండెను—అట్టిసందర్భమున నేవో రెండు మాట లనవలెను. —లేనిచో కృతజ్ఞత లేనట్లు కనబడును. ఇంతసిగ్గు ఎవరికిని కూడ శోభించదు.

అదియయి రెండు మాసము లైనది. తనఅల్లరి అబ్బా

రాణతో స్పష్టముగా నాలుగుమాటలు చెప్పవలెనని అన్నపూర్ణ అప్పటికి బోధపఱచుకొన్నది, లేనిచో విశ్వేశ్వరునకు బోధపడదు. ఇది సరియైన సమయమా కాదా యని యాలోచింపక అన్నపూర్ణ హఠాత్తుగ నొకనాడు విశ్వేశ్వరుని పిలిచి, "నీకు పెండ్లి నిశ్చయించినాను. రాఁబోవుమాసములలో సతి నిచ్చి నీకు పెండ్లి చేసెదను," అని డొంకతిరుగుడు లేక తటాలున అన్నది.

విశ్వేశ్వరుఁడు స్తంభితుఁ డాయెను, మనస్సును స్థిమిత-పఱచుకొని కొంచెము సేపైన తరువాత, "పెండ్లి యెట్లు కాఁగలదు పిన్నీ, మాకు వరుస కుదురదు," అని యనెను.

"కుదుర దెందుకు? వారిది మనది ఒకటే శాఖ, ఎదో దూరపుసంబంధ మున్నది—ఆసంబంధము పెండ్లికి అడ్డురాదు. పెండ్లి చేసికొన కోరినయెడల మాత్ర మింతకంటె మంచిపిల్ల నీ కెంత వెదకినను దొరకదు. కనుక నే నేను వారికి మాటయిచ్చి వచ్చితిని; రెండునెలలనుండి వా రాశపెట్టుకొనియున్నారు. నీవు నన్నవమానపఱుప నిశ్చయించుకొనినయెడల నేను మఱి నీయింట నుండను."

విశ్వేశ్వరుఁడు దిగులు చెంది, "ఇంతకాలము నన్ను క్షమించియున్నావు, మఱి ఒక్క సంవత్సరము తాళుము పిన్నీ, నీకాళ్లు పట్టుకొనుచున్నాను, మనస్సును కొంచెము వశపఱచు కొననిమ్ము."

"వశపఱచుకొనుట కేమున్నది. నీవు అనవసరముగ

గొడవచేయుచున్నావు. వారు పిల్లను మఱియొక సంవత్సరము పెండ్లిలేకుండ ఉంచలేరు; వారికి నాముఖము మఱి చూపింప లేను విశూ. అట్లైన నన్నిచటనుండి పోనిమ్ము.

"నీ వీ యూరు విడిచి పోయినయెడల నేను కూడ పోయెదను. కాని నాకంటె చాల మంచి వరుని సతికొఱకు నేను కుదుర్చగలను. డబ్బు మన మీఁయ వచ్చును, వారికెట్టి కష్టమును కలుగదు."

"నీకు మంచిదని తోఁచినట్లు చేయుము విశూ, కాని ఈమాట నిజము: నీ కిటువంటి పిల్ల మఱి దొరకదు, ఈమెను వదలుకొనుచున్నావు, తరువాత పశ్చాత్తాపపడుదువు."

పిన్ని ఆశవదలుకొని మాట లాపినది. పిన్నికి మిగుల దుఃఖము కలిగినదని పోల్చుకొన్నను విశ్వేశ్వరుఁడు మనస్సు త్రిప్పుకొనలేకపోయెను. 'పెండ్లి వద్దు పెండ్లివద్దు' అని అతఁడు ప్రతిదినము పాఠము వల్లించుచుండెను కాఁబోలు, హఠాత్తుగ వివాహవేషము వేసికొనలేకున్నాఁడు. పిన్ని సతిని తమయింటి కేల పిలిపించినదో విశ్వేశ్వరుఁ డిప్పుడు పోల్చుకొనెను. నాఁడది యెఱుఁగక సిగ్గులేనివానివలె మాటలాడుచుండుటవలన సతి ముఖమెట్లుచేసికొనినది—అది నేఁడు విశ్వేశ్వరునకు జ్ఞప్తికివచ్చి నటాలున, "ఛీ ఛీ—అట్టిది ఎన్నఁటికిని జరుగదు," అని అన్నాఁడు.

విశ్వేశ్వరుఁడు మఱునాఁడు రామశంకరభట్టాచార్యుని యొద్దకు పోయి తనకు వారియెడల అనురాగమును, బాంధవ్య

ములు వ్యక్తపఱచుమాటలు నాలు గాడి, తాను సతికొఱకు మంచివరుని కుదిర్చెదననియు, అన్నకు చెల్లెలపై నుండు అధి కారము తనకు సతిపై నున్నది గాన పెండ్లిఖర్చులన్నియు తానే భరించి కృతార్థుఁడను కాఁగోరుచున్నాననియు చెప్పెను.

రామశంకరుని యాత్మగౌరవమునకు దెబ్బతగిలినది, కోప-ముతో నతని కనుల చీకట్లు క్రమ్మినవి. 'తనకొమార్తె అంత హేయమైనదా!' అని తనలో తా ననకొనుచు, "ఇప్పటికే నీ ఋణము నేను తీర్చలేను, ఆ ఋణ మధికము కానిచ్చుట మంచిది కాదు నాయనా, మా సతి భారము నేను వహింపఁ-గలను—ఆవిషయమై నీవు నిశ్చింతగా నుండుము," అని రామ శంకరుఁడు పౌరుషముతో ననెను.

రామశంకరుని శాంతిపఱచి, అతనిచే నెట్లైన ఒప్పింప-వలెనని విశ్వేశ్వరుఁడు చేసిన ప్రయత్నములన్నియు నిష్ప్రయో జనమగుట చూచి దుఃఖితుఁడై యతఁడు పిన్నియొద్దకు వచ్చి జరిగినదంతయు నామెతో చెప్పెను. అది విని పిన్ని, "నేను వెళ్ళి కొన్నాళ్లు కాశీలో నుందును, వారిముఖ మిఁక చూడ లేను. నన్ను కాశీకి పంపు ఏర్పాటుచేయుము," అని దుఃఖ-ముతో నన్నది.

విశ్వేశ్వరుఁడు నెమ్మదిగా నన్నియేర్పాట్లును చేసెను. పిన్ని కాశీకి బయలుదేఱినది. విశ్వేశ్వరుఁడు పిన్నిని రైలెక్కించి యింటికి తిరిగి రావలెనని మొదటి ఏర్పాటు; అట్లుచేయక

విశ్వేశ్వరుఁడుకూడ నైరెక్కుచుండుట చూచి, "నీవెక్కడికిరా బాబూ?" అని పిన్ని అడిగినది.

"నీవెక్కడికో నేనుకూడ నక్కడికే! మఱియొక మాఱు నన్ను మాతృహీనునిగా చేయవలె ననుకొనుచున్నావా పిన్నీ?"

పిన్ని ఆ మాట కుత్తరమీయక కొమారుని తలను తన ఒడిలో పెట్టికొనినది.



# ఆఱవ పరిచ్ఛేదము

## సతి పెండ్లి

ఉన్నదంతయు పోఁగొట్టుకొనినవాని కొక విధముగ నిశ్చింత కలుగును. రోగముచే బాధపడుచుండు ముఖమున మరణానంతర మొకవిధమగు శాంతిచేరును. సతికి పెండ్లిచేసి రామశంకరుఁ డట్టి శాంతిని పొందెను, ముక్తి పొంది పెద్ద నిట్టూర్పు విడిచెను. నవగ్రామవాసియగు తీన్‌కొడిలాహిడీయను అనామధేయుఁడొకఁడు నగదు మూఁడువందలు రూపాయలు మాత్రమే పుచ్చుకొని సతిని భార్యరూపముగ నందుకొనెను.— కాదు, కాదు, చెప్పుటలో కొంచెము పొరపాటైనది—సతికి 'భార్య' అను పేరు నిచ్చెను. వరుఁ డట్టి స్వార్థతయు లేని బ్రాహ్మణుఁడు. వివాహానంతరము భార్య భర్తృగృహమునకు పోనవసరమే లేదట. బ్రాహ్మణుఁడు మితిలేని పరోపకార బుద్ధిగల వాఁడు, భట్టాచార్యుని కులమును కాపాడ బూనుకొని యిట్టి పనిచేసినవాఁడు. ఈమహాత్ముఁడు తన యింట లేమిపొడఁజూపుచున్నప్పుడెల్ల, పెండ్లి కాని పిల్ల లింటనుండుటచే దిగులుఁ జెందుచుండు తండ్రినొకనిని కనిపెట్టి, అతనిబాధ నివారించి తనలేమిని తగ్గించుకొనుచుండును. కాని ఈ వ్యాపారము ఇటుపైని ఈవిధముగా చాలారోజులు జరుగునట్లు బ్రాహ్మణు-నకు కనబడలేదు—కొలదికాలములోనే లెక్క పైసలుచేయు

మని చిత్రగుప్తుఁడు 'లాహిడీ'వారిని తొందరచేయుచున్న ట్లుండెను. కనుక మిగిలియున్న నాలుగురోజులలో తనకు సాధ్యమైనంతవఱకు ఇతరుల కుపకారమగు పనులుచేయవలెనని యతఁడు నిశ్చయించుకొనిన ట్లుండెను.

వాని మాట యటుండ నిండు. ఇప్పుడు రామశంకరుని చింతలన్నియు దూరమయినవి. పిల్లకు పెండ్లి చేయకపోవుటచే జాతి పోవునుభయ మతనిని వదలినది. ఇల్లు తాకట్టుపెట్టి పెండ్లికై మూఁడువందలరూపాయలు తేవలసి వచ్చినది. ఈ జన్మములో ఆ యప్పు దిద్దగల యాశ లేకుండుటచే ఆ విషయమై కూడ రామశంకరుఁడు నిశ్చింతగనే యుండెను. ప్రతిమాసమును వచ్చు జీతము రూపాయలు పదియు, అకాలవృద్ధుఁడైన తన రోగశరీరమును—ఇవియే ఇప్పు డతనికిగల ఆధారము. ఈరీతిగ నైన చాలరోజులు గడచునట్లు కానరాకున్నది. ఆసంగతి-రామశంకరునకు బోధపడినది. కాని బ్రతికియుండవలసిన నాలుగు రోజులైన నతనికి బహు కష్టముగ నున్నవి. సతి కనఁబడినప్పు డెల్ల నతఁ డామెను తిట్టి తఱిమివేయుచుండును, పెద్దకొడుకు ఎప్పుడో కాని యింటికి రాఁడు—తండ్రి వానినిచూచినతోడనే తిట్టి శపించి పొమ్మనుచుండును, చిన్నకొడుకును కొట్టుచుండును, సావిత్రి కంటఁబడినప్పుడెల్ల ముఖమును మరియొకవైపుత్రిప్పు కొనుచుండును. జాహ్నవి ఇప్పుడు తోడికోడలితో ఎట్టివాద-నయు చేయుచుండుటలేదు, ఏవిషయమై యైనను ప్రసంగించు చుండుటలేదు. పిల్లలొకప్పు డేడ్చుచుందురు, ఒకప్పుడు కోప

గించుచుందురు. పెత్తల్లి కేకలతో ఇల్లెగిరి పోవుచుండును. జాహ్నవి మాటాడక కనులుమాత్రము తుడుచుకొనుచుండును. శ్వాసరోగము, గుండెభారము మిక్కిలి యధికమయి రామశంకరుఁ డొక్కొకనాఁడు రాత్రింబగళ్లు బాధపడుచుండును, ఇంటివా రందఱును మిగుల దిగులుచెందుచుందురు. అట్టిసమయములయందు తనకు పథ్యపానాదులు చేసియిచ్చి సేవచేయుచుండువారినికూడ రామశంకరుఁడు తిట్టుచుండును. తిట్లుతినుచుండువారుమాత్రము నోరైనను తెఱవక నంతయు సహించియుందురు.

సతి పెండ్లియయి ఆఱుమాసము లైనది. రామశంకరుఁడు జీవములేని మరబొమ్మవలె తనపనితాను చేసికొనిపోవుచుండెను, ఫ్యాక్టరీపనికి వెళ్లుట ఒక్కనాడైన మానలేదు.

ఒకనాఁడు సాయంకాలము గొప్ప మేఘము క్రమ్మినది. సతియు సావిత్రియు తొందరతొందరగా నింటిపనులు పూర్తి చేయుచున్నారు. చేయుచున్న పని యేదోపి ఉండియుండి పరధ్యానముగ జాహ్నవి యింటిద్వారమువైపు చూచుచున్నది. నేఁ డెట్టి దురదృష్టమో! రామశంకరుఁ డింకను ఇంటికిరాలేదు! పెత్తల్లి జపతావళము చేతపుచ్చుకొని పేట చుట్టఁబెట్టి వచ్చినది. మేఘములధోరణి చూడఁగా పెత్తల్లికి పిల్లలను తిట్టుటకు అవకాశము నేఁడు చిక్కునట్లుకనఁబడలేదు, మరునాటివఱకు తాళియుండవలెనని ఆమెను తోఁచియుండవచ్చును.

గొప్పఝంకారముచేయుచు గాలివాన ప్రారంభించినది. ఇంటిపైనుండుగడ్డి యెగిరి నలుదిక్కులను ఆకాశము నావరించినది. శిథిలమైయున్న ఆ యిల్లు గాలికి కదలుచున్నది. కాటుకవంటి కారుమేఘము లింటి యంగణము నంధకారమున ముంచుచున్నవి. అరఁటిచెట్లు విఱిగిపడుచున్నవి. అంగణములోనున్న మామిడిచెట్టునుండి దబ్బుదబ్బు మని కాయలు పడుచున్నవి. కాళీపదుఁడు పెత్తల్లితో వెళ్లి మామిడికాయ లేరుటకై యల్లరిచేయుచున్నాఁడు. సతి వాని నెత్తికొని లోనికి తీసికొనిపోయి మఱపింప ప్రయత్నము చేయుచున్నది. పెత్తల్లి వాయుదేవుని తిట్టుచున్నది, కాని ఆమెతిట్లు ఆ ప్రబల వాయుప్రవాహమున కొట్టుకొనిపోవుచున్నవి.

జాహ్నవి ద్వారముపై చేరఁబడి ఆతురతతో నెవరు చూచుచు నిలిచియున్నది. గాలివానలో నలుదిక్కులను భయంకరమైన ఆందోళన జరుగుచున్నది. అట్టి అందోళనలో ద్వారము బయట నేదో పడినట్లు శబ్దమొకటి జాహ్నవి చెవినిపడ్డది. దానితో కలసి మనుష్యుని మూలుగువంటి దామెకు వినఁబడినట్లైనది, తత్క్షణమే యామె అరుగు దిగినది. సతియు సావిత్రియు వచ్చి ఆమెప్రక్కను నిలిచిరి; అడుగడుగునకు కాలుజాఱుచున్నను వారు ముగ్గురును బయటిద్వారమువైపు పఱుగెత్తిరి.

బయటను బోరగిలిపడియున్న రామశంకరుఁడు వీరికంటఁ-

బడెను. జాహ్నవి యతని నెత్తిపట్టుకొన్నది సతియు సావిత్రియు 'నాన్నా' 'నాన్నా' అనుచు నేడ్వసాగిరి.

"ఊరకుండుఁడు, ఊరకుండుఁడు వచ్చి నాకు సాయము చేయుఁడు, నే నొక్కతెనే ఆపియుంచలేకున్నాను."

చేతనములేక పడియున్న రామశంకరుని ముగ్గురును కలసి ఎంతో కష్టముపైని ఇంటిలోనికి తీసికొనిపోయిరి. తడిబట్టలు విప్పి దేహమంతయు బాగుగా తుడిచి రామశంకరుని కలుపుపై పరుండఁ బెట్టిరి. అప్పటికిని అతనికి తెలివిరాలేదు. అందఱును కలసి చేతులు వేడిచేసికొని ఆచేతుల తోను, గుడ్డమాటలుచేసి వానితోను, రామశంకరుని దేహ-మును కాచుట మొదలుపెట్టిరి. జాహ్నవియు సతియు నోరు తెఱవలేదు, సావిత్రిమాత్రము నోరు సగము విప్పి మెల్లఁగా "నాన్నా" అన్నది. నిశ్చేష్టుఁడై ఒక మూలను నిలచియున్న కాళీపదునకు అక్కమాటవలన ధైర్యము కలిగి అతఁ డేడ్వ మొదలుపెట్టెను.

"ఊరకుండు మమ్మా, కాళీ, భయమేల—నాన్న క్షేమముగా నున్నాఁడమ్మా," అని సతి తమ్ముని యోదార్చుచు, కొంచెము పాలు వెచ్చఁబెట్టుమని అమ్మతో నన్నది.

"అది నీవే చేయు మమ్మా, నేను లేవలేను," అని తల్లి క్షీణస్వరముతో ననెను.

సతి పాలు వెచ్చఁబెట్టి, ఆలిచిప్పతో కొంచెముకొంచె-ముగా తండ్రి నోటిలో పోసినది. కొంతసేపటికి అతఁడు మెల్లఁగ

కదలి, నోటిలో వేసిన పాలను మ్రింగి, రెండు మూడుసారులు పెద్దనిట్టూర్పువిడిచెను. అందఱికిని కొంచెము ప్రాణములువచ్చి-నవి, ఇటునటు కదలి సరుదుకొని కూర్చుండిరి, అప్పటివఱకు చేతులుకాళ్లు కదల్చుటకైనను ఎవ్వరికిని సాహసము లేకుం-డెను. క్రమక్రమముగ రామశంకరుఁడు కనులు విప్పి, ప్రక్కకు తిరుగుటకు కాఁబోలు ప్రయత్నము చేయుచుండెను. దగ్గఱకు వచ్చి, సతి "నాన్నా!" అన్నది.

రామశంకరుఁడు కొమార్తెవైపుచూచి, "ఎవరు?" అని యడిగెను.

"నేను నాన్నా, సతిని."

మతిలేకపడియున్న రామశంకరునిలో నేదో యొకగొప్ప శక్తి ప్రవేశించినది, కుడిచేతితో కొమార్తెను త్రోసివేయుచు మిగుల ఉద్రేకముతో, "పొమ్ము, దూరము పొమ్ము, నాసమస్త మును నాశనము చేసితివి, ఇంకను నేమి కావలెను నీకు, నన్ను కూడ మ్రింగివేయవలెననియా నీకోరిక? పొమ్ము అటుపొమ్ము," అని తండ్రి యనెను.

సతి అటు జరిగి దూరమున కూర్చున్నది. జాహ్నవి తల వాల్చుకొని మాటాడక భర్తదేహము కాచుచున్నది. సావిత్రి ముఖము వాల్చినది. "పాడు స్వభావము—పుట్టెను పుట్టినది పిడకలతోగాని పోదు!" అని పెత్తల్లి తనలోతాను గొణుగు కొన్నది.

"ఇప్పు డేలాగున్నది, కొంచెము సుళువుగానున్నదా?" అని జాహ్నవి యడిగినది.

"ఎట్లుండును? రోగము ఆరోగ్యము అన్నియును నేఁటితో ఆఖరు. నే నిఁక బ్రతుకను, కనఁబడుచుండ లేదా!"

జాహ్నవి ఉత్తరమీయలేదు. సావిత్రి ఏడ్చుచు," అట్లా అనకూడదు నాన్నా," అని యన్నది.

రామశంకరుఁడు కొమార్తె వైపు తీవ్రముగా చూచుచు "ఏమీ, మీకష్టము లధికమగునా? తండ్రి కర్తవ్యమును ఏవిషయములోనైన నేను చేయగలిగితినా, నాచావువలన మీకష్టము లధికమగుటకు? ప్రతిదినము సగము పస్తుంచి, ఉదయము మొదలు మీచేత ఇంటిపనులన్నియు చేయించి, తిట్లు తిట్టుచు మిమ్ములను పెద్దవారిని చేయుచున్నాను. నేను లేకున్నను కాఁబోవున దదియే కదా? నేను బ్రతికియున్నయెడల నీకుకూడ గంగాయాత్రికు* నొకనిని చూచి పెండ్లి చేసెద నేమో! నేను మీకు నాన్ననా? కాను కాను!" అని సావిత్రితో ననుచుండ ఉద్రేక మధికమయి రామశంకరుఁడు మరల మూర్ఛిల్లెను. అతి కష్టముపైని తెలివి రాగా, "మారి వచ్చినట్లున్నాఁడే! పంపి వేయుఁడు, వానిని త్రోలివేయుడు," అని తండ్రియనెను.

* చావు దగ్గఱపడుచున్నదని అనుమానము తట్టగానే గంగాతీరమునకు యాత్రచేయు ఆచారము ఉత్తరాదిని ఉండెను. గంగయొడ్డున ప్రాణము విడిచినయెడల పుణ్యము లభించునను నమ్మకము ఈయాచారమునకు కారణము. నదియొడ్డున ఉండియుండి ఎంతకును చావు రాక మరల నింటికి వచ్చువారుకూడ నుండిరి.

"ఏఁడీ? అన్న రాలేదే!" అన్నది సావిత్రి.

"రాలేదా? పోనిండు, వాఁడు పెట్టు ముఖాగ్ని నా కక్కరలేదు,—వానికి నరకము ప్రాప్తిల్లుగాక!"

జాహ్నవి భర్తముఖముపై చేయివేసి తడవుచు, "నిద్రపోవుటకు ప్రయత్నింపుము—బాధ కొంచెము తగ్గవచ్చును, కొంచెము నిద్రింపుము," అన్నది.

"కష్టము తగ్గుచున్నది, జాహ్నవీ, ఇదిగో ఇప్పుడే పూర్తిగా తగ్గిపోవును."

సతి కొంచెముదూరమున తలుపుదగ్గఱ కూర్చుండి-యున్నది.

తలుపు కొంచెము తీసియున్నది. అప్పటి కింకను చినుకులుపడుచున్నవి. బయటను సూచీభేద్యమగు నంధకా-రము. ఎడతెఱపిలేకుండ అందులోనుండి కప్పలబెకబెకలు వచ్చుచున్నది. చినుకులతోతడిసినదైయున్న గాలి ఉండియుండి ఝుంకారముచేయుచు ఇంటిలో ప్రవేశించుచున్నది. సతి తదేకధ్యానముగా అంధకారమువైపు చూచుచున్నది. ఆ యంధకారమున ప్రయాణమై పోఁగలిగినచో ఎన్నటికిని ఉషఃకాంతి కంటఁబడదని సతి యూహించుచున్నది కాబోలు!

రామశంకరుఁ డొక్క నిమిషము కన్నులు మూసెను, కాని తత్క్షణమే లేచి, "జాహ్నవీ!" అన్నాఁడు.

"ఏమిరా ?" అన్నది జాహ్నవి.

"కాళీపదుఁ డేడీ ?"

"అదిగో, నీ ప్రక్కనే నిద్రపోవుచున్నాడు."

అతికష్టమున నీ రామశంకరుడుసు కొమారుని తలపై చేయి ఉంచెను. జాహ్నవి అది చూచి, "ఏమి చేయు-చున్నావు?" అని యన్నది.

"ఆశీర్వదించుచున్నాను. సావిత్రి నిద్రపోవుచున్నదా?"

"నాన్నా" యనుచు సావిత్రి తండ్రియెదుటికి వచ్చి నిలిచినది. తండ్రి యామెను చూచి, "ఇటు రమ్మమ్మా, నీకు కడపటి ఆశీర్వాద మిచ్చెదను," అన్నాడు.

"నీ వట్లనిన మనస్సున కెంతో కష్టముగానుండు నాన్నా, అట్లనకు" మనుచు సావిత్రి ఏడ్వసాగినది.

"ఊరకుండు మమ్మా, సావిత్రీ, నీ వేడ్చినయెడల నాన్నకు మఱింత కష్టముగా నుండును," అని తల్లి యన్నది.

"లేదు లేదు, కష్టమేల, కష్టమేల నమ్మా? ఆశీర్వదించ నిమ్ము. హరి!—అన్నట్లు, హరి లేడు! ఐనను వానినికూడ ఆశీర్వదించుచున్నాను—ఏమియైనను కొడుకేకదా!"

"నాన్నా, అట్లైన అక్కనాశీర్వదింప వేమి? అక్కనుం గూడ నొకమా రాశీర్వదింపుము నాన్నా."

ఒకమాట పలికి రెండునిమిషము లూరకయుండి మఱి యొకమాట పలుకుచు, రామశంకరుఁ డుత్తర మీయసాగెను—"అక్కనా? సతినా?...నిజముగానే? కాదు కాదు—వేళా కోళము! తండ్రి—తండ్రినైయుండి చనిపోవువేళ పిల్ల నెగతాళిచేసి పోవచ్చునా?"

జాహ్నవి, "చూడుము, నీవు కోపగించితివని సతి గుమ్మముకడకు పోయి అక్కడ కూర్చుండియున్నది. ఒక్క మాటు దానిని పిలువుము," అని క్షీణకంఠముతో నన్నది.

రామశంకరుఁ డటు చూచుచు, "రమ్మమ్మా సతీ, రా తల్లీ," అని క్షీణస్వరముతో పిలిచెను.

సతి తలవాల్చుకొని ఎడమచేతితో కనులు మూసి-కొనుచు వచ్చి తండ్రిపాదములకడ కూర్చుండెను. "అక్కడ కాదమ్మా, ఇక్కడికి రమ్ము, నీతో చెప్పవలసినవి రెండుమాట-లున్నవి, ఇటురమ్ము, నిన్ను చాల తిట్టినాను!"

సతి ముఖమటు త్రిప్పుకొని ప్రక్కకువచ్చి కూర్చున్నది. రామశంకరుఁడు కొంతసే పామెవంక చూచి యిట్లనసాగెను— "నీకా ఆశీర్వాదము! ఆశీర్వదింపవలసిన అవసర మేమియు లేదు...... ఉండియుండును, విశ్వేశ్వరుఁడే నిన్ను—వద్దు వద్దు—ఆ మాటలన్నియు ఇప్పు డనవసరము. నన్నేమి చేయు మన్నావు తల్లీ? ఆశీర్వాదింపు మన్నావా? తండ్రి పాపములు పిల్లలదుఃఖమునకు కారణము, కనుకనే మీ కిప్పుడు దుఃఖము కలుగుచున్నది, ఇటుపై నికూడ కలుగును. నే నేమిచేయగలను తల్లీ; నా చేతిలో నేమియున్నది? నే నెఱిఁగినంతవఱకు అంత పాపము నేనెన్నఁడును చేయలేదు; పూర్వజన్మపాపఫలమేమో యిది! నీసుఖమునకు మూలమైన దానిని నా చేతితో నేనే నరికి, ఇప్పుడు నిన్నెట్లు ఆశీర్వదింపఁగలను తల్లీ! కాని ఎట్టి యుపా

యమును గానక, ఎంత దుఃఖముతో నేను నిన్ను—నాబిడ్డను—హత్య చేసితినో నీ వెఱుఁగనిది కాదు!"

సతి కఱ్ఱబొమ్మవలె కూర్చుండియుండెను. "ఇప్పుడా మాటలన్నియు నేల; కొంచెము నిద్రింపుము," అని జాహ్నవి యనెను.

"నిద్రా! మఱికొంచెము సేపైన తరువాత హాయిగా నిద్రపోయెదను. ఆ నిద్ర బహుగాఢనిద్ర—ఎట్టి చింతయు, ఎటువంటి తాపత్రయములును ఆనిద్రలో నుండవు! ఆ నిద్రవలన కలుగునది యెట్టిశాంతియో యెఱుఁగుదువా? కాని ఆ నిద్ర రాకముందు చెప్పవలసినవి రెండు మాటలున్నవి—వానిని చెప్పనిమ్ము. సతీ! అమ్మ, లేచిపోయినదా? లేదు, ఇక్కడనే యున్నది. వినుము తల్లీ. ఏమి చెప్పఁబోయినాను, మఱచిపోతినే! ఆహా, ఔను—ఆశీర్వాదమా! ఏమని నిన్నాశీర్వదింపుమన్నావు చెప్పుము తల్లీ? నేను పోవుచున్నాను-నిన్ను—"

తండ్రి వాక్యము పూర్తికాకమునుపే సతి యెట్టితడబాటును లేని స్థిరమగు కంఠముతో పలికినది. "నీవు వెళ్లి పోవుచున్నావా నాన్నా? మనసారవచ్చి సేవచేయుట నాకీ లోకములో ప్రాప్తింపలేదు. నీయొద్దకువచ్చి సేవచేయుట నాకుప్రాప్తించుఁగాక అని యాశీర్వదింపుము నాన్నా."

"నాయొద్దకు వచ్చెదవా? ఔ నౌను, తెంపులేని సుఖముండుస్థలమది,—విశ్రాంతి! ఆహా! అక్కడ నుండునది ఎట్టి

విశ్రాంతి! వచ్చెదవా సతీ? మిగుల శ్రమచెందితివి తల్లీ! ఇంత అల్పవయస్సున, ఈయౌవనమున నీ కెంతశ్రమ కలిగినదే అమ్మా! రమ్ము తల్లీ, ఇటు రమ్ము, నాయొడిలోనికి రమ్ము—నీవు చంటిదానవై యుండినప్పు డేరీతిని నిన్నొడిలో ఁకూర్చుండఁ బెట్టుకొనుచుంటినో అట్లు—రమ్ముతల్లీ మనము పోదము."

భర్తను శాంతిపఱుపఁగోరుచు జాహ్నవి అతని తలపై చేయివేసి మెల్లఁగా నిమురుచుండెను. రామశంకరుఁడు మరల ప్రారంభించెను: "ఏ మనుచుంటిని? ఔను—అపరాధుఁడను నేనే, సందేహము లేదు. నేనుచేసిన అపరాధ మేమో యెఱుఁగుదువా అమ్మా? ఎట్టి ఆధారము లేకున్నను పెండ్లియాడి, సంసారమున దిగి, బిడ్డలను కంటిని—దోషినే సందేహము లేదు. నేను పెండ్లిచేసికొంటిని నిజమే, కాని ఆ యప రాధము నాదికాదు, నా తల్లిదండ్రులది. వారి పాపము నాదుఃఖమునకు కారణము, నా పాపములు మీదుఃఖములకు మూలము. నే నపరాధి నే సందేహము లేదు తల్లీ—అట్లైన— ఆహా! ఆశీర్వాదమా! ఆశీర్వదించెదను, మఱికొంచెము తాళి." అలసట చెంది రామశంకరుఁడు మాటలాడుచునే కనులు మూసికొని నిద్రింపసాగెను.

రాత్రి చాలభాగము గడచినది. మాటిమాటికి తల్లి నిద్రింపపొమ్మని చెప్పుచుండుటవలన, సావిత్రి తండ్రిపఱుపు ప్రక్కనే నేలను పరుండి నిద్రించుచున్నది; కునుకుచు జోగుచున్నను సతి గోడనుచేరఁబడి కూర్చుండియేయున్నది; జాహ్నవి

మాత్రము రెప్పవేయక భర్తముఖమువైపు చూచుచు కూర్చుండినది.

తల్లి హఠాత్తుగ, "సతీ" అని పిలుచుచు ఆమెపై చేయి వేసినది.

సతి కనులు విప్పి, "ఏమమ్మా?" అన్నది.

"నాన్న గొంతులో ఎటువంటి శబ్దము పుట్టుచున్నదో చూడు మమ్మా, ఉండియుండి ముఖ మెట్లు చేయుచున్నారో చూడుము—ఏమి చేయుద మమ్మా."

ఏ మైన బోధపడునేమో యని, సతి కొంచెము సేపు తండ్రివైపు చూచి, "డాక్టరును పిలుచుట మంచిదమ్మా!" అని యనెను.

"తెల్లవాఱ లే దింకను, చీఁకటిగానున్నది. ఇప్పు డెట్లు పిలుచుకొని రాఁగలము?" అని జాహ్నవి యన్నది.

తల్లియు సతియు ఎంతో నెమ్మదిగా మాటలాడుచుండి-నను, సావిత్రికి తెలివివచ్చినది. లేచి నిలిచి, "నేను వెళ్లుచున్నా నమ్మా," అని ఆమె యన్నది.

"చిన్నపిల్లవు ఒకతెవే ఎట్లు పోఁగలవు?" అన్నది తల్లి.

"నేను వెళ్లెదనమ్మా, నీ వీ లోఁగా కొంచెము నిప్పు చేయుము—నే నిప్పుడే తిరిగివచ్చెదను—డాక్టరుగారి యిల్లు దూరము కాదు."

జాహ్నవి నిప్పుచేసి భర్త పాదములు కాఁచుచున్నది, కాని కనులుమాత్రము ద్వారముపై నే యున్నవి. సుమారు

ఆఁగంట యైనది, సావిత్రియు డాక్టరును గదిలోప్రవేశించిరి. అందఱికిని కొంచెము ధైర్యము వచ్చినది. రోగియవస్థ చూచి డాక్టరుగారేమియు ననలేదు. వచ్చినందులకు ఫీజుకూడ పుచ్చుకొనలేదు, రెండు మోతాదులు మందుమాత్ర మిచ్చి వెళ్లిపోయిరి.

తెలివి తప్పిన రామశంకరునకు మరల చైతన్యము రాలేదు. అతనిరోగ మంత కంత కధికమైనది. పెత్తల్లి, అప్పుడు, తన చేద్పువిని గుంపుకూడిన నలుగురు మనుష్యులచేత, చైతన్యములేని యారోగిని తులసికోటకడకు మోయించుకొని వచ్చినది. జాహ్నవి భర్తపాదములను తన ముఖముపై పెట్టుకొని తనలో తానేడ్చుచు పడియున్నది. సావిత్రి "నానా! నాన్నా!" అని మొఱపెట్టుచు గొంతుబద్దలగున ట్లేడ్చుచున్నది. సతి గంగాజలమును తండ్రినోట పోయుచున్నది. లోపలనుండి పొంగివచ్చుచున్న దుఃఖము కనులనుండి ధారలై పారుచున్నవి. పెత్తల్లి రామస్మరణ చేయుచు కూర్చుండినది.

ప్రతిదినమువలెనే నేఁడుకూడ ఉషఃకాంతి నలుదిక్కులను ప్రాకినది.

---

# ఏడవ పరిచ్ఛేదము

## సతి భర్తమరణము

ప్రపంచములో ప్రతిస్థలమున జరుగుచున్నది, ప్రతి-దినము జరుగుచున్నది—ప్రతిదినమే కాదు, ప్రతిక్షణము జరుగుచున్నది—భట్టాచార్యునియింట నేఁడు జరిగినది

ఆయింట వినఁబడుచున్న యేడ్పులవలన మొత్తులవలన, ఎట్టికలతయుఁ జెందక కాలప్రవాహము శాంతముగ పోవు-చుండెను. పరోపకారబుద్ధిగల ఆపేట యువకులు కొందఱు రామశంకరునకు చేయవలసిన ఉత్తరక్రియలలో తోడ్పడిరి, జాహ్నవి ముఖాగ్ని పెట్టవలసివచ్చినది; జ్యేష్ఠపుత్రుఁడగు హరిశంకరుఁడు గ్రామమున లేడు, చాందపూర్ జమీందారు-గారిజేట్టుతోఁ గలసి కలకత్తా వెళ్లియుండెను. సరిగా అగ్నిపెట్ట వలసిన సమయమున జాహ్నవి హఠాత్తుగ తెలివితప్పి పడి పోయినది, నలుగురు కలిసి ఆమెను లేవనెత్తి, స్నానము చేయించి, నియమానుసరణము వేషమును మార్పించి, ఇంటికి తీసికొనివచ్చి కొమార్తెల కొప్పఁజెప్పి, చేయవలసిన క్రియలు తామే ముగించి యింటికి వచ్చిరి.

శోకాచ్ఛన్నమగు దినము లతి మందముగ నడచు-చున్నవి—అవి యెవరినిగుఱించియు నాలోచించుచు కూర్చుం-డవు, ఎవరిని మన్నింపవు, విరామము లేక నడచుకొనిపోవుచునే

యుండును. మనుష్యుడుమాత్రము బలప్రయోగమువల్ల తనకు కావలసినస్థలము నాక్రమించుకొన ప్రయత్నము చేయుచున్నాఁడు.

నోట మాటలేక, యెట్టిచలనమును లేక పడియున్న తల్లి-వైపుచూచుచు సతీసావిత్రులు దినములు గడపుచున్నారు. నడుమ, అప్పుడప్పుడు, కాళీపదుఁ డేడ్చుచుండును—అక్కలు వాని నోదార్చుచుందురు. దినవారక్రియలు ప్రారంభించుటకు రెండురోజులుమాత్రమే గడువున్నది.

ప్యాక్టరీయజమానులు ధర్మబుద్ధిగలవా రగుటచేత రామశంకరుఁడు హాజరుకాని ఒకరోజునకుమాత్రము ఐదణాల నాలుగుపైసలు మినహాయించి అతనికి రావలసిన తొమ్మిదిరూపా-యల పదియణాల ఎనిమిదిపైసలును అతనియింటికి పంపిరి. దిన వారములకు వానియవసరముండునని తలంచి సతి ఆ రూపా యలను వేఱుగా నొకచోట నుంచినది. వేరుదారిలేనిచో తాము పస్తుండవచ్చును, కాని తండ్రిపరలోకసౌఖ్యమున కడ్డు రాకూడదు కదా. ప్రతిదినమును హరిరాక కందఱు నెదురు చూచుచున్నారుకాని హరి రాలేదు.

చివరకు కర్మచేయవలసిన రోజు వచ్చినది. అందఱును కలసి జాహ్నవిని కర్మచేయుటకు తీసికొనిపోవ ప్రయత్నించఁగా ఆమెకు కొంచెము తెలివి వచ్చినది. మతిలేనిదానివలె కొమార్తెలు చెప్పుచుండినదెల్ల చేసుకొనిపోవుచుండెను. నేఁడు

తెలివివచ్చుటచే ఇన్నాళ్లకామె ఒక ప్రశ్నయడిగినది—"ఇది నేనేల చేయవలెను సతీ? హరి—"

సతి తలవంచుకొని, "అన్నయ్య లేఁ డమ్మా," అన్నది.

"లేఁడా? కబురుపంపలేదా?"

"కబురుపంపితిని, కాని అది అన్నకందియుండదు, అన్న కలకత్తాలో నున్నాఁడట."

జాహ్నవి కొంచెముసేపు యోచించి, "అట్లైన కాళీచేత చేయింపుఁడు, వానికి చేతనైనంత చేయనిండు—నాన్నగారికి దానివలన తృప్తికలుగును," అని యన్నది.

ఆతేండ్ల పిల్లవాడు రోజంతయు ఉపవాసముండి కర్మ ముగించెను. కర్మ ముగిసినతరువాత సతి తమ్ముని గొనిపోయి అమ్మయొడిలో కూర్చుండఁబెట్టి, "అమ్మా! వీనిని కొంచె మిఁక చూడుము, లేనియెడల వీనిప్రాణములైనను కాపాడలేము. కొంచెము ధైర్యము తెచ్చుకొనుమమ్మా, లేకున్న మే మెవ-రిని చూచి నిలిచి యుండఁగలము?" అని యన్నది.

ఇది విని జాహ్నవి లేచి కూర్చుండి, కొమారుని ఒడిలో కూర్చుండఁబెట్టుకొని, తనచేతితో వానికి అన్నము తినిపించినది. గ్రామమునందు ధనికులు కొందఱు తమకుతోఁచి తామేవచ్చి వీరికి కొంచెము ధనసహాయము చేసిరి. నలుగురు బ్రాహ్మణులకు మాత్రమే సంతర్పణచేసి, పాప మా దరిద్రుఁడగు రామ శంకరుని యాత్మకు క్షుత్పిపాసలు తగ్గించుటకు చేయఁగలిగినది వారు చేసిరి.

జమీందారులు దుర్గేశనందిని - నాటకము నాడుటకు హరిశంకరుని తీసికొని కలకత్తా వెళ్ళియుండిరి. తరుసమాజములోకూడ ఈనాటకమునే ప్రదర్శింపఁబోవుచున్నారట, హరి 'అయేషా' భూమిక నభినయించునట, అది అతనికి కనపడుపవలెనని కలకత్తా తీసికొని వెళ్ళినారఁట. వీరందఱును కలకత్తానుండి తిరిగి వచ్చిరి. తమ గ్రామములో నాటకము ప్రదర్శింపఁబోవు నాఁడే హరిశంకరుని తండ్రి శ్రాద్ధము. హరికి తండ్రి మరణించెనని తెలిసినయెడల నాటకమంతయు పాడౌనేమో యని యోచించి ఆనాఁడు శ్రాద్ధమని హరితో నెవ్వరును చెప్పలేదు. చాంద్ పూరునకు మజూత్ పూరునకును సుమారు మూఁడు క్రోసులదూరముండును, కాని అతి సామాన్యమరణమగుటచేత ఆవార్త ఇక్కడ నెవ్వరికిని తెలియలేదు.

ఎట్లైన నేమి, నాటకము జరిగినది. గ్రామమున అయేషాను పొగడని వాఁడు లేఁడు. మిక్కిలిఆనందము కలిగి కాఁబోలు హరిశంకరునకు ఇంటి శోకమూఁఖు పోవలెనని బుద్ధిపుట్టినది. జమీందారు లడ్డు పెట్టలేదు, హరి మజూత్ పూరునకు బయలుదేఱెను. రామశంకరుఁడు చనిపోయి పదునైదు దినములైనది. భట్టాచార్యకుటుంబమువారు ఈ యల్పకాలములో తమ శోకావేగమును తగ్గించుకొనవలసివచ్చినది — దుఃఖించుటకు వ్యవధియైనను వారికేది? దినవారము లైన తరువాత ఏ రవంత మిగిలియుండెనో దానితో ఈనాలుగు రోజులు సంసార మొక

రీతిని గడుపుచువచ్చిరి, కాని భవిష్యత్తు ఘోరమగు ఘనాంధకారచ్ఛాయవలె సతీసావిత్రుల ముఖములపై పడుచుండెను.

కొమార్తె బిడ్డలును తల్లిప్రక్క నుండి లేచి వెదురుబుట్టలోనుండు నారనుతీసి నీటిలో నానబెట్టుచుండిరి. ఏకులనుండి దారము తీయుటకై మంచము క్రిందినుండు రాట్నమును బయటికితీసిరి. భోజనానంతరము అరుగుపై నిద్రించుచుండు కాళిపదుని ప్రక్కను అమ్మను పరుండబెట్టిరి. ఆమె కాళిపదుని తలపై చేయివేసి శూన్యనేత్రములతో వాసములవైపుచూచుచు పండుకొనియున్నది. పలువిధములగు తలంపులామెబుఱ్ఱలో పరుగెత్తుచున్నవి. ఎన్నాళ్లనుండియో చక్కగ నమర్పబడివచ్చుచున్న ఆమె జీవనము నేడు గ్రంథిహీనమైపోయినది. అందుండునవన్నియు కొలుమూతై నేడ దడ్డబిడ్డముగ పడియున్నవి. పృథ్వి మునుపటివలె నవ్వుతో కలకల్లాడుచున్నది, కాలము మునుపటివలెనే నిశ్చింతగా నడచుచున్నది, సూర్యుడు మునుపటివలెనే పృథ్విపై తన కిరణములను ప్రసరింపజేయుచున్నాడు, చంద్రుడు ఎప్పటివలెనే వెన్నెలను వెదజల్లుచున్నాడు, రాత్రి యెప్పటివలెనే తారాభరితమై యున్నది. ఆహా! దేనియందు చూచినను ఎంత నిర్దయ! ఇందేదియు ఒక్కనాటికైనను ఎవరివిషయమైయైన దుఃఖింపదు కాబోలు! కాని సానుభూతిరహితమగు ఈ జడపదార్థసమూహముకంటె ఈవిషయమున సచేతనమగు మానవచిత్తమే మిగుల కఠినమైన దేమో?

హరి యిల్లుచేరెను, కాని తటాలున లోపలికి వెళ్లలేక పోయెను, సందేహము కలిగించునట్టి దేదో అతనికి కనఁబడు-చున్నట్లైనది. ఇంటికేదో సంభవించినదా యను అనుమాన మతనికి కలిగినది. ఇంటికి సిరివదలినది, ఇంటి పరిశుభ్రత తగ్గినట్లు కనఁబడినది, ఇల్లు అంధకారాచ్ఛన్నముగ నున్న దనిపించినది. తండ్రి రుగ్మత అధికమై యుండునేమో యని తోఁచి హరి భయపడుచుభయపడుచు అంగణమున ప్రవేశించి, "నాన్నా" అని పిలిచెను.

పనిచేయుచు కూర్చుండియున్న సతీసావిత్రులచేతులలో నున్నవి జారి క్రిందపడినవి. జాహ్నవిదేహమున పులకరింపు పుట్టినది. భర్త కొమారునితో కలిసి వచ్చుచున్నాడా అని ఆమెకు తటాలున తోఁచినది, కాని హరి యొక్కఁడే ఆమె కంటఁబడెను. జాహ్నవి కనులు మూసికొనిపోయినవి.

పెత్తల్లికి తెలివివచ్చినది, గడిబిడపడుచు లేచి అంగణము లోనికివచ్చి యేడ్వారంభించినది— "ఓరీ నాతండ్రీ, హరీ! మీనాన్న లేదురా, నాతండ్రీ; పదునాలుగురోజులైపోయి-నదిరా నాన్న వెళ్లి పోయి! వచ్చి నీవు నిప్పైన పెట్టలేదురా, పిండమైనవేయలేదురా! ఎటువంటికొడుకువై జన్మించితివిరా నాయనా!......"

హరి నిలిచియుండిన చోటనే హఠాత్తుగ కూలఁబడెను. ఇట్టిదికూడ జరిగియుండునా! ఎదుటనుండు సావిత్రిని చూచి మిగుల కలతచెందిన కంఠముతో, "ఏమిజరిగినది సావీ?—

ఏమి?—అది—? నా న్నేడీ? నిజమేనా సావీ?—కానేరదు, ఎన్నటికిని కానేరదు!" అని హరి యనుచుండెను.

సావిత్రి రెండుచేతులతో ముఖము మూసికొన్నది. అంగణమున పండుకొనియున్న తల్లి వంకకు హరి కనులుపోయి-నవి—తెల్లని అంచులేనిబట్ట కట్టుకొనియున్నది తల్లి, జుట్టు-చింపిరిచింపిరిగా నున్నది, నీరసించి తెల్లబారినదేహముతో అతి దీనముగ నచ్చట పడియున్నది. ఎల్లప్పుడును నవ్వుముఖముతో లక్ష్మివలెనుండెడి తనతల్లియా ఈమె! అతని పాషాణనేత్రములను భేదించుకొని కన్నీరుధారలై కాఱుట మొదలు పెట్టినది. చేతులలో ముఖము దాఁచుకొని, హరి యచ్చటనే ఉండి పోయెను.

చాలసేపైన తరువాత సావిత్రి మెల్లగా, "అమ్మయొద్ద-కొకమాఱు రమ్ము, అన్నయ్యా," అని హరితో నన్నది.

"అమ్మదగ్గఱకా? వద్దువద్దు అమ్మయొద్దకు రాలేను. నన్ను పోనిమ్ము."

సతి అన్న దగ్గఱకు వచ్చి, "నీవు చేసినదానికి ప్రాయ-శ్చిత్తములేదు. అమ్మ యవస్థ బహుదుఃఖకరమైనది. ఆమెను కొంచెము చూడుము, తమ్ముఁడు బ్రతికియుండుమార్గము కని పెట్టుము. ఇక్కడనుండి పోయి నీవు చేయఁగల దేమియున్నది? రమ్ము, అమ్మయొద్దకు, వచ్చి కొంచెము మామెదగ్గఱ కూర్చుం-డుము," అని కఠినస్వరముతో ననెను. చెల్లెలిమాట నతిక్రమించి పోవుటకు హరి సాహసింపలేదు. అతఁడు లేచి నిలువఁ

గానే పెత్తల్లికేక వినఁబడినది—“ముట్టుకొనకుము—స్నానము చేయనిదే ఎవ్వరిని ముట్టుకొనకుము.”

“అట్లైన పెరటివైపునుండు చెఱువుకొద్దకు పోవము రమ్ము, ఇప్పు డేటికి పోనక్కరలేదు,” అని సతి కొంచె మాలోచించి అన్నది. బయటికి పోనిచ్చినచో అన్న పాఱిపోవు-నేమోయని అనుమానించి సతికూడ నతనితో పోయి స్నానముచేయించి మరల వాని నింటిలోనికి తీసికొనివచ్చినది. స్నానముచేసి వచ్చి హరి తల్లిప్రక్కను చాలసేపు ఏడ్చుచు కూర్చుండెను.

జాహ్నవి నిట్టూర్పు విడిచి ఇట్లనసాగెను—“ఏడ్చి యేమిప్రయోజనము నాయనా? నీమీద నెట్టికోపమును ఉంచుకొనక నిన్నాశీర్వదించుచునే నాన్నగారు వెళ్లిపోయి-నారు. నీవు బుద్ధిమంతుడవు కమ్ము, నాన్నగా రానందించు-దురు.”

జమీందారులను హరి తనలో తాను పలువిధముల దూషింపసాగెను, ఇక నెన్నఁడును వారితో నెట్టి సంపర్క-మును ఉంచుకొనననని ఒట్టుపెట్టుకొనెను. కొన్నాళ్లవఱ కతఁడు ఇల్లు వదలలేదు. అన్నకు నిజముగా దుఃఖము కలిగినది, ఇఁక మంచివారిని పడునని సతి తలఁచినది. కాని అట్టియాశ వృథా యని రెండురోజులలోనే పోల్చుకొన్నది.

నాలుగురోజులువరకు సంకోచముచే హరియేమియు ననలేకుండెను. చివర కొకనాఁడు సతితో ఇట్లనసాగెను: “సతీ,

నేనిట్లు ఇంట కూర్చుండి యున్న రోజులుగడవవు. బయటికి పోయి ఏదైన పని చూచుకొనెదను. ఇదిగో, నాయొద్దను పది రూపాయలున్నవి. ఇవి తీసికొని ఇప్పటివలెనే సంసారము జరుపుచుండుము, కొద్ది రోజులలో సమస్తభారమును నేనే వహించెదను. నీవు భయపడ వద్దు. ఈలోపున మిగుల నవసర మని తోచినయెడల చాంద్ పూర్ జమీందారుగారియింటికి ఎవరి చేతనైన వార్త పంపుము, లేదా నాపేర నొక జాబును వ్రాయుము. నేను వెంటనే వచ్చెదను—ఏమి చెల్లీ తెలిసినదా? ఇంక నేను పోయెదను, ఇక్కడ కూర్చుండియుండుటవలన ప్రయోజనము లేదు.''

అన్న చెప్పునది సతి బోధపఱచుకొని ఏమియు ననక రూపాయల నందుకొన్నది. సావిత్రి మాత్రము, ''అన్నా, మఱి రెండురోజు లుండుము. నీవు వచ్చినప్పటినుండి అమ్మకు దుఃఖము కొంచెము తగ్గినది—పోవలెనన్న మఱి రెండు రోజులైన తరు వాత పోవచ్చును,'' అనుచు దీనముగా వేడుకొనసాగెను.

''పిచ్చిదానవు నీవు—ఊరక కూర్చుండిన నెట్లు గడ చును?'' చూడుమమ్మా చెల్లీ—నేను పోవుచున్నానని అమ్మతో ఇప్పుడు చెప్పవద్దు—ఏడ్చుచు కూర్చుండు నేమో! నేను వెళ్లు చున్నాను.''

రాత్రి పనిముగించి వంటయింటికి తాళమువేసి సతి శాలీపదునికొఱకు గిన్నెడుపాలు పట్టుకొని గదిలో ప్రవేశిం చెను, ఆమె పాలగిన్నె ఉట్టిపై పెట్టి నిలిచి యుండుట చూచి

తల్లి, "వంట యింటి తలుపు వేసితివేల సతీ? అన్నయ్య భోజనము చేయఁడా! మీరు భోజనము చేయరా?" అని యడిగినది.

"అన్నయ్య భోజనము చేసినాఁడు. ఇంటిపని అయిపోయినది."

"నీవు భోజనము చేయవా? హారీ!—హారి యేఁడీ?"

సతి క్రిందికి చూచుచు, "ఏదైన ఉద్యోగమునకై ప్రయత్నించవలెనని చాంద్ పూర్ వెళ్లినాఁడమ్మా" అన్నది.

"నాతో చెప్పలే దేమి?"

"నీ వేడ్చెదవని నీతో చెప్పలేదు. రెండుమూఁడు రోజులలో మరల వచ్చెదనని చెప్పి వెళ్లెను. పనిలేకున్న ఎట్లు గడచు నన్నాఁడు, ఇంటి ఖర్చులకై పదిరూపాయలుకూడ నిచ్చెను."

జాహ్నవి ఏమియు పలుకక కొంతసే పూరకుండి, మెల్లగా—"నే నేలనేడ్చెదను; దేనివలన వానికి సుఖము కలుగునో అదియే చేయనిమ్ము," అని తల్లి యనెను.

అంతకంతకు రాత్రియగుచున్నది, ఆనాఁడు సహింప శక్యముకాని వేఁడి. సతి దీపమార్పి పైటచెంగు నేలపఱచి కిటికీ యెదుట పరుండియున్నది. జడలు జడలుగనుండు ఆమె పెద్ద జుట్టు నాలుగువైపుల నల్లుకొనియున్న నాచువలె క్రింద చెదరి పడియున్నది. బయటను ఘనమేఘాచ్ఛన్నమగు ఆషాఢాకాశమున కొంచెమైనను వెలుతురును లేదు, నక్షత్ర మొక్కటియైనను కానరాలేదు. స్తంభితమై యున్న పృథ్వి సతివలెనే

పైట చెంగుపఱచుకొని పరుండియున్నట్లున్నది, దుఃఖాక్రాంతమై అలసిపడి యున్నది.

రాతివలె నామె గుండెపై కూర్చుండియుండు భారమున కర్థమేమో సతి యెఱుఁగకుండెను. పగలు పనిలో మునిఁగి యున్నంతసే పామెకు కొంత హాయియుండును. కొంచెము వ్యవధి దొరకఁగానే ఆ భారము మరల నామెగుండెపై నొక్కుచుండును. ఇంక నెంతకాల మిట్లుండునో గదా ? ఈభార మెన్నఁటికిని ఆమెను వదలదా ? మనసార నొకమాఱు ఏడ్వవలెనని యామెకు కోరిక పుట్టుచుండెను, కాని యేడ్పు రాకుండెను.

సతి యొకసారి తలయెత్తి చూచి, "ఏమి అంధకారము!" అని తనలో తాననుకొనెను. ఆకాశమున మిణుకుమిణుకు మను చున్న నక్షత్ర మొకటి మాత్రము కనఁబడినది. "ఆ నక్షత్రము మా నాన్న యేమో!" అని ఆమెకు తోఁచినది. "నాన్న పోవు చున్నప్పుడు నన్ను రమ్మని పిలుచుచు వెళ్లిపోయెను, ఇప్పటికిని పిలుచుచున్నాఁడా ఏమి!" ఇట్లనుకొనుచు హఠాత్తుగ నా నక్షత్రమువైపు మఱియొకమాఱు చూచెను. అది మఱీ యుజ్జ్వలమై భయంకరమగు నేత్రములతో నామెవంక చూచుచున్న ట్లుండెను. భయముఁజెంది సతి లేచి కిటికీతలుపులు మూసి అమ్మ ప్రక్కను పరుండెను. నిద్రించుచున్న తమ్ముని, చెల్లెలను, అమ్మను ఒకసారి ముట్టుకొని, "పోను పోను, నాకు పోవలెనని లేదు," అని వినీ వినఁబడనట్లనెను.

మూఁడు మాసములు గడచినవి. ఈలోఁగా హరి-

శంకరుఁ డింటి కొకమాఱు వచ్చి కొన్నిరూపాయల నిచ్చి-పోయెను. ఈ రూపాయలతోను, ఆ ముగ్గురి పరిశ్రమలవ దొరకినడబ్బుతోను రోజులు గడపుకొనుచుండిరి.

సతి ప్రతిదినము ఏటికి పోవుట మానినది. స్నానము-నకై ఒకనాఁడు చెఱువు నొద్దకు పోయియుండెను, సావిత్రి ఆవుకు తవుడు కలిపిపెట్టుచుండెను, అట్టి సమయమున పోస్టు-బంట్రోతు వచ్చి, "ఉత్తరము" అని కేక వేసెను. కాళీ పదుఁడు పఱుగెత్తుకొనిపోయి ఉత్తరము తెచ్చి అమ్మచేత పెట్టెను. తల్లి తులసికోటచుట్టు అలుకుచుండెను, ఎడమచేతితో కార్డునందుకొని చదివినది. చదివి వణకుచు, అలుకుచున్న పేడలోనే చతికిలఁ బడిపోయినది.

సతి స్నానముచేసి వచ్చి వంటయింట నీళ్లబిందె నుంచి తల్లి దగ్గఱకు వచ్చి నిలిచి, "ఏ మమ్మా, వణఁకుచున్నావేమి?" అని భయపడుచు నడిగెను. తల్లి ఏమియు నుత్తరమీయ లేదు.

కార్డు ప్రక్కను పడియున్నది. సతి దానిని తీసి చదివి-నది—నవగ్రామవాసియగు తీన్‌కొడిలాహిరిగారు పరలోక-ప్రాప్తులైనారు. అతని కొమారుఁడు ఈవార్త సవతితల్లికి తెలియఁజేయుచు, బంధుసమేతముగ వచ్చి తనయింట జరుగఁ బోవు పారలౌకికకార్యము సుసంపన్నము చేయుమని కోరు-చున్నాఁడు.

సతి కూడ నేమియు పలుకక కొంతసే పక్కడనే నిలిచి పోయినది. కార్డు చేతిలోపట్టుకొని అక్క నిలిచియుండుట

చూచి సావిత్రి కొంచె మాశ్చర్యమొంది అక్కకడకు వచ్చెను. అక్క చేతిలోనుండు కాగ్దను తీసికొని చదివి, అక్క ముఖ మొకసారి చూచి బిగ్గరగ, "అమ్మా, అమ్మా!" అనుచు నేడ్వసాగినది.

పెత్తల్లి పలుగెత్తికొని వచ్చి ఏడ్చుచున్న సావిత్రిని చూచినది; ఎంతో కష్టముపైని ఆమె ఏలయేడ్చుచున్నదో తెలిసికొని, పెద్దకేకలతో తానుకూడ ఏడ్వారంభించినది, క్రమక్రమముగ ఆపేటవా రందఱును అక్కడ పోగై ఇంటిని మొఱలలో ముంచిరి. జాహ్నవి చేతులలో ముఖము నుంచుకొని ఊరక కూర్చుండెను, ఆమెకీ రోదనమంతయు ఎగతాళివలె నుండెను—సతికి పెండ్లి చేసిననాడే ఏడ్పులన్నియు ముగిసినవి—ఇప్పుడు మరల ఈగోల యేల?

చాల ప్రొద్దుపోయినది, పెత్తల్లి వచ్చి, జరుగవలసినది జరిగినది రమ్మమ్మా, ఇంక స్నానముచేసి వత్తువుగాని," అన్నది.

"చెఱువులో స్నానముచేసిన చాలదా?' అని సతి యడిగెను.

"ఎంతమాట! ఎంతమాట! ఏటికి వెళ్లవలెను," అని అందఱు ననిరి.

సతిధోరణి చూచి అందఱు నామెను లోలోపల నిందింపసాగిరి—ఎటువంటి పిల్లకదా! కాపురము చేయుటకు వెళ్లకున్న నేమి, భర్తయే కదా, పెండ్లిచేసికొన లేదా! కండ్ల నొక్క నీటిబొట్టైనను లేదే! ఆహా ఎటువంటి పిల్ల! సతి

గాజులు విఱుగఁగొట్టఁ బోవునపుడు పెత్తల్లికి నిజముగా దుఃఖము వచ్చినది. సతి ఇటుకముక్క నొకదానిని తీసి తానే వానిని చిట్లఁగొట్టినది.

స్నానము చేసి తెల్లని మల్లుపంచె యొకటి కట్టుకొని నొసట కుంకుమ లేకపోయినను చేతిని గాజులు లేకున్నను క్రొత్తదుఃఖమేమియు లేనట్లు సతి ఎప్పటివలెనే ఇంటికి నడిచి-వచ్చెను. నలుగురును తనవైపు చూచుచున్నారను తలంపు పాక అవ్యక్తమగు బాధరూపమున ఆమెహృదయమును దిగజార్చు-చుండెను. గడపదగ్గఱకు రాఁగానే పెత్తల్లి, "కాళీ, వేపాకులు రెం డిమ్ము"—అని కేక వేసి, సతితో, "ఇంటిలోనికి రావద్దు— వేపాకులు నములుము మొదట, తరువాత అగ్నిహోత్రము ముట్టుకొనుము—పిమ్మట లోనికి రమ్ము," అని యున్నది.

సతి యథావిధిని అంతయు మిగుల నోర్పుతో చేసినది. సతి ఇంటిలో ప్రవేశించుసమయమున, "సావీ, నీవు ప్రక్కకు పొమ్ము, అక్కముఖ మిప్పుడు చూడకుము," అని యెవరో అనిరి. ఆమాటలు వినఁగానే సతి ముసుగును ముఖముపైకి లాగుకొనినది, సావిత్రి పఱుగెత్తికొని పోయి, "అక్కా నీకెవ రీబట్టలు కట్టినారే!" అనుచు అక్కను పట్టుకొని యేడ్వసాగి-నది. అక్కడ నున్నవా రందఱును సావిత్రిని చీవాట్లుపెట్టిరి. సతి అచ్చటనే చతికిలఁబడి పోయినది. అక్కభుజముపై తన మొగ మునుంచి సావిత్రి యేడ్వసాగినది.

పెత్తల్లి జాహ్నవియొద్దకు వచ్చి, "రాత ఎవరు తప్పించ గలరు! విచారించి యిప్పుడు చేయఁగలదేమి యున్నది?" అని తోడికోడలికి సాంత్వనమిచ్చెను.

తల్లి లేచి దగ్గఱకు రాఁగానే సతికూడ లేచి నిలిచినది. విధవవేషమును ధరించియున్న కొమార్తెను చూచి ఇంత సహించియున్న జాహ్నవి దుఃఖ మాపుకొనలేక బిగ్గఱగ నేడ్వఁబోయినది, కాని కంఠము రాక, సతిని రెండు చేతులతో గట్టిగ పట్టుకొన్నది.

అట్లు చాలసేపుండి, "సతీ, రమ్ము తల్లీ, రెండుగ్రుక్కలు పానకము త్రాఁగు," మని తల్లి అన్నది.

"నాకు దాహము లేదమ్మా, నీవు కొంచెము త్రాఁగుము, నేను పొయ్యిమీఁద బియ్యము పెట్టి వచ్చెదను," అన్నది.

"దొడ్డమ్మ వండుచున్నది, నేఁడు నీవు వంట చేయకూడ-దమ్మా."

"ఓహో!" అనుచు సతి అచ్చటనే చతికిల పడిపోయినది.

## ఎనిమిదవ పరిచ్ఛేదము

### విశ్వేశ్వరుని తీర్థయాత్ర

విశ్వేశ్వరుడును అన్నపూర్ణాదేవియు తీర్థయాత్ర ముగించుకొని యింటికి వచ్చునప్పటికి సుమారొక సంవత్సరమైనది. పూర్వమొకమారు విశ్వేశ్వరుడు పశ్చిమప్రాంతములు చూచివచ్చెదనని యనెను, కాని అది సాగలేదు. ఇప్పు డిద్దఱును కలసి తీర్థయాత్రకై బయలుదేఱిరి. ఆదినాథుని దర్శనము, చంద్రనాథుని దర్శనము అయినతరువాత, సావిత్రి, పుష్కరము, కురుక్షేత్రము, హరిద్వారము మొదలగు కష్టసాధ్యములగు క్షేత్రములకు కూడ పోయిరి. పిన్ని నేటివఱకు ఈక్షేత్రములలో నొకదానినైనను చూడలేదు. లేక లేక బయలుదేఱుటవలన అన్నియును ముగింపనిదే యింటికి పోకూడదని విశ్వేశ్వరుడు నిశ్చయించుకొనెను.

పుట్టినప్పటినుండి యిల్లు విడిచి బయటికి రాని విశ్వేశ్వరునిలో నూతనప్రపంచ సంపర్కమువలన నూతనజీవము దయించినది. ఆప్రాంతములలో తిరుగుటవలన విశ్వేశ్వరునకు ఆనంద మెంతకలిగెనో దుఃఖముకూడ నంత కలిగెను. దుర్భిక్షదేవత వచ్చి పశ్చిమదేశము నంతను చప్పరించి అప్పుడే పోయినది. విశ్వేశ్వరు డది చూచి ఒకనాడు, "పిన్నీ, మన మింటికి పోక ఇక్కడనే యుండిపోయిన బాగుగనుండదా?" అని అన్నపూర్ణతో ననెను.

"ఏల బాగుగ నుండును?"

"ఎటు చూచినను లేమి! తిండికిలేక ఎందరో బాధ పడుచున్నారు. ఇక్కడనుండినయెడల ఎట్టి యుపకారము చేయఁగలము ఎవరికి చేయఁగలము, అని యోచించుచు కూర్చుండ నక్కఱలేదు. దారిద్ర్యమున నేమియో తెలిసికొనఁ గోరువారు కఱవు రోజులలో పశ్చిమ దేశమునకు రావలెను."

ఎట్టి యుల్లాసమును లేని నవ్వుతో పిన్ని, "మన దేశములో నిరుపేదలు, తిండికిలేనివారు లేరటోయి, పిచ్చి-వాఁడా?" అన్నది.

"ఉండవచ్చును కాని వారియవస్థ వీరియవస్థతో పరిపోల్చఁ దగినదే కాదు. 'సుజలాం, సుఫలాం, సస్య శ్యామలాం' అనఁదగినది కదా మన దేశము! లేనివారైనను తిండికి లేక చావరే!"

"రామశంకరునింటిమాట ఎన్నడైన ఆలోచించితివా?"

"ఆలోచించ కేమి? వారే యీ దేశమున నుండినయెడల ఏనాఁడో చచ్చిపోయి యుందురు. మనదేశమున నుండుటచే ఇప్పటికిని మర్యాదగ కాలముగడుపుచున్నారు. పిన్నీ లేమిలేని చోట మన మితరుల కెట్టిసహాయమును చేయలేము—చేయుటకు సిగ్గగును. అక్కడ నుండువారు కష్టపడి పనిచేసి ఏదోవిధముగ గడపుకొనుచుందురు, సాయముందుకొనుటకు వారికిష్ట ముండదు. ఎచ్చట నట్టి సంకోచ ముండదో, ఏ దేశములో సహా-యము చేయువారు లేకుండుటచే ప్రజలు తిండికిలేక చచ్చి-

పోవుచుందురో అట్టి దేశములో మనము కాపురముండవలెను పిన్నీ. ఆ చోట్ల నెట్టి ప్రయత్నము లేకయే సత్కార్యములు చేయుచుండఁ గలము."

"ఏమి చేయఁగలము? ఏమి నీకు చేయవలెనని యున్నదో చెప్పుము," అని నవ్వుచు పిన్ని యడిగినది.

విశ్వేశ్వరుని ముఖము సిగ్గుచే నెఱ్ఱనైనది. పెద్దపెద్ద మాటలాడుట అతనికి అలవాటులేదు, భావోద్రేకమువలన హృదయ మాందోళిత మైనప్పుడు కేవలము వాగ్విహీనుఁడై కూర్చుండుటయే అతని యభ్యాసము, కనుకనే స్వగ్రామమున అతిథిశాలకట్టించుచుకట్టించుచు హఠాత్తుగ పని నాపుచేసెను. 'నేను బహు ధనవంతుఁడను, దయాళువును; ఎట్టి సహాయము కోరువారైనను నాయొద్దకు వచ్చి కోరికనెరవేర్చుకొనగలరు; అందఱి దుఃఖములను తొలఁగింపఁగలవాఁడను నేను,' అనుచు ప్రచారణ చేయునట్లు నలుగురును అనుకొనవచ్చును. ఇట్లు తలఁచుకొనినంతమాత్రమున అతని హృదయము సంకోచముతో ముడుచుకొనిపోవుచుండెను. కనుకనే అత్యుత్సాహముతో ప్రారంభించిన అతిథిశాలపని హఠాత్తుగ నిలిపివేసెను.

పశ్చిమ ప్రదేశములనుండువారి దుర్దశ చూచి విశ్వేశ్వరుఁడు కన్నీ రాపుకొనలేకపోయెను, ఆప్రాంతములకు వచ్చి అనేక దినములనుండి తనలోనుండు కోర్కెను నెఱవేర్చుకొనుచు అక్కడనే ఉండిపోవలెనని తలంచెను. కాని పిన్ని అతనికోరిక కడ్డువచ్చుచుండెను, కుబేరుని ధనాగారముచే తప్ప

అక్కడి కలవును చల్లార్చుట కెవరికిని శక్యముకాదని ఆమె యెఱుఁగును. పిన్ని విశ్వేశ్వరుని నిరుత్సాహ పఱచలేదు, కాని యింటికి పోదము రమ్మని యతనిని తొందరపెట్టుచుండెను. ఆ దేశమున చాల కాలమున్నట్లైన కుమారుని తలతిక్క మఱింత అధికమగునని యామెకు తోఁచినది, ఆ స్త్రియంతయు దానముచేసి సంపూర్ణముగ రిక్తుఁ డగునేమో యని పిన్నికి భయ మగు-చుండెను.

శ్రమ అధికమై విశ్వేశ్వరుని దేహము కృశింప నారం-భించినది, రెండుమూడుసార్లు జ్వరముకూడ తగిలినది. ఇది చూచి పిన్ని మూట ముల్లె కట్టి విశ్వేశ్వరుని తోడ్కొని రైలెక్కినది. ఇల్లు విడిచిన ఒక సంవత్సరమునకు ఇద్దరును మరల స్వగ్రామమును చేరుకొనిరి. రైలులో నుండఁగానే పిన్ని యొకనాఁడు విశ్వేశ్వరునితో, "విశూ, ఇంటికి వెళ్లిన ఒక నెలలోఁగా నీకు పెళ్లి చేసెదను. ఈ మాట మఱువవద్దు," అని అన్నది. విశ్వేశ్వరుఁ డది విని నవ్వెను.

వివాహ మనిన విశ్వేశ్వరుఁడు నిజముగా భయపడు-చుండెను, ఏమాలోచించి వివాహము చేసికొననని మొట్ట మొదట నిశ్చయించుకొనెనో చెప్పుట కష్టము, కాని ఆసంకల్ప మే యిప్పుడు లోఁతుగ వేళ్లు తన్ని గొప్ప అశ్వత్థవృక్షమై అతని మనస్సున స్థాపించుకొని యున్నది. మొదట నది సామాన్యమగు నూహ—కడుచిన్న విత్తు, అదే యిప్పుడు రాళ్లను పగులగొట్టఁగల పెద్దపెద్ద వేరులుగ పరిణ

మించినది. మొదట, పెండ్లి చేసికొనననుటకు కారణము అతఁ డప్పుడు విరామము లేక రసవిహీనమగు గ్రంథపఠనములో నిమగ్నుడై యుండుట కావచ్చును. అట్టి సమయమున తల్లి, అక్కచెల్లెళ్లు, అతఁడు ప్రేమించగల దగ్గఱచుట్టము లెవరైనను అతనితోడ నున్నయెడల ఇట్టియుద్దేశ మతనిలో పుట్టియుండక పోవునేమో! పిన్ని అప్పుడే ఈ యింటికి వచ్చినది; కేవలము తాను చేయనిచో గడవదు అనునట్టి పనులు మాత్ర-మామె చేయుచుండెను—విశ్వేశ్వరుఁడు అప్పటికి అక్క-కొమారుఁడు మాత్రమే, కనుక అంతకంటె చనువు సహజము కాదు కదా! కాని ఈ వృద్ధవయస్సున మొదట నామెలో నుండిన పరాయితనము లేదు.

స్త్రీజాతియెడలగల భయము విశ్వేశ్వరుని వదల కుండెను. జ్ఞానచర్చనడుమ, వ్యవధి దొరకినప్పుడెల్ల నతఁడు కావ్యములు మొదలగు నితరగ్రంథములను చదువుచుండెను. అవి స్త్రీజాతికినిచ్చు ప్రాముఖ్యత చూచుచున్నకొలఁది అతనికి భయ మధికమగుచుండెను. బహువిస్తృతమైనది పురుష జీవితము. సామాన్య స్త్రీయో బాలికయో ఒకతె అట్టి పురు-షుని జీవితమునకు కేంద్రముగ ప్రతిష్ఠితమై ఎట్లతనిజీవిత-మును సార్థకముచేయఁగలదో, అతని సర్వసుఖములకు అధారము కాఁగలదో, ఎంత యోచించినను విశ్వేశ్వరునకు బోధపడ కుండెను; ఐనను కావ్యాదిసాహిత్యములకెల్లు స్త్రీయే ప్రాణమై-యున్నదో ఆలాగుననే ప్రపంచమునకు కూడ స్త్రీయే ప్రాణమై-

యున్నది. తానుకూడ ఈ మాయలోపడి మతితప్పినవాఁడగునేమో యని భయపడుచు, అట్లు కాకూడదని విశ్వేశ్వరుఁడు మహాప్రయత్నము చేయుచుండెను. తాను పెండ్లియాడిన ట్లూహించుకొని, విశ్వేశ్వరుఁడు తన యవస్థనుగుఱించి తనలో తాను తర్కవితర్కములు జరిపి చూచుకొనుచుండెను. తా నాశించుచుండు సుఖములన్నిఁటికిని భార్య యని పేరు నిచ్చిన ఒక చిన్నబాలికయొక్క సుఖదుఃఖములా పర్యవసానము? తాను చేయుపనులన్నియు ఆ బాలికకొఱకా? తన యనురాగము, ఉత్సాహము—అన్నియు నీ క్షుద్ర బాలికతో ఆగవలసినదే!

ఒకనాటి సాయంకాలము పినతల్లి అక్కకొడుకులు ఇల్లు చేరుకొనిరి. ఇల్లు చేరఁగానే అన్నపూర్ణ పాలలోనికి పోయి ఆవులను దూడలను చూచివచ్చినది. ఇంటి నౌకర్లు—ఘోషును సిధితల్లియు—ఇల్లువాకిళ్లు తమకుచేతనైనంతవఱకు పరిశుభ్రముగ నుంచుచుండిరి పుణ్యక్షేత్రములనుండి తెచ్చిన ప్రసాదము, వస్త్రములు, పాత్రలు మొదలగునవి ఇరుగు పొరుగువారల కీయవలెనని అన్నపూర్ణ మనస్సు తొందరపడుచుండెను. కాని ఆ ఉత్సాహము నాపుకొని ఉపవాసముతోనున్న కొమారునికొరకై వంట ప్రారంభించినది. విశ్వేశ్వరుఁ డీలోఁగా గ్రామము చుట్టఁబెట్టుచుండెను. ఎవరి యింటికైనను వెళ్లి వారిని పలుకరించుట విశ్వేశ్వరునకు స్వభావవిరుద్ధమైనను అట్లు చేయవలెనని నేఁడు బుద్ధిపుట్టి-

చుండెను. కాని ఎవ రేమనకొందురో యను సంకోచమువలన ఆ కోరిక నెఱవేర్చుకొనలేకపోయెను. ఎట్టి పరిచయములేని 'నాథుమండల్', 'పరాణుకల్', 'విపిన్' మొదలగువారు దారిలో కనఁబడి అతనికి నమస్కారముచేసి, "ఎప్పుడు వచ్చినావు నాయనా?" అని యడుగఁగానే ఆనందముతో పొంగిపోవుచు నతఁడు వారితో మిక్కిలి చనువుగా సంభాషణ చేసెను. ఆ గ్రామమునందు అతిసామాన్యుని సహవాసము కూడ నేఁ డతనికి కోరఁదగినదని దోచినది.

దక్షిణమువైపునున్న భట్టాచార్యులుగారి యిల్లు చీఁకటిలో స్తూపాకారము వహించి కానవచ్చినది. అది కానఁరాఁగానే విశ్వేశ్వరుఁ డులికిపడి నిలిచెను. "భట్టాచార్యులుగారూ" అని ఒకమాఱు పిలువవలెనని యతనికి కోరికపుట్టినది; కాని వెనుకటి పెండ్లి ప్రస్తావము హఠాత్తుగ జ్ఞప్తికివచ్చి యతఁడు తనదారిని పోవ నారంభించెను. అక్కడికి పది యడుగుల దూరములోనే ఉమేశముఖోపాధ్యాయుని యిల్లున్నది. ఇంటి యజమానుఁ డరుగుపై కూర్చుండి హుక్కా పీల్చుచు విశ్వేశ్వరుని చూచి, "ఎవరది?" అని యడిగెను.

"నేను, విశ్వేశ్వర్."

"విశ్వేశ్వర్ బాబా! రమ్ము నాయనా, రమ్ము; వచ్చికూర్చుండుము. పడమటినుండి యెప్పుడు వచ్చితివి? క్షేమమా?"

ఇద్దఱును మాటలాడుచు చాలసేపు కూర్చుండిరి. సంభాషణ పలువిధములనడచినది. తాను విదేశయాత్రకై బయలుదేఱి

నప్పటినుండి గ్రామమున జరిగినదంతయు విశ్వేశ్వరుఁ డెఱుఁగఁ గోరెను. అందఱి క్షేమసమాచారము తెలిసికొని యింటికి తిరిగి వచ్చునప్పటికి చాల వేళయైనది. పిన్ని విశ్వేశ్వరుని కొఱకు అన్నము కూరలు కంచములో పెట్టి మీఁద *'డోమ్' బోర్లించి ప్రక్కనుకూర్చుండి కునుకుచున్నది. విశ్వేశ్వరుఁ డొక్క మూట యైన పలుకక తిన్నఁగ పోయి పీటపై కూర్చుండెను. పిన్ని యులికిపడి లేచి, ప్రారంభించినది—"ఆహా, ఎట్టివాడవురా నాయనా! అన్నము చల్లారి నీరు కాఱుచున్నది. రెండు రోజుల నుండి తిండిలేదు. రెండు మెతుకులు నోటవేసికొని వేళకు పరుండ వలెననుబుద్ధి అబ్బాయికి నేటికైననురాలేదు. ఇంటికి వచ్చినతరువాతకూడ పిల్లవాని స్వభావము మాఱలేదు. వేకువ జామున శుభనక్షత్రమేమో యున్నదఁట, స్నానమునకు ఏటికి పోవలెననుకొంటిని, కాని ఇంత ఆలస్యమై పోయినది—పరుం డుట యెప్పుడు, లేచుట యెప్పుడు? నీకెన్నఁటికిని—" ఇంత వఱకు వచ్చి పిన్ని యాగినది—ఇంతటితో ఆగవలసినది కాదామె, కాని కొమారుని ముఖమున దుఃఖచిహ్నములు కనఁ బడుటచే తటాలున మాటలధోరణి మార్చి, "ఎక్కడ నుంటివి ఇంతసేపు?" అని యాతురతతో నడిగినది.

*డోమ్=dome-అన్నము మొదలైనవానిమీద దుమ్ముపడకుండునట్లును, ఈఁగలు వాలకుండునట్లును, బంగాళాదేశములో గోళాకారముగలఇత్తడిమూత నుంచుదురు.

"ఉమేశ ముఖోపాధ్యాయునితో మాటలాడుచు వారియింటఁ గూర్చుండి యుంటిని."

"వారందఱును క్షేమమా? పేట వారందఱును కుశలా-సాగా నున్నారా? గ్రామములో నందఱును క్షేమముగా నున్నారు గదా!"

"అందఱిమాట నేనెట్లు చెప్పఁగలను పిన్నీ? కాని మన రామశంకరబట్టాచార్యులు చనిపోయినాఁడు."

మిక్కిలి దుఃఖము కలిగి యేమియు ననక అన్నపూర్ణ కొంతసేపూరకుండి. చివరకు మృదుస్వరముతో, "ఆహా పాపము! వదినె—"అన్నది. "ఆహా! ఆహా!" అనుచు దుఃఖింపవలసిన సంగతులనేకముగ జ్ఞప్తికి వచ్చుటచే నేమియు ననక చాలసేపు విచారించుచు కూర్చుండి అన్నపూర్ణ చివరకు, "చచ్చినవాఁడే పుణ్యాత్ముఁడు!—సుఖపడ్డాఁడు బ్రాహ్మణుఁడు—యిఁకమొత్తి విచారమును లేదు!" అన్నది. విశ్వేశ్వరుఁ డేమియు ననలేదు.

అన్నపూర్ణ కా రాత్రి నిద్రపట్టలేదు. సమస్తము నోర్చియుండు జాహ్నవియొక్క శాంతిస్వరూపము రాత్రియంతయు నామెకు కనులకు కట్టినట్లు కనబడుచుండెను. తెల్లవాఱుజామున లేచి అన్నపూర్ణ స్నానమునకై యేటికిపోయినది. అచ్చట ననేకులు స్నానము చేయుచుండిరి. అందఱును అన్నపూర్ణను చూచి అభినందించి కుశలము నడుగుచుండిరి. జాహ్నవి తోడికోడలు కూడ స్నానమునకై వచ్చియుండెను, ఆమె అన్న

పూర్ణను చూచి కీచుగొంతుతో, "మీరు మా ఊరు మరి రారని అనుకొనుచుంటిమే!" అన్నది.

"రా మేల వదినా!" అనుచు అన్నపూర్ణ ప్రక్కకు ముఖము త్రిప్పగా అంచు లేని తెల్లని సైనుపంచ కట్టుకొనియున్న జాహ్నవికూడ ఆమె కంటఁబడినది. సావిత్రి నీటిలో మునుఁగుచు జాహ్నవియొక ప్రక్కనుండెను. సావిత్రి ముఖ మామెకంటఁబడఁగానే దగ్గఱకుపోయి వాడియున్న ఆమె ముఖమును రెండు చేతులతో పట్టుకొని ముద్దాడవలెనని అన్నపూర్ణకు కోరికపుట్టినది. కాని సిగ్గులేక వారినెట్లు పలుకరించఁగలదు? తొందరతొందరగ స్నానము ముగించి యింటికి పోఁబోవుచుండ సావిత్రి ప్రక్కను అంచులులేని తెల్లని బట్టకట్టుకొని నిలిచియున్న బాలికయొకతె ఆమె కగపడినది. ఎవ రామె? ఆమె సతియై యుండవచ్చునా! అన్నపూర్ణ నోటమాటలేక ఎట్టి చలనమును లేక నిశ్చేష్టురాలై కఱ్ఱబొమ్మవలె నిలఁబడిపోయినది"

---

# తొమ్మిదవ పరిచ్ఛేదము

## విశ్వేశ్వరుఁడు సతీపానిత్రులకు సాహాయ్యము చేయఁబోవుట

విశ్వేశ్వరుఁడు మరల తన గదిలోదూరి పుస్తకముల నడుమ దాఁగియుండ ప్రయత్నించెను. కాని అతని మనస్సున నిప్పుడుండు కోరిక ఆప్రయత్నమునకడ్డువచ్చెను. జీవన మనిన నేమో పశ్నము పోయి విశ్వేశ్వరుఁడు కొంచెము తెలిసికొనెను—యింటికివచ్చి దానిరుచి మఱచిపోలేదు. వరుసలు వరుసలుగ పుస్తకములతో నిండియున్న బీరువాలు బరువుమోయుచున్న గాడిదలవలె నతని కంటికి కనపడసాగెను. పూర్వ మాగది కల్గించుచుండెడి ఉన్మాద మిప్పుడు లేదు. తన భూములను తానే చూచుకొన ప్రయత్నించెను గాని ఆపనిపై మనస్సుపోలేదు. ఏది చేయఁబోయినను రెండురోజులలో చీకాకు పుట్టుచుండెను. కనుక, నేమియుచేయలేక నదీతీరమున, మామిడితోఁటలలోను, అరఁటితోఁటలోను, బయలుమీఁదను, పొలము గట్లపైని ఉదాసీనుఁడగు పథికునివలె తిరుగుచుండెను.

అప్పుడప్పు డతఁడు పిన్నియొద్దకు వచ్చి కూర్చుండియుండును. అన్నపూర్ణ మతిపోయిన దానివలె పడియుండును, మునుపటివలె నెల్లప్పుడును వేళాకోళము చేయుచు, ఉల్లాసముతో మాటలాడుచుండునది కాదు. పిన్ని మనస్సు నేదో బాధించుచున్నదని పోల్చుకొని విశ్వేశ్వరుఁడు మాటాడక

సంకోచముతో దగ్గఱ కూర్చుండును. పిన్ని కుమారునితో నొకనాఁ డిట్లనెను,—"నీ వేమియు భయపడకుము—నాకిన్నా ళ్లును నేదో విధముగఁ గడచినది కదా, ఈనాలుగురోజులు-కూడ నట్లే గడచిపోవును. నీయంతట నీ కెప్పుడు బుద్ధి పుట్టునో అప్పుడే పెండ్లి చేసికొనుము—ఆ విషయమై యిక నీతో నొక్క మాటయైన నెన్నఁడు ననను."

విశ్వేశ్వరుఁ డూరక యుండెను; ఎన్నాళ్ళనుండియో పిన్నితో తాను చెప్పవలె ననుకొనుచున్నది చెప్పుటకు మంచి సమయము నేఁడు దొరకినదని అనుకొనెను; పిన్ని మఱికొంత ప్రసంగించునని తలఁచెను, కాని ఆమె మఱియేమియుననక పూజకొఱకు వత్తులు చేయుచు కూర్చుండెను.

కనుక విశ్వేశ్వరుఁడే ప్రారంభించవలసివచ్చినది—"పిన్నీ, వారిసమాచారము నీ వేమైన నెఱుఁగుదువా?" అని తుదకు అడిగెను.

పిన్ని వత్తులు చేయుట ఆఁపి విశ్వేశ్వరుని వంక చూచుచు, "ఏ సమాచారము?" అని యడిగినది.

"వారిప్పుడే విధముగ గడుపుకొనుచున్నారో ఆ సమాచారము—"

"నాకు తెలిపోలేదు—వారితో నంతహృదయహీన ముగా వ్యవహరించి, వారు కష్టములలో నుండఁగా చూచి సంతోషించుచు వారియింటికి పోయి మీ రెట్లున్నారని యడిగి రమ్మన్నావా?"

"వారియింటికి పోక పోయినను వారే యవస్థలో నున్నారో యితరులనోట వినవచ్చునే!"

"ఇన్నాళ్లనుబట్టి వారిని చూచుచున్నను వారెట్టివారో; నీ వెఱుఁగవు కాని నేను బాగుగా నెఱుఁగుదును. చచ్చినను ఇతరులకడకు వచ్చి సహాయము కోరుచు చేయిచాచువారు కారు వారు; ఇతరులకడకు వచ్చి తమయవస్థను చెప్పుకొనువారు కారు. హరి యప్పుడప్పు డింటికి వచ్చుచున్నాఁడని విన్నాను, అతఁడే యింటి సమాచార మిప్పుడు చూచుచున్నట్లున్నది."

"హరిశంకరుఁడా? వాఁ డధోగతిపాలైనాఁడు. అతఁడును చాఁద్ పూర్ జమీందారు 'నరేన్'—అనఁగా మన జమీందారుగారి అల్లుడు—వీరిద్దరును కలసి మనయూరిబారిని గుఱ్ఱములను గ్యాలప్పుచేయుచు పోవుచుండఁగా మొన్నను చూచినాను, హరి వేసికొన్న జమీందారు వేషము అందఱును చూచినారు—ఛీ ఛీ, హరికి సిగ్గైనను లేదే!" అని మిగుల దుఃఖముతో విశ్వేశ్వరుఁ డనెను.

"నాకేమి తెలియును నాయనా! వాని వేషముచూచియే కాఁబోలు వారికెట్టి లోటును లేదని నలుగురు ననుకొనుచున్నారు."

"అట్లైన నీవు వారియింటికి అప్పుడప్పుడు వెళ్లుచుండవచ్చునే పిన్నీ!"

అన్నపూర్ణ కొంచెము మూరక యుండి, ఉద్రేకముతో "నే నట్టిపని చేయలేను నాయనా, సతితల్లికి నా ముఖము

చూపించుసాహసము నాకు లేదు. నీకు చేతనైనయెడల నీవే వారి సమాచారము కనుఁగొనుచుండ వచ్చును," అని యన్నది.

సులభముగ నుపాయమేదియు విశ్వేశ్వరునకు తోఁచ-లేదు. వారు కష్టములలో నున్నారనుటకు సందేహము లేదు, కాని వారి కేవిధముగ సాయము చేయఁగలఁడో అతనికి తట్టలేదు. కాళిపదుఁడు మిక్కిలి చిన్నవాఁడు, వానిద్వారా ఏమైన చేయ ప్రయత్నించినయెడల సులభముగ బయలుపడి-పోవుటయే తప్ప లాభముండదు. అనేకవిధముల యోచించి, సాతీసావిత్రులతో కలసి యాలోచించి తనసాయము వా-రెట్లైన నంగీకరించునట్లు చేయవలెనని విశ్వేశ్వరుఁడు తుదకు నిశ్చయించుకొనెను.

విశ్వేశ్వరునకు ఇట్టి సంకల్పము చేసికొనుట సులభము గాని దానిని నెరవేర్చుట మిక్కిలి కష్టము. దీనికి మొదటి ప్రతిబంధకము తనలోనుండు సంకోచము. ఇంతేకాక సతీ సావిత్రులు విశ్వేశ్వరునకు కనబడుటయే అరుదు.

పేదయింటి పిల్లలు వారు, మందభాగ్యులు, ఇల్లువదలి బయటికి వచ్చువారుకారు. వీటికి నీరుకై వచ్చునప్పు డెప్పుడో యొకమాఱు సావిత్రి యొవరికంటనైనను పడవచ్చును గాని, సతి యింటివెనుకనుండు చెఱువునకు స్నానమునకై వచ్చు-నప్పుడుతప్ప ఇల్లువిడుచునది కాదు. పల్లె యగుటచే మంచి సంప్రదాయకుటుంబములపిల్లలకు బయటికి వచ్చుట కెట్టి

అభ్యంతరమును ఉండఁగూడదు, ఐనను వీరి దురవస్థ వీరి కడ్డు-
వచ్చుచుండెను. సావిత్రి విషయమైకూడ నలుగురును అనుకొన-
సాగిరి: "ఈ అమ్మాయికూడ పెద్దదైపోవుచున్నది. పదునాలు
గేండ్లు కావచ్చినవి. పాప మెట్లామెకు పెండ్లి యగునో కదా!
ఆమెను పెండ్లిచేసికొనువా రెవరున్నారు?" అని సావిత్రి కంట
పడఁగానే నలుగురు ననుచుండిరి. కాని దయార్ద్రహృదయు
లగువారు, "ఈమె యక్కకైనట్టి పెండ్లి యగుటకంటె
ఇట్లుండుటయే మేలు—మనస్సునకే బాధయు నుండదు,"
అనుచుందురు. సంఘసంరక్షణభారమునువహించి, న్యాయ
బుద్ధితో ప్రవర్తింపఁగోరువారి ధోరణిమాత్రము వేఱు—వీరు,
'ఇది యేమమ్మా, ఇట్టి దెక్కడను చూడమే! ఇవియన్నియు
వ్రాతనుఁబట్టి యుండును కదా అక్కా? నొసట వ్రాసియున్నది
అది తీరును. పెండ్లిమానుకొని కూర్చుండిన నెట్లు? జాతి
యక్కఱ లేదా?" అనుచుందురు.

బయటికి వచ్చినంతమాత్రాన ఇట్టిమాటలు ప్రారంభ
మగుచుండుట యెఱిఁగి సావిత్రి మిక్కిలి జాగ్రత్తగ
నుండెను; త్రాఁగుటకు నీరు లేనప్పుడు మాత్రము, భోజనానం-
తరము, మిట్టమధ్యాహ్న మందఱును నిద్రించు సమయమున
నామె రేవునకు పోవుచుండును.

సావిత్రి యిట్లుచేయుచుండుట విశ్వేశ్వరుఁ డొకనాఁడు
కనిపెట్టి తనకోరిక సఫలముచేసికొనుటకు నీ లఘుమార్గ మొకటి
చిక్కినదని తలఁచెను. ఇట్టిమార్గము నవలంబించుట ధర్మము

కాదేమో యను సందేహ మతనికి కలుగకపోలేదు. కాని వేఱుమార్గ మేదియు లేకుండెను. ఎన్నఁడును నోరుతెలువని అద్భుతస్వభావము విశ్వేశ్వరునిది, కొంచెము పెద్దవాఁడై-నప్పటినుండి తమవీథివారియిండ్లకైనను పోయి యెఱుఁగఁడు. నేఁడు సతియింటికి పోయి జాహ్నవీదేవితో నేమి సంభాషణ చేయగలఁడు! ఆ యింటికి పోవుట కితఁ డింత సంకోచించుటకు తగిన కారణము లేకపోలేదు. అతనివలన తమకు అవమానము కలిగినట్లు వారు భావించుచుండవచ్చును!

నిస్తబ్ధ మధ్యాహ్నమున విశ్వేశ్వరుఁ డేటియొడ్డున షచారు చేయుచున్నాఁడు. ఉండి యుండి పరధ్యానముగ నచ్చటి మఱ్ఱిచెట్టు క్రిందను నిలిచి దాని చిన్నయూడలను పట్టి లాగుచున్నాఁడు. ఇట్లు కొంతసేపు నిలిచియుండిన పిమ్మట దూరమున పేదబాలిక యొకతె విశ్వేశ్వరుని దృష్టి-పథమునఁ బడెను. విరియఁబోసినజుట్టు, మురికిబట్టలు,—బిందె బరువుగా నుండుటచే ప్రక్కకు వంగి మెల్లగా నడచుకొని వచ్చుచున్నది. ఆమె కంటఁబడగానే విశ్వేశ్వరుఁడు కనుల నీరు పెట్టుకొనెను.

ఆ బాలిక దగ్గఱ పడుచున్నది, ఆమె విశ్వేశ్వరు డెఱుఁగని బాలిక కాదు, ఐన నతఁడు మతిలేనివానివలె నూరక నిలిచి యుండెను, పేరుపెట్టి యామెను పిలుచుటకు సాహసింపలేకుం-డెను. పిలుచుటకు సాహస మట్లుండ, ఆ బాలిక తనవైపు చూడ కుండిన బ్రతుకుదు ననుకొనసాగెను. అట్టియవస్థతో సావిత్రి

అతని కంటఁబడినయెడల నెంత సిగ్గుపడునో యని యూహించి, విశ్వేశ్వరుఁడు మిగుల దుఃఖింపసాగెను, కాని సావిత్రికి, పాపము, సిగ్గు తప్పినది కాదు. ముఖ మెడమప్రక్కకు త్రిప్పఁగానే విశ్వేశ్వరుఁ డామె కంటఁబడెను. ఏమిచేయవలెనో తోఁచక సంకోచించుచు ఆమె కొంచె మచట నిలిచియుండవలెనని తలఁచినది. కాని సిగ్గు నతిక్రమించి తల మఱింత వాల్చుకొని మెల్లగా ముందుకు నడువసాగెను.

ఇంత మంచి సమయము వదలుకొన్నయెడల మఱి యవకాశము చిక్కకపోవచ్చునని తలఁచి, విశ్వేశ్వరుఁడు తన సంకోచమును త్రొక్కిపెట్టి, చేయఁగోరుచున్నపని చేసితీరవలెనని నిశ్చయించుకొని, బహుకష్టముపై కొంచెము ముందుకు వచ్చి, "సావిత్రీ," అని పిలిచెను.

సావిత్రి ఆశ్చర్యపడి నిలిచినది, కాని ప్రక్కకు తిరుగలేదు. "నీతో కొంచెము మాటలాడవలసియున్నది, వినిపొమ్ము," అని విశ్వేశ్వరుఁ డనెను.

సావిత్రి అతనివైపు తిరిగి అతని నొకమాఱు చూచి కనులు వాల్చి, "దేని విషయమై, చెప్పుఁడు," అని యన్నది. సంకోచము ద్విగుణమై విశ్వేశ్వరుఁడు తడఁబడుచు నిలిచెను. సావిత్రి కొంచెము తాళి మరల పోఁబోవుచుండ మృదుకంఠముతో విశ్వేశ్వరుఁడు, "మీ యన్న, హరి—అతఁడిప్పుడు ఇంటికి వచ్చుచున్నాఁడా?" అని యడిగెను.

"అప్పు డప్పుడు వచ్చుచున్నాడు."

"అతఁ డిప్పుడేమి చేయుచున్నాడు?"

సావిత్రి కుతూహలముతో నతని వంకచూచుచు, "ఏమి చేయుచున్నాఁడా!"

"అనగా, పనిపాటేమైన నున్నదా? ఏదైన నుద్యోగము చేయుచున్నాఁడా?"

"చేయుచుండవలెను."

"నీకు సరిగా తెలియదా?"

"తెలియదు," అని క్రిందికి చూచుచు సావిత్రి యన్నది. మిగుల బాధఁజెందుచు విశ్వేశ్వరుఁడు, "అతఁడే కదా మీ సంసారమును గడపుచున్నాఁ డిప్పుడు," అని మఱింత మృదువుగా నడిగెను.

సావిత్రి ఏమియు పలుకకుండుట చూచి ఆమె మనస్సునకు నొప్పికలిగినదని విశ్వేశ్వరుఁడు పోల్చుకొనెను; సంకోచమును విడిచి తొందరతొందరగా నిట్లనసాగెను—"నీ వేమియు ననుకొనకూడదు. ఇరుగుపొరుగువారి సమాచారము, బంధువుల సమాచారము తెలిసికొనఁ గోరుదుము గదా ఎవరైన! కనుకనే నేనుకూడ మీ సమాచారము నడిగితిని. నీకు నొప్పి కలుగవలసిన దేమియు నందు లేదు."

"ఔను, ఏమియులేదు," అని సావిత్రి నెమ్మదిగ నన్నది.

"మీ అన్న డబ్బిచ్చుచున్నాడా? డబ్బులేనిచో సంసారము గడవదని అందఱు నెఱిఁగినసంగతే కదా! కనుకనే నేను ఆ విషయమై యడుగుచున్నాను."

"ఆ, ఇచ్చుచుండు నప్పు డప్పుడు."

"అది అన్ని ఖర్చులకు సరిపోవుచున్నదా? ఎట్టి కష్టమును లేక మీకు జరుగుచున్నదా?"

"జరుగుచున్నది," అన్నది సావిత్రి. ఈ సంభాషణ వలన సావిత్రిమనస్సునకు కొంచెము కష్టముగలుగుటచే, "ఇఁక నన్ను పోనిండు," అని యన్నది.

"మఱికొంచె మాఁగుము. నీవు నాతో నిజము చెప్పుచుండుట లేదు. సంకోచించుచున్నావేల సావిత్రీ, నేను నీకు అన్నతో సమానుఁడనే కదా, నాతో చెప్పవేల?"

సావిత్రి ముఖమెత్తి, పెద్దపెద్ద రెండు కన్నులును విశ్వేశ్వరుని ముఖముపైకి త్రిప్పి కొంచెము రోషముతో ప్రత్యుత్తర మిచ్చినది—"మీయింటి సమాచారము నలుగురితో చెప్పుచు తిరుగుచుందురా మీరు? న న్నేల యడుగుచున్నారు? అట్టివన్నియు నెవ్వరితో చెప్పకూడనివని మీ రెఱుఁగుదురు."

విశ్వేశ్వరుఁడు కలవరపడెను. కాని యూరకుండక, "అందఱితో చెప్పకూడదు నిజమే, కాని ఎవరైన నడిగినయెడల చెప్పుట తప్పా?" యని యనెను.

"తప్పే, సందేహ మేమి! చెప్పినమాత్రము లాభ మేమి? ఇఁక నన్ను పోనిండు."

"నేఁ జెప్పునది వినుము సావిత్రీ—నేను పరుఁడనైనను మిమ్ములను చెల్లెళ్ల వలెనే భావించుచున్నాను. మీకు సిగ్గు దుఃఖము తెప్పించుట కీప్రశ్నలడుగలేదు. తమ వాత్సల్యాతురతతో నేవిధముగ నడుగుదురో నేనుకూడ నావిధముగనే అడిగితిని, అందులో తప్పేమున్నది సావిత్రీ? నేను—నేను పరుఁడనై నప్పటికిని—"

అప్పటివఱకు సావిత్రి కొంచెము చీకాకుపడుచుండెను; ఆమె కాశ్చర్యముకలుగుచుండెను. కాని విశ్వేశ్వరుని మనస్సుకు కష్టము కలిగినదని తెలియగానే ఆమె మనస్సు కరిగినది. విశ్వేశ్వరుని కనులు తడియగుచున్న ట్లామె అనుమానించినది, సిగ్గుజెంది, దుఃఖించుచు, క్షీణస్వరముతో, "నన్ను క్షమింపుఁడు," అని అన్నది. "మేము కష్టములలో నున్నామా యని మీ రడిగితిరి—కనుక నిజము చెప్పెదను వినుఁడు. చెప్పవలసినంత కష్టములు మా కేవియు లేవు; రోజులు ఏదోవిధముగ గడచిపోవుచు నున్నవి."

విశ్వేశ్వరుఁడు చిఱునవ్వు నవ్వుచు, "అది నిజమే, రోజులందఱికిని గడచుచునే యుండును. కాని కొందఱికి అతి కష్టముగాను కొందఱికి అతిసుఖముగాను గడచుచుండును కదా!" అని యనెను—అతని నవ్వున దుఃఖము వ్యక్తమగుచుండెను.

"అక్క నేను అనేకరకముల పనులు చేయుచుందుము. దార్ఢ్యము తక్కువగుటచే అమ్మ మునుపటివలె పని చేయలేదు.

అన్నయ్యకూడ నేమైన తెచ్చియిచ్చుచుండును. భరింపలేని కష్టము లేవియు లేవు."

పుట్టినప్పటినుండి దుఃఖములో పెరుఁగుచున్న బాలిక దేనికి దుఃఖమనవలెనో ఎఱుఁగదని విశ్వేశ్వరుఁడు గ్రహించి, రెండడుగులు ముందుకువచ్చి ఇట్లనెను—"మీఅన్న ఇచ్చినది పుచ్చుకొనుచున్నారు; నేను మీ అమ్మకు ప్రణామముచేసి ఏదైన నర్పించినయెడలనుగాని, చెల్లెళ్లని మీ కేదైన కానుకగా నిచ్చిన యెడలనుగాని దానిని మీ రెట్లు తిరుగఁగొట్టఁ గలరు?"

సావిత్రి మిక్కిలి యాశ్చర్యముఁ జెంది, మెల్లగ, "నా కది తెలియదు, అమ్మకు తెలియును, అక్కకు తెలియును," అని యన్నది.

"అట్లైన ప్రణామముచేసి నే నర్పించితి ననిచెప్పి ఈ కాగితము మీతల్లి పాదములకడ నుంచుము సావిత్రీ." అట్లనుచు విశ్వేశ్వరుఁడు సావిత్రికి దగ్గఱగా వచ్చి ఆమె చింకిచీరచెంగున కాగిత మొకటి కట్టసాగెను, "వద్దు వద్దు నాకది చేత కాదు, నన్ను చిక్కులో పెట్టక మీరే అమ్మను కలుసుకొని మాటలాడుడు," అని సావిత్రి భయపడుచు గద్గదస్వరముతో వేడుకొన్నది.

ఇంతలో విశ్వేశ్వరుఁడు తన పని తాను ముగించి, "నీవు దానిని అమ్మ కీయవలెను; ఆమె నన్ను రమ్మనినయెడల నేను వచ్చి అంతయు నామెకు చెప్పెదను—నే నిట్లు చెప్పితినని చెప్పుము; ఇఁక నింటికి పొమ్ము సావిత్రీ. అంత పెద్దబిందె పట్టు

కాని నిలిచియుండుటకు, పాపము,నీకెంతోకష్టముగానున్నదో," అని యనుచు హఠాత్తుగ నదృశ్యమాయెను.

ఇంటివద్ద పిన్ని భోజనముచేసి తీక్ష్ణములేని శీతకాలపు యెండలో కంబళిపై పరుండి మహాభారతము చదువుచున్నది.

విశ్వేశ్వరుఁడు ఇంటికి తిరిగివచ్చి ఆ కంబళి ప్రక్కను పరుండి, "ఏమి చదువుచున్నావు పిన్నీ?" అని యడిగెను.

పిన్ని ముద్దుతో వాని వంక చూచుచు, "సావిత్రికథ చదువుచున్నాను. నీవు చదువలేదా మహాభారతము?" అని యడిగినది.

"ఆహా చదివితిని, సందేహ మేల? కాని చాల చిన్నప్పుడు చదివితిని, మహాభారతములో నేదియు జ్ఞాపకము లేదు. రామాయణములోనివి పద్యములు మాత్ర మిప్పటికిని మఱువ లేదు." ఇట్లనుచు పద్యములుచదువుట ప్రారంభించెను.

అదివిని పిన్ని నవ్వుచు, "ఇవి యన్నియు జ్ఞప్తియున్నవి కాని మంచి మంచి వేవియు జ్ఞప్తిలేవా?" అని యడిగినది.

"ఏమి! నేను చదివినవి మంచివి కావా? నేను వల్లించుచుండునప్పు డివియే అన్నిఁటికంటె మంచి వనిపించుచుండెను. కాని అది యటుండనిమ్ము పిన్నీ, నీవు చదువుచుండు సావిత్ర్యుపాఖ్యానము చాలా ఇంపుగా నున్నది. మఱికొంచెము చదువుము, వినవలెనని యున్నది."

పిల్లవానిలో కొంచెము ప్రఫుల్లత పుట్టియుండుట చూచి పిన్నికి ఆనందము కలిగినది. సావిత్రికథ నామె ప్రారం

భమునుండి చదువుట మొదలుపెట్టినది. విశ్వేశ్వరుఁడు తదేక ధ్యానముగ నది వినుచు కూర్చుండెను. కథ పూర్తికాఁగానే విశ్వేశ్వరుఁడు లేచుచుండుట చూచి పిన్ని, "ఎట్లున్నదిరా నాయనా?" అని యడిగినది.

"బహు ఇంపుగా నున్నది."

మఱునాఁ డుదయ మేదో చెప్పుటకు విశ్వేశ్వరుఁడు పిన్నికడకు వచ్చునప్పటికి, పిన్నికి పూలిచ్చుటకు వచ్చుచున్న సావిత్రి సజ్జెదుపూలతో నతనికంటఁ బడినది. పిన్ని మిగుల ముద్దుతో నామెను పలుకరించినది. తనతో నేదో చెప్పుటకు వచ్చినదని విశ్వేశ్వరునకు ఏలనో తోఁచినది. ఏమిచెప్పుటకు వచ్చియుండునో? ఇంటి కష్టములనుగుఱించి చెప్పుటకై యుండును—అది తప్ప మఱియేమి కాఁగలదు? ఆనందము కలిగి, విశ్వేశ్వరుఁడు తనగదిలోనికిపోయి ఆ మెరాక కెదురుచూచుచు కూర్చుండెను.

కొంచెము సేపైన తరువాత సావిత్రి నాలుగుపువ్వులు పట్టుకొని అతని గదివైపు వచ్చుచుండుట యతనికి కనఁబడినది. పుష్పము లతని నుల్లాస పఱచునని యెఱిఁగి పిన్ని ప్రతి-దినమును పువ్వులుతెచ్చి అతని గదిలో నుంచుచుండును. నేఁ డాపని సావిత్రిమూలమున నెఱవేర్చుచున్నదని విశ్వేశ్వ-రుఁడు తలఁచెను. పిన్ని ఆపని చేయు మనుట సావిత్రికికూడ మంచిదైనది. ఆ పూలు తీసికొనివచ్చి సావిత్రి విశ్వేశ్వరుని

గదిద్వారము దగ్గఱ తడఁబడుచు నిలఁబడినది. విశ్వేశ్వరుఁ డది చూచి మిగుల నాదరముతో, "రమ్ము సావిత్రీ," అన్నాఁడు.

సావిత్రి గదిలో ప్రవేశించి నాలుగు పువ్వులు టేబిలు-మీఁదను, నాలుగు పుస్తకములపైని ఉంచుచు, "మీ పిన్ని ఈ పువ్వులు మీగదిలో నుంచి రమ్మన్నారు," అన్నది.

"అన్నియు నిచ్చటనే యుంచుము సావిత్రీ. పిన్నికి పూలిచ్చుటకు మాత్రమే వచ్చితివా, లేక చెప్పవలసినదికూడ నేమైన నున్నదా సావిత్రీ?"

తెల్లఁబారియున్న సావిత్రిముఖము సిగ్గుచే కొంచె మెఱ్ఱనైనది. తల వాల్చుకొని మృదుస్వరముతో నామె, "ఔను ఉన్నది; ఊరక యెట్లు రాఁగలనని తలఁచి నాలుగు-పువ్వులు తీసికొనివచ్చితిని." ఇట్లనుచు పైటచెంగు విప్పి చిన్న కాగిత మొకటి ఆ పువ్వుల ప్రక్క నుంచెను. విశ్వేశ్వరుఁడు "అది యేమి సావిత్రీ?" అని యాశ్చర్యపడుచు నడిగెను.

"ఆనాఁడు మీరిచ్చిన రూపాయలు. అక్క యీ రూపాయ లవసరము లేదన్నది. మాకంటె నిరుపేద లున్నారు, వారి కీయుఁడు; వా రెంతో ఆశీర్వదించెదరు. మాకు వీని యవసరము లేదు."

విశ్వేశ్వరుఁడు నిశ్చేష్టుఁడై నిలిచి కొంతసేపైన తరువాత గొప్ప యపరాధము చేసినవానివలె మెల్లగా, "మీ అమ్మ-గారో! మీ అమ్మగా రేమన్నారు?" అని యడిగెను.

"అమ్మ మనస్సుకు బాధకలుగునని అక్క నన్నా మాట అమ్మతో చెప్పనీయ లేదు."

"బాధ కలుగునా! లేదు లేదు. బాధ యేల? నేనే పోయి ఆమెతో చెప్పెదను. ఆమె తప్పక తీసికొనును."

"అట్లు చేయకుడు. అక్క అమ్మమనసు బాగుగ నెఱుఁగును. అక్క అమ్మకోరిక ననుసరించి సదా నడుచుకొనుచుండును—అమ్మనుగుఱించి ఆమె సరిగా నంతయు నెఱుఁగును. ఈ రూపాయ లుంచుఁడు. నేను మీతో చెప్పియుంటిని—మే మంత చిక్కులలో లేము," అని వేఁడుకొనుచు సావిత్రి అన్నది.

సావిత్రి మహాభారతమున సన్యాసినియైన రాజకన్యక వంటి గౌరవము కలది, ఆమె వెళ్లిపోఁగానే విశ్వేశ్వరుఁడు మతిపోయినవానివలె అక్కడ సాగిలఁబడిపోయెను.



# పదియవపరిచ్ఛేదము

## సతి యింటి కష్టములు

ధనవంతులుగానుండి కాలవశమున దరిద్రులగువారికి లేమివలనకలుగు బాధకంటె గౌరవము తగ్గినదని భావించుట వలన కలుగు బాధ యధికము. మంచి యవస్థలో నున్నప్పుడు ఎట్టిసంకోచము లేక యితరులు చేయు సహాయము నందుకొనఁ గలవాఁడు స్థితి చెడినప్పుడు ఆ సాయమే ఎంతో బాధతో అందుకొనును. ఇది తెలిసికొనలేక లోకు లట్టిదానికి అహంకార మనుచుందురు. అట్టి యవస్థలో నుండు వాని మనస్సున కోప ముండవచ్చును, కాని ఆకోపము మనుష్యులపై కాదు, దేవుని పైని.

శీతసాయాహ్నమున తీవ్రమారిన సూర్యకిరణములు దరిద్రుల గృహాంగణమును మెల్లగా ప్రవేశించుచున్నవి. మరమ్మతులు లేని వంటయిల్లు వంట కుపయోగముగ లేదు. లోనుండు అస్థిపంజరమును వెల్లడిచేయుచున్న ఇటికగోడలు మూర్తీభవించియున్న దారిద్ర్యమువలె నున్నవి. కాని అంగ-ణము మాత్రము పరిశుభ్రముగా నున్నది, తులసికోట, దాని చుట్టునుండు స్థలము చక్కఁగా నలకఁబడి ముగ్గులతో నిండి యున్నవి. చెట్లు మొక్కలు మంచి సంరక్షణము పొందు-

చున్నవి. దారిద్ర్యరాక్షసిని దాచియుంచుటకు జరుగుచున్న ప్రయత్నము అంతటను స్పష్టమగుచున్నది.

కాళీపదుఁడాటకై బయటికి పోయెను. సతి సోడావేసి యుడుకఁబెట్టిన బట్టల నుతికి తాడుపై నారవేయుచున్నది. సావిత్రి ఎండుపిడకలు నాలుగుతెచ్చి విరిచి నిప్పుచేయుచున్నది. అంగణము పొగతో నిండియున్నది. జాహ్నవి చిన్న ప్రమిదలో దీపము నుంచి తులసికోటయెదుట ప్రణామము చేయుచున్నది. ఆమె శరీరము మిక్కిలి క్షీణించియున్నది. చింతాజ్వర మామెను రేయింబవళ్లు దగ్ధముచేయుచున్నది. కొమార్తెలది యొకటేఁగి కూడ తల్లికి జబ్బుచేసినదని యనుకొనుచుందురు; ఔషధము కొఱకై ప్రయత్నించుచుందురు. తల్లి యేమియు ననక కూర్చుం డును.

కాళీపదుఁడు పలుగెత్తి లోనికివచ్చి తల్లిపైఁబడి, "అమ్మా, నా పిప్పరమెంటు బిళ్ల లేవీ?" అని యడిగెను. తులసి కోటకు ప్రణామము చేయుచున్న తల్లి పిల్లవానిని చేతితో ప్రక్కకు త్రోయుచు, "అక్కదగ్గఱకు వెళ్లి యడుగు," అని యనెను. సావిత్రి వానిని పిలిచి, "అక్క నీకొఱకు పిప్పరమెం-టులు తీసికొనిరమ్మని అత్తమ్మతో చెప్పినదిరా తమ్ముఁడూ, అత్త వచ్చువేళైనది," అని యనెను.

అక్క తమ్ముని ఎత్తుకొని కాళీపదుని దేహమున నుండు ధూళిని తుడుచుచు, "చొక్కాతొడుగుకొనక తిరుగుచుందు వేల తమ్ముడూ?" అని తమ్మునితో నన్నది.

"అంత చింకిచొక్కాలెవరైన తొడుగుకొందురా? అది చూచి బిపిన్ వేళాకోళము చేయుచున్నాడు, నే నది మఱి తొడుగుకొనలేను." "ఇదిగో, ఇది చూడుము? ఇదియెంచిని! అక్క కుట్టి సరిచేసి యిచ్చినది." అని యనుచు సావిత్రి తమ్ముని చేతి కొక చొక్కా యిచ్చినది. పిల్లవాఁడాచొక్కాను ఇటునటు త్రిప్పి, పరీక్షచేసి, దూరముగ విసరివైచుచు, "ఇదేనా మంచిది అనఁగా? కుట్టుట అనఁగా ఇదేనా? అది నేనెన్నఁడును తొడుగుకొనను," అని యనెను.

"నా బంగారు తమ్ముఁడవు కావు నాన్నా! చూడు మమ్మా కాళ్లెంత చల్లనై పోయినవో — చలి వేయుచుండుట లేదూ? ఇప్పుడు బిపిన్ వచ్చి వేళాకోళము చేయలేఁడుగదా—ఇంటిలో నున్నప్పుడు ఎవరు చూచెదరు?"

పిల్లవాఁడీమఱపింపులకు లొంగక కాళ్లు చేతులు కొట్టుకొనుచు సావిత్రిని చీకాకు పెట్టుచున్నాడు. జాహ్నవి దగ్గఱకువచ్చి కుమారుని సావిత్రియొద్దనుండి తీసికొని, పైట చెంగుతో వానిని కప్పి ఇంటిలోనికి పోయినది. సావిత్రి కనులు తుడుచుకొనుచు వే తేదో పనిచేయుటకై వెళ్లిపోయినది. సతి త్రాడుపై వ్రేలాడుచుండు బట్టలవెనుక మాటలాడక నిలిచి యున్నది.

"శాంత" బాగ్దీలయింటి ఆడుపడుచు. వీరికిని ఆమె-కును బహుమైత్రి. వీరు వడికిన యజ్ఞోపవీతములు, త్రాళ్లు, వీరు పండించిన కాయలు పండ్లు అమ్మి వానికి మాఱుగా ఇంటి

కవసరమగు బియ్యము, పప్పు, ఉప్పు మొదలగు నవన్నియును తెచ్చి యిచ్చుచుండును. భట్టాచార్యుల యింటిదుఃఖము ఈమెకు తనయింటి దుఃఖమే. వారెంత దీనావస్థలో నున్నారో అందఱికిని స్పష్టము కాకుండుటకు కొంతవఱ కీమె స్నేహమే కారణము.

తలపై గంపనుంచుకొని శాంత, "అమ్మా, సతీ!" అని పిలుచుచు ఇంటిలో ప్రవేశించినది. శాంత కంఠము వినఁగానే కాళిపదుఁడు, "అత్తా, నా పిప్పరమెంటు", అనుచు బయటికి పఱుగెత్తి వచ్చెను.

"ఇదిగో నాయనా, పిప్పిరిబింటలు—లేకున్న బ్రతుకున్నదా? ఇవిగో తీసికొనుము"—ఇట్లనుచు శాంత కాగితము పొట్లామొకటి పిల్లవానిచేతిలో పెట్టినది. పిల్లవాఁడు మహానందముతో, "అమ్మా ఇదిగో! చూడు, చూడు," అనుచు లోపలికి పఱుగెత్తెను.

సతి దగ్గఱకు వచ్చి నిలిచెను. శాంత గంప నేల నుంచి "చలికి కాళ్లు చేతులు తిమ్మిరు లెక్కినవి—అన్నట్లు, నిప్పు చేసితివే తల్లీ?" అని యన్నది.

"లేదు."

"అట్లైన దీపము తీసికొనిర మ్మమ్మా. సావీ! ఎక్కడ తల్లీ, దీపము తెమ్ము."

సావిత్రి మెల్లగ వచ్చి, "నూనె తెచ్చితివా అత్తా? నూనె మొదట నిమ్ము, ప్రమిద వెలిఁగించి తీసికొని వచ్చెదను."

"నా దశకూడ అలాగుననే ఉన్న దమ్మా. నడువలేను, రాత్రి యైపోయినది, సంత దగ్గఱకాదు కదా! ఇదిగో చూడు మమ్మా! నీవి పసికన్నులు, బాగా సాయంకాలము కానే లేదు, నా కనుల కంతా చీకటే! ఇదిగో అమ్మా, ఈ నూనె అందుకొనుము, ఇది నాలుగు కానులు—చూచితివా? ఈ రాజ్యములో మఱి ఉండలేము తల్లీ! బియ్య మెంత ప్రియమో నూనెకూడ అంత ప్రియము. అన్ని పాడునోళ్లవెంటను ఒకటే మాట కదా!"

"పళ్లెమున కెంత ఇచ్చిరత్తా?" అని సతి నెమ్మదిగా నడిగినది.

జవాబు చెప్పఁబోయి కొంత కంట నీళ్లు పెట్టుకొన్నది. "ఆమాట మఱి యడుగకు మమ్మా, అడుగకుము. అంతపెద్ద పళ్లెము రూపాయకైనను అక్కఱలేఁదట. కొన్నప్పుడు మూఁడు రూపాయలు పుచ్చుకొన్నారు—దొంగలమ్మా, పచ్చి దొంగలు! బందిపోటులు!" "పళ్లెము పాతది కదత్తా!" అనుచు, సతి ఆమె నోదార్చి, "అట్లైన ఎంత యిచ్చినారత్తా చివరకు?" అని యడిగినది.

"రూపాయకు తక్కువకీయనన్నా నమ్మా. అర్ధరూపాయ పిల్లవానికోసము తెచ్చిన ఈబట్టకైనది; అర్ధరూపాయకు పప్పు, బియ్యము, ఉప్పు తెచ్చినాను—చూడు మమ్మా, లెక్క సరిగా ఉన్నదో లేదో, నార కొనుటకు డబ్బు చాలలేదమ్మా. క్రిందటి మాఱు త్రాళ్లమ్మఁగా దొరకిన ఎనిమిదణాలకు బియ్యము

చూచి పరమాన్నమని సంతోషించి కొంచెము తినునేమో,"
అని సావిత్రి కనఁబడగానే సతి యన్నది.

ఆమాట పెత్తల్లి చెవిని పడ్డది. "ప్రతి విషయములో మీకు నవాబ్ గిరియే! నిరుపేదల కింత ముద్దెందుకమ్మా! కడుపు మాడుచున్నయెడల తానే కోరి తినును—అనవసరముగా బెల్లము పాడుచేయ నక్కఱ లేదు," అనుచు పెద్దపెద్ద కేకలు వేసినది పెత్తల్లి.

పెత్తల్లి తిట్లు కలవాటు పడియుండుటచే ఆ మాటలవలన వారికి దుఃఖము కలుగలేదు. సావిత్రి కుండచూచి "బెల్లము లే దక్కా," అన్నది.

"ఎట్లుండఁ గలదు? ఈయింట ఎట్టి సిరియైన నేల నుండును?" అని పెత్తల్లి యన్నది.

అసలే భరింపరాని కష్టములు, వానిపైని అనవసరమైన మాటలవలనకలుగుబాధ—ఆయింట మణికాంచనసంయోగమే! సతి వంట ముగించి అమ్మను భోజనమునకు పిలువవచ్చుట పెత్తల్లి చూచి, గొణుగుచు, తిట్టుచు కొంచెము బెల్లము సతి చేతఁబెట్టి యిట్లన్నది—"ఇదిగో ఇది పుచ్చుకొనుము, లేనియెడల పిల్ల వాఁడు బొత్తిగా తినలేఁడు. ఆహా! ఎటువంటి యిల్లు కదా! లేకున్నను లేదనుటకు వీలులేదు! ఆ నాఁడు వట్టి నీళ్లు త్రాగి బెల్లముముక్క గూటిలోనుంచుకొన్నాను—ఏమి తినవలె నన్నను వీలులేదు గదా ఈ పాడుయింట!"

సతి తల్లియొద్దకు వెళ్లి, "అమ్మా, లెమ్ము; భోజనమునకు

రమ్ము," అనుచు తల్లిని లేపినది. "నాకు నేడు జ్వరము వచ్చియు న్నున్నదమ్మా, నీవు భోజనముచేయుము; దొడ్డమ్మను భోజనము చేయు మనుము. నేను నేడు తినలే నమ్మా," అని తల్లి మెల్లగ నన్నది.

"నీ కీవిధముగ జ్వరము ప్రతిదినమును వచ్చుచుండు నమ్మా. తిండిలేక ఎన్నాళ్లు బ్రతికియుండఁ గలవు? తినగలిగినంత తినవచ్చును లెమ్ము."

"లే దమ్మా, నేను తినలేను," అన్నది తల్లి.

"ఇటుపైని మన నొసట ఉపవాస ముండనే యున్నది, ఇప్పటినుండి యేల మాడుచుండవలెను," అని రుద్ధకంఠముతో సతి యనెను.

జాహ్నవి లేచివచ్చి భోజనమునకు కూర్చుండినది. కనులు విప్పి చూడకున్నను జాహ్నవి యెఱుఁగని విషయ మేదియు లేదు, ఈ రీతిగనైన నింక ననేకదినములు గడవవని ఆమెకు బోధపడినది. ఈ భయంకరమగు చింతాజ్వరము వలననే ఆమెకు ప్రతిదినమును నిజముగాకూడ జ్వరము వచ్చుచున్నది.

ఇంట నేరవంత తినుబడి సామానుండెనో అది రెండు రోజులలో అయిపోయినది. తినవలసినవా రింట నలుగురు, కాని ఆర్జించువాఁ డొక్కఁ డైనను లేడు. కాళిపదుఁ డుదయమే లేచి, "అమ్మా, ఆఁకలిగా నున్నది, తినుట కేమైన నిమ్ము," అని యనెను.

"అమ్మా," అని యనుచున్నను కాళీపదుఁ డక్కదగ్గఱకు పోయి నిలిచెను. సతికి లేచుటకు కాళ్లు రాలేదు; ఏమియు జవాబీయక అచ్చటనే కూర్చుండెను.

"అక్కా, లెమ్ము! వంటచేయవా?" అని అడుగుచున్నను అక్క లేవకుండుట చూచి పిల్లవాఁడు ఫిర్యాదుచేయుట కమ్మయొద్దకు వెళ్లెను. సతి యప్పుడు, "చూడుమమ్మా చెల్లీ, బుట్టలో కొంచెమైనను ప్రత్తియున్న దేమో," అని సావిత్రితో మెల్లగా నన్నది.

"లే దక్కా"

"అట్లైన, నేఁ డుపవాసమేనా సావీ! తమ్ముఁ డేమితినును నేఁడు? నేఁడు సంతరోజు కాదే! సంతరోజైనయెడల చెంబును అత్తచేతికిచ్చి సంతకు పంపియుందును, ఏమి చేయుదము సావీ?"

"ఈవిధముగ మఱియెన్నాళ్లు గడపఁగల మక్కా? దీనికంటె విశుదాదా—" చెల్లిమాట పూర్తికాకమునుపే తటాలున లేచి సతి, "ఛీ ఛీ! అంతకంటె కడుపుమాడి చచ్చుట మేలు," అని చెల్లిని చీవాట్లుపెట్టుచు అతితీవ్రముగ నన్నది.

సావిత్రి తలవాల్చుకొని కొంతసే పూరకయుండి, "తిండి లేక నేను చావవచ్చును, నీవు చావవచ్చును, కాని అమ్మమాట యేమి? తమ్ముని మాట యేమి? బిచ్చమెత్తియైనను వా రిద్దఱిని కాపాడ వద్దా అక్కా?" అని తుదకు మెల్లగ ననెను.

"బిచ్చమా ? ఆహా బిచ్చమెత్తవచ్చును. కాని మఱి రెండురోజులు తాళుము, నిలువ నీడలేక చెట్టుక్రింద నే నాఁడుండవలసివచ్చునో ఆ నాడే నలుగుఱికడ కొంగుచాచవచ్చును. ఆ చెంబు తెచ్చియిమ్ము చెల్లీ, నే నొకమాఱు అత్తదగ్గఱకు పోయివచ్చెదను."

ఇట్లు సంభాషణ జరుగుచుండ, హఠాత్తుగ, సావిత్రి గొంతెత్తి బిగ్గఱగ నన్నది—"అన్న య్యోడుగో అక్కా!... అన్నయ్యా! అన్నయ్యా!"

చక్కగా తల దువ్వుకొని, ముస్తాబయి, చేతికఱ్ఱ నాడించుకొనుచు హరిశంకరుఁ డంగణములోనికి వచ్చి నిలిచియుండి, "ఏమి చేయుచున్నారే!" అని యనెను.

సావిత్రి, "అన్నయ్యా," అనుచు నేడ్వసాగినది. సతి కఱ్ఱకట్టె నేల కూర్చుండఁబడిపోయినది.

"ఏమి జరిగినది? ఏడ్చుచున్నా వేల? అమ్మ క్షేమముగా ఉన్నదా?"

"అమ్మ విషయమై నీ వెప్పుడైన తలఁచుచుందువా అన్నయ్యా? నీ తమ్మునికి నేఁడు తిండిలే దెరుగుదువా? అమ్మ ఎన్నాళ్లిట్లు దుఃఖించుచు బ్రతికియుండఁగలదు? మా యవస్థను గుఱించి నీవొక్కమారైనను ఆలోచించితివా?" అని సావిత్రి అశ్రురుద్ధకంఠముతో నడిగెను.

"నేనేమి చేయఁగలను? డబ్బు ఖర్చుచేసి నాన్న నాకు చదువు చెప్పించినాఁడా, మీయందఱిని నేను పోషించుటకు?

కేవలము స్వప్రయత్నమువలన నేను నాపొట్ట పోషించుకొనఁ గలుగుచున్నాను, అట్లు కాకున్న నేనుకూడ మీ యవస్థలో నుండవలసినదే. ఇదిగో పదిరూపాయలనోటు నాయొద్దనున్నది, ఇది పుచ్చుకొనుము—ఉంచుకొని లేదను అన్నను కాను నేను."

సావిత్రి రూపాయలు పుచ్చుకొని, "నన్ను క్షమింపు మన్నయ్యా, నాది పాడుబుద్ధి!" అని మెల్లగ ననుచు నేడ్వ మొదలుపెట్టినది.

"ఏడ్వకు సావీ, వద్దు వద్దు, ఏడ్వకు. నే నింక పోయెదను. వీలైన పైమాసములో నొకమాఱు వచ్చెదను, ఈ యింట నే నెట్లుండఁగలను చెప్పు," అని అన్న యనెను.

"అమ్మ నొకమాఱు చూచిపో అన్నయ్యా."

"చూచి యేమి ప్రయోజనము ? వచ్చి వెళ్లితినని చెప్పుము."

హరి వెళ్లిపోయెను. "లె మ్మక్కా, కొంత త్తను పిలుచుకొని వచ్చి బజారుచేసికొని రమ్మని చెప్పుము," అని సావిత్రి సతితో నన్నది.

"ఇదిగో లేచుచున్నాను. చూచితివా సావీ, తమవారి కంటె పైవారు మేలు, కాని మనకు పైవారనఁగానే సిగ్గు, తమవారిదగ్గఱ నెట్టి సిగ్గు నక్కఱలేదు."

కొన్నాళ్లవఱకు నిప్పుడు సతి నిశ్చింతగా నుండవచ్చును, కష్టములకు లక్ష్యపెట్టునది కాదు సతి, ప్రాణాంతకము గు కష్టములే సతికి కష్టములని తోఁచును. అన్నము, కూర, విరామము

లేని పరిశ్రమ—ఇవి యన్నియు నామె కంటికి ఒక్కజాతి వస్తువులే—వీనిలో నేదియైన నతి సులభముగా భరింపఁగలదు.

వారీమాఱు నారదూడి మొదలగునవి అధికముగ కొని, భోజనసామగ్రిమాత్రము అత్యంతావశ్యకమైనదే కొనిరి. కాళిపదుని మఱువక వానికొఱకొక చిన్న చొక్కా తెప్పించిరి. ఆ మఱునాఁటి యుదయము తొంత వచ్చి సతితో నిట్లనెను—"ప్రొద్దున లేచి కూర లమ్ముటకు జమీదారుగారి యింటికి వెళ్లితిని. వారి యమ్మాయి కమల అత్తవారి యింటినుండి వచ్చినది. నిన్నొకమాఱు తప్పక రమ్మన్నది, రాని యెడల మిగుల దుఃఖించెదనని చెప్పినది."

అట్లైన, కమల యిప్పటికిని సతిని మఱువలేదు. తొంత మాటలు విని సతి కొంచెము నవ్వినది—అది దుఃఖమువలన కలిగిన నవ్వో, సుఖమువలనకలిగిన నవ్వో చెప్పుట కష్టము. మధ్యాహ్నము పోయినచో చాలసేపు కూర్చుండవలసివచ్చును, సతి చేయవలసిన పనికికూడ భంగము కలుగును. కనుక నామె తల్లితో, "అమ్మా నే నిప్పుడే కమల నొక మాఱు చూచి వచ్చెద," నని యనెను.

"వెళ్లు" మన్నది తల్లి.

సతిని చూడఁగానే పూర్వమువలె కమల యామెను కౌఁగిలించుకొని మిక్కిలి యానందముతో, "సతీ, నన్ను

మఱువలేదు కదా? అప్పుడప్పుడు నేను జ్ఞప్తికి వచ్చుచుందునా?"
అని యడిగెను.

సతి కమలను చూచి ఉలికిపడినది. ఈమె కమల యేనా! రెండుసంవత్సరముల క్రిందట కమల అంగములు సుఖ సౌభాగ్యములతో నిండి పూర్ణశోభను పొందియుండెను. ఆ కమల కిట్టి శుష్కశరీరము, ఇట్టి మ్లాన వదనము ఎట్లు ప్రాప్తించినవి? ఈమె ఆ కమలయేనా! "ఇట్టి స్థితి వేమి కమలా, ఏమిజబ్బు చేసినది?" అని సతి దిగులుచెందుచు నడిగినది.

"జబ్బా?" అనుచు కమల నవ్వినది; "నామాట అటుండనిమ్ము. నీదశ యిట్లుండ నామాట అనుచున్నావేమి సతీ? నీ పెండ్లియైనను చూడకుండ, నిన్నీ దశలో చూచుచున్నాను!"

" 'దశ' యనునంత దేమున్నది? నాయవస్థలో? నేనెప్పుడును ఎట్లుంటినో ఇప్పుడుకూడ నట్లే యున్నాను."

"ఔను నీవన్నది అబద్ధము కాదు. పెండ్లినాడు తప్ప మఱియొక్కమాఱైనను అతనిని నీవు చూడలేదని విన్నాను. వినను ఎంత దుఃఖకరమగు సంగతి!"

కమల మాటల కడ్డువచ్చి సతి, "నా మాట యటుండనిమ్ము. నీ క్షేమమైనది చెప్పుము కమలా? మునుపటి నీ నవ్వుముఖ మెక్కడికి పోయినది, కమలా?" అని యడిగినది.

"నీవు నామాటయే యెత్తుచున్నావు. నేను నీముఖము చూచుచున్నాను. సతీ, నీవు మునుపటివలెనే ఉన్నావు, నిజమే, కాని నీ వేషము చూచి నాకు కనులు మూసికొనవలెనని బుద్ధి

పుట్టుచున్నది. ఏమి పాపము చేసితిమే చెల్లీ మన కిట్టిదశ పట్టుటకు?"

కమల సతిభుజములపై రెండుచేతులను వేసి ఆమెను కౌఁగిలించుకొని ఆమెగుండెపై ముఖమునుంచి వెక్కసాగెను. సతి యెట్టిచలనములేక రాతి విగ్రహమువలె కూర్చుండెను. కొంతసేపటికి మనస్సు స్థిమితపడఁగా కమల ముఖమెత్తి కన్నులు తుడుచుకొన్నది. సతి యప్పుడు, "పుష్య మాసమున నిన్నెట్లు రానిచ్చిరి కమలా?" అని యడిగినది.

"వచ్చి రెండు సంవత్సరము లైనది, ప్రాణములు కొట్టుకొనుచుండెను, కనుక, నొకమాఱు చూచి పోదమని వచ్చి సాను. అదికాక, వచ్చిననేమి, పోయిననేమి—నన్ను వద్దను వా రెవరు?"

"ఎంత మాటన్నావు! నీ భర్త!"

కమల మరల నవ్వినది. ఆ నవ్వు చూచి సతికి దుఃఖము కలిగినది.

కమల నవ్వుచు, "భర్త యాఁ?" అన్నది. "నే నతనికి ఎవతెను గనుక నన్ను వద్దనుటకు? నే నెవతెను గనుక నా కొఱకు వెదకుచుండుటకు? స్త్రీ యొక్క పూలహారము వంటిది, చెల్లీ—ఒక్కనాఁడే మనముపొందు ఆదరణ, ఆ మఱునాఁడు మంటిలోపడి దొర్లుచుండుటయే మన భాగ్యము!" సతి ముఖము వాల్చుకొని కూర్చుండెను. కమల మాటలాడ సాగెను—"నీవు దేనిరుచియు నెఱుఁగవే—ఒక విధముగ

నదియే సుఖము. నాయవస్థ బహు దుఃఖకరమైనది సతీ; నీ దశయు నా దశయు చూచుటవలన నాకు బోధపడినది స్త్రీజన్మమెత్తుట దుఃఖమనుభవించుటకే యని. సుఖమనువస్తువు స్త్రీలకొఱకు పుట్టినది కాదు. స్త్రీలు దానికొఱ కాశించుట పొరపాటు."

ఒకనాఁ డెప్పుడో సతి బయటి ద్వారముదగ్గఱ నిలఁబడి ఏదో పనికై కాళీపదుని పిలుచుచుండెను. ఆ సమయమున జమీందారుగారి యబ్బాయి నరేణభాదురీ గుఱ్ఱమెక్కి ఆ దారిని పోవుచుండెను. అది చూచి సతి ప్రక్కకు జరిగిపోయినది. కాని అతనికంట నొక పాడుచూపుండెను—ఆ చూపు వలన సతికి పట్టరాని యసహ్యము కలిగినది—ఆమాట సతికి నేఁడు జ్ఞప్తికి వచ్చి ఈ జన్మమున కమలకు మఱి సుఖము లేదని తెలిసికొనినది. మఱి కొంతసే పీద్దఱును కలసి మాటలాడిన పిదప, "నన్నిక పోని మ్మక్కా," అని సతి యన్నది.

"మఱి కొంచెము కూర్చుండవే చెల్లీ, మరల నెన్నడైన మనము కలసికొనెదమో, లేక అసలే కలసికొనలేమో తెలియదు."

సతి దేహమున గగుర్పాటు పుట్టినది, "ఏమి యక్కా, అట్లనుచున్నావు! నీ విచ్చటికి వచ్చినంత మాత్రాన మనము కలసికొనవచ్చును కదా!" అని సతి యన్నది.

కమల నవ్వుచు నిట్లన్నది—"నాకు చావు వచ్చునని నే ననలేదు చెల్లీ, అంత యదృష్టవంతురాలను కాను నేను. కాని యింటికి వచ్చి చూచితిని మీ నాన్న లేఁడు, నీవు

విధవవు—ఈమూలు వచ్చునప్పటికి ఇంకేమేమి జరిగియుండునో కదా!" ఆ మాటలు విని కమల యనినదానిలో నెట్టి నిజమును లేనట్లు నటించి సతి నిర్లక్ష్యముగ నవ్వినది.

మఱికొన్ని నిమిషములు కూర్చుండి సతి సెలవుతీసికొన్నది. కమలనుగుఱించి యాలోచించుచు మిగుల భారాక్రాంతమగు మనస్సుతో సతి యింటికి వచ్చుచుండెను. ఎడమవైపున బత్తీవారికంచె, దక్షిణమున వెదురుపొదలు—వీని నీడలోనుండి వచ్చుచున్న సతికి తీవ్రమగు శీతవాయువు తగులుచుండెను. క్రిందికి చూచుచు పరధ్యానముగ సతి నడుచుచున్నది. హఠాత్తుగ దారినడుమ నెవరో ఉలికిపడి నిలిచి ఆశ్చర్యపడుచు, "ఎవరిది, సతియా?" అని యనెను.

సతి ముఖమెత్తి చూచినది, ఎదుట విశ్వేశ్వరుఁడు నిలిచియుండెను.

సతి తడఁబడుచు ముసుఁగు మఱికొంచెము క్రిందికి లాగుకొని ప్రక్కకు తప్పుకొనినది—తాను ప్రక్కకు తప్పుకొనినయెడల విశ్వేశ్వరుఁడు తనదారిని పోవునని అనుకొనెను, కాని యతఁడు సతికి దారిచేసి తా నక్కడనే నిలిచియుండి, కొంచెము తడఁబడుచు గొంతు సవరించుకొని, "సతీ నేను నీకు వరుసకు అన్నను, నీతో నిట్లు నిలిచి మాటలాడుట కూడని పనియా?" అని యడిగెను.

సతి ప్రత్యుత్తర మీయలేదు. చీకాకు, బిడియము, భీతి మొదలగువానితో నామె మనస్సు ఆందోళితమగుచుం-

డెను. "చెల్లెలితో మాటలాడిన తప్పేమి?" అని విశ్వేశ్వరుఁడు మరల నడిగెను.

సతి సాహసముచేసి, "ఏమి చెప్పెదరో చెప్పుడు త్వరగా," అని వడిగా నన్నది.

"మా అమ్మకు ప్రణామముచేసి నే నర్పించినదానిని నీవేల తిరుగఁగొట్టితివి సతీ!" అని విశ్వేశ్వరుఁడు దీనముగ నడిగెను.

"అవసరములేక పంపివేసితిని."

"అవసరము లేక పోవచ్చును—అనురాగముతోనో, భక్తితోనో ఎవరైన నిచ్చిన దానిని అనవసరమని తిరుగఁగొట్ట వచ్చునా, సతీ?"

సతి వెనుకకు తిరిగి కొంచెమునేపు నిలిచి తీవ్రకంఠముతో ఉత్తర మిచ్చినది—"పుచ్చుకొనుట కర్హులగువారు పుచ్చుకొనవచ్చును, వారి కెట్టి లేమియు నుండదు గనుక. కాని అట్టివారికి మీరు ప్రణామ మర్పింపరని నా యూహ. మేము నిరుపేదలమని ఎఱిఁగి మీ రావిధముగ మాకు సహాయముచేయఁ బూనుకొంటిరి. మేము పేదవారము నిజమే; కాని మా కసాధ్యము కానంతనేపు స్వప్రయత్నముపై నాధారపడక బిచ్చమేల యెత్తుకోవలెనో మీరే యోచించి చూడుఁడు."

విశ్వేశ్వరుఁ డేమియు ననక చాలనే పక్కడనే నిలిచి యుండెను. సతి ముందుకు నడచుచుండుట చూచి రుద్ధకంఠ

ముతో ప్రారంభించెను—"నన్ను క్షమింపుము సతీ, మీకు నేను బిచ్చమీయఁగోరలేదు. నామాట నమ్ముము, నేను—నేను అనురాగముకొలఁది మీకు—"

విశ్వేశ్వరుని మాట పూర్తిచేయనీయక సతి ఇట్లన సాగెను—"మీరు కూడ నన్ను క్షమింపవలెను. మీవంటి దయార్ద్రహృదయునితో కూడ నేనింత కఠినముగ మాట-లాడితిని. కాని యోచించినయెడల మీకే బోధపడును—మీ కర్తవ్యమును మీ రాచరించితిరి, నాకర్తవ్యమును నే నాచరించితిని. భగవంతునికృపవలన ఇప్పటికిని మాకు రోజులొక విధముగ గడచుచున్నవి, అట్లుకూడ సాధ్యము కానినాఁడు కేవలము మీకడనే కాక అందఱికడను కూడ చేయి చాచవలసి వచ్చునేమో!"

"నన్ను క్షమింపుము సతీ, మీరు నాచెల్లెండ్రే యను-కొనుచు నట్టిది చేసితిని."

"నే నది యెఱుఁగక పోలేదు."

నాలు గడుగులు ముందుకు పోయి సతి మరల వెనుకకు తిరిగి బిగ్గఱగా మాటాడ సాగినది—"అప్పు డప్పుడు మీరు మాయవస్థను గుఱించి యాలోచించు చుందురేమో. కాని మీరు మనస్సును కలఁతఁజెందనీయకుఁడు. మొన్నను మా అన్నయ్య యింటికి వచ్చి యుండెను—అతఁ డిప్పు డేదో పనిలో నున్న ట్లున్నది. అన్నయ్య బుద్ధిమంతుఁ డగుచో మాకెట్టి కష్ట

ములు కలుగవు—అతఁడు బుద్ధిమంతుఁడు కావలెనని దీవిం-
పుఁడు."

"మనఃపూర్తిగ దీవించుచున్నాను సతీ. అతఁడు బుద్ధి-
మంతుఁ డగుఁగాక, మీకష్టము లన్నియు నివారణ యగును
గాక. అట్లైన మీ అన్నబుద్ధి ఇప్పుడు కొంచెము స్థిరపడిన
దన్నమాట. విని మిగుల సంతోషమగుచున్నది. సతీ, నే నెట్టి
కపటమును లేక చెప్పుచున్నాను—నీ ధోరణివలన నాకు
కొంచెము దుఃఖము కలిగినది కాని అది మఱి నన్ను బాధిం-
పదు. నీవు కూడ నేమియు మనస్సున నుంచుకొనకూడదు."

"లేదు, ఉంచుకొనను."

---

## పదునొకండవ పరిచ్ఛేదము

### కమలభర్త సతికి జబ్బియబోవుట

జాహ్నవి మాఘమాస మంతయు నేదో విధముగ ఇటు నటు మసలుచు గడపఁగలిగినది గాని ఫాల్గునమాస ప్రారంభము ననే మంచము పట్టినది. శీతకాలమంతయు చలిని లక్ష్యపెట్టక జబ్బుశరీరముతో తిరుగుచు, చివరకు మంచ మెక్కవలసి వచ్చినది. తల్లి నిర్జీవియై అట్లు పడియుండుటచే సతికి నలుదిక్కులు నంధకారమై పోయినది.

దరిద్రులయింట మందులసందడి అంతగా నుండదు, ఐనను వారికి సాధ్యమైనంతవఱకు చికిత్స చేయుచునే యుండిరి. హారాణ్ డాక్టరు మందులకు వచ్చి చూచినందులకు బిల్ చేసి పంపించెను. ఎంతో ప్రయత్నముపైని చిక్కులన్నియు సరిచేసికొని అసాధ్యమగు కష్టములు లేకుండ సంసారమును ఇంతవఱ కేదో విధముగ నడిపించుకొని వచ్చిరి. కాని యీడాక్టరు బిల్ వచ్చి ఆ రవంతసుఖమును ఎత్తుకొనిపోయినది. దారిద్ర్యపిశాచము ఈ అభాగ్యకుటుంబమును మ్రింగుటకై మరల నింట ప్రవేశించినది. జాహ్నవి, "నేను బాగుకానున్నచో ఏ ప్రయత్నమును లేకయే బాగయ్యెదను, మన మీయవస్థలో నున్నప్పుడు ఇంత కర్చేల చేయుచున్నారమ్మా?" అనుచు పిల్లలను మాటిమాటికి నిరుత్సాహ పఱచుచుండెను. ఇంట నేదెట్లు జరుగు

చున్నదో జాహ్నవి సదా కనుఁగొనుచుండును, ఎవ రెట్లు బాధ జెందుచున్నారో యని మాటి మాటికి అడుగుచుండును. సతి తల్లితో, "అమ్మా నీ వంతదిగులు చెందుచుండిన నీశరీర మెట్లు బాగు కాఁగలదు," అనుచు, "ఇంత కాల మెట్లుజరిగినదో అట్లే యిఁకముందుకూడ జరుగును. అన్న మరల ఇంటికి రాఁగానే మన కేట్టిలోటును ఉండదు—ఎంతబాధపడినను ఈనాలుగు రోజు లేకదా!" అని తల్లికి ధైర్యము చెప్పుచుండెను.

"ఆ శ్లైన హారికి కబురు పంపుము," అని కొంచె మాలోచించి ఒకనాడు తల్లి యన్నది.

"పంపితిని రెండురోజులలో అన్న వచ్చును."

సతి అన్నకు కబురుపంపినది నిజమే, కాని హారి ఆ పంపిన వానిని నాలుగు తిట్టి పొ మ్మనెను; సతి ఈమాట తల్లితో చెప్ప లేకపోయినది. క్రమక్రమముగ అన్న అధోగతి పాలగు-చుండెను—ఐనను మఱియొకమా అన్నకు కబురుపంపి చూడ-వలెనని సతి నిశ్చయించుకొన్నది. మనస్సును కరఁగించుమాటల ననేకము నేర్పి తొంత తనుతోడిచ్చి కాళీపదుని చాంద్ పూరు నకు పంపినది. కొంతసేపటి కిద్దఱును తిరిగి వచ్చిరి—హారిబా బచ్చట లేఁడు, కలకత్తా వెళ్లినాఁడఁట. సతి మాటాడక కన్నీరు తుడుచుకొనుచున్నది.

ఇంట నే నాలుగుసామానులు మిగిలియున్నవో వాని-నొక్కొక్కటిగ తొంత సంతకు కొనిపోయి అమ్మి వచ్చు-చుండెను. ఇంటికర్చులు, రోగిపథ్యపానాదులు ఈవిధముగ

కొన్నాళ్లు గడిచినవి. ఇట్టిస్థితిలో నున్నప్పుడుకూడ వారెవరి-యెదుటను చేయి చాచలేదు, ఎవరిదగ్గఱను తమయవస్థను-గుఱించి చెప్పుకొనలేదు. చెప్పరానిదురవస్థలో నుండుటవలన వారెవరియింటికిని పోవుచుండలేదు, కనుక నెవ్వరును వారి యింటికి వచ్చుచుండలేదు. ఈ కారణముచే వారియింటి యవస్థ సరిగా నెవ్వరు నెఱుఁగకుండిరి.

ఇంకను తగ్గించుట కేవల మసాధ్యమున్నంతవఱకు ఖర్చులు కోసి సతి సంసారము నడుపుచున్నది. కాళీపదునకు మిగులకష్టము లేకుండునటుల చేయఁగోరి అక్కచెల్లెం డ్రిద్ద-ఱును అర్థోపవాసములతో కాలము గడపుచుండిరి.—ఇట్లు చేయుచున్నను ఇఁక ననేకదినములు గడచినట్లు కనఁబడలేదు.

చైత్రమాస మాఖరగుచున్నది. జాహ్నవికి రోగము చాల భాగము తగ్గినది, తామంత దురవస్థలో నున్నను సతికి అంధకారమున తీరము కానవచ్చినది. కాని రోగమునుండి విముక్తురాలయి తల్లి తుదకు ఆహారము లేక ప్రాణత్యాగము చేయవలసి వచ్చునేమో యని యామె దిగులుచెంద నారంభించినది. ఒకనాడు సతి మిగుల దుఃఖించుచు చేతులు జోడించి, భగవంతుని ప్రార్థించుచు, చాలరాత్రియైనతరువాత అమ్మపఱుపు ప్రక్కను పరుండఁబడి పోయినది. తెలతెల్లవాఱుచుండ, "సతీ, సతీ, లెమ్ము," అని జాహ్నవి కేకవేసినది. సతి ఉలికిపడి లేచి కూర్చుండి, కన్నులు నులుముకొనుచు, "ఏమియమ్మా, ఏమైనది?" అని కలతఁజెందుచు నడిగినది.

"ఏమియు లేదమ్మా, పాడుకల యొకటి వచ్చి మనస్సున భీతి పుట్టినది, ఒకమారు చేతితో గుండెపై రాయుము సతీ."

సతి తల్లిగుండెను చేతితో మెల్లగ రాయుచుండెను. సతి చప్పిదపుడలు, వాడిన ముఖము చూచి జాహ్నవి, "ఆపద సమయమున ధైర్యము విడువకు మమ్మా, భగవంతుఁడు మనల నెన్నఁటికిని ఈ యవస్థలోనే ఉంచఁడు, అతనినామము స్మరించు చుండుము, అతఁడు తప్పక మనలను దరిఁజేర్చును," అన్నది.

"ఇప్పు డేల చెప్పుచున్నా వమ్మా ఆ మాటలన్నీ?" అని సతి క్షీణకంఠముతో ననెను.

"గుండె బితుకుబితుకుమనుచున్న దమ్మా, ఎందుకో కాని,"

సావిత్రి లేచి తల్లికాళ్లకడ కొంచెమునేపు కూర్చుండి, లేచి, ఇంటిపని చూచుకొనుటకు పోయినది.

కాళీపదుఁడు ఆటనుండి వచ్చి, "అక్కా, తినుట కేమైన ఇమ్ము," అని యడిగెను.

ఇంటనున్న తినుబడి సామగ్రి యంతయు కర్చైపోయి. నది. సతి వెనుకటిరాత్రి తన కాఁకలిలేదని భోజనము మాని, మిగిలియున్న చేరెడు బియ్యము తమ్మునికొఱకుంచినది. అవి వేపియుంచి తమ్ముఁ డడుగగానే వానికి కొంచె ముప్పురాసి గిన్నెలో వేసి యిచ్చినది. తమ్ముఁ డవి తినుచు ఆడుకొనుటకు బయటికి పోయెను. "అమ్మా, నీకు గొంతు ఎండుచుండుట లేదా?" అని సతి తల్లి నడిగినది.

"లేదు తల్లీ," అని జాహ్నవి యన్నది.

"ఆహా నిజముగా నీ గొంతార్చుకొని పోవుచున్నది. లెమ్మమ్మా, లేచి ముఖము కడుగుకొని స్నానముచేసి రమ్ము. నోటిలో నేమైనను వేసికొనవలెను."

జాహ్నవి సతివైపు చూచుచు మెల్లఁగా నన్నది—"అమ్మా, నే నెట్లైన బ్రతికియే యుందును. ఈ కఠినప్రాణము సులభముగ పోదు. కాని తమ్ముఁడును, విరాజును నాకండ్ల యెదుట తిండి తినక మాడకుఁడు—నేను తినకయున్నను బ్రతికియేయుందును."

సతి యా మాట చెవిని పడనీయలేదు. తల్లిని ముఖము కడిగించి స్నానముచేయించినది. పెత్తల్లి పాలు పిదికి గొణుగు కొనుచు గొణుగుకొనుచు ఏటికి స్నానమునకై బయలుదేఱి-నది. నేఁడు తలుపుతీసి బయటికి పోను అని సతి నిశ్చయించు కొన్నది. కాని తల్లి మూలమున అది మఱి సాగలేదు. ఇంట పాడి యున్నంతకాలము తల్లి ప్రాణమునకు హాని కలుగనీయ కూడదని సతి నిశ్చయించి, "చెల్లీ, నీవు నిప్పు రాజవెట్టు మమ్మా, నే నంతలో చెఱువులో మునిఁగి వచ్చెదను," అని సావిత్రితో నన్నది.

"నిప్పు రాజ వెట్టేమి ప్రయోజనము?" అని సావిత్రి మెల్లఁగా నన్నది.

"పాలు మఱిగించవచ్చును," అనుచు సతి బిందె యొకటి పట్టుకొని వెనుక తలుపుతీసి చెఱువునకు బయలుదేఱినది.

మడతలు పెట్టి త్రాడుతో ద్వారమునకు వ్రేలాడఁగట్టిన కాగిత మొకటి తలుపు తీయఁగానే సతి కంటపడినది. ఏమి యీ కాగితము? ఎవరో వ్రాసిన జాబువలె నున్న దే! సతి కుతూహలముకొలఁది దానిని విప్పి చూచినది. అది నిజముగా జాబే—తా నెఱిఁగిన దస్తూరికాదు, కాని ఆమెపేరే పైని వ్రాసియున్నది.

సతి మిగుల నాశ్చర్యమొందెను. కాని తల్లిమాట జ్ఞప్తికి తెచ్చుకొని, జాబును ఇటికల నడుమ గ్రుచ్చియుంచి స్నానమునకై పోయెను. ఇంటికివచ్చినతోడనే తడిబట్టయైన విప్పకుండ పాలు కాఁచి అందులో సగము అమ్మకిచ్చినది. తల్లి అడ్డు పెట్టుచుండినను, సతి కనుల వెంట నీరు కాఱుచుండుట చూచి, కొంచెము పాలు వేఱుగిన్నెలోనికి వంపి మిగిలినవి త్రాగినది.

సతి తడిబట్టతోనే మరల పెరటిద్వారముకడకు వెళ్లినది. ముందురోజు ఉపవాసముచేసియుండుటచే ఆమె దేహమున మంట పుట్టుచున్నది, కనుక తడిబట్టను విడువక బయటికివచ్చి ఇటికల సందులోనుంచిన జాబును తీసి మొదటిపజ్క్తి చూడఁగానే సతి తల గిరగిర తిరుగుట మొదలుపెట్టినది; ఎంతో ప్రయత్నముపైని మనస్సును స్తిమితపఱచుకొని జాబును చదివినది. నరేంద్రనాథబాదురీ స్వహస్తముతో వ్రాసిన ఉత్తర మది—కమల భర్త యతఁడు. బహు హేయమగు మాటలు ప్రయోగించి అతిహేయమగు ప్రస్తావమా జాబులో చేసియున్నాఁడు. వారిప్పుడు పడుచుండు బాధలకై సాను-

భూతిని తెలియఁజేయుచు, సతి అతఁడు సూచించు మార్గము నవలంబించినయెడల వారి దుఃఖములన్నియు దూరమగునని జమీందారా జాబులో వ్రాసియున్నాఁడు. దుఃఖము, కోపము, అసహ్యము ఆమె హృదయమును కెలకుట మొదలుపెట్టినవి. ఆ జాబును ముక్కలుముక్కలుగ చేసి సతి మరల స్నానమునకై చెఱువునకు పోయినది. జాబుచదువుటవలన తాకకూడని దేదో తాకినట్లా మెకు తోఁచినది—పలుమాఱు నీటిలో మునిఁగి, చాల సేపటివఱకు నీటిలోనే యుండి తుద కామె యింటికి వచ్చినది.

"అక్కా, మరల స్నానము చేసితివేల? దేని-మీఁదనైన కాలు పడినదా?" అని ఇంటికిరాఁగానే సావిత్రి యడిగినది.

సతి "ఔ," నని మఱి కొన్ని నిమిషములైన తరువాత, "నేఁడు నాఒళ్లు బాగులేదు. కొంచెము పండుకొనెదను," అని యనెను.

"తమ్మున కేమి ఇమ్మన్నా వక్కా?" అని సావిత్రి శుష్క-కంఠముతో నడిగెను.

"పా లిమ్ము. నీవు కొంచెము త్రాగి వానికి కొంచె మిమ్ము." సతి బట్ట పిడిచి ఆరవేసి గదిలోనికిపోయి తలుపు మూసికొనినది. నిజముగా నామె శరీరమున బహుబాధగా నుండెను; అలసి-యుండుటచే పరుండినతోడనే నిద్రవచ్చినది; నిద్రపట్టుటవలన బాధను కొంచెము సేపు మఱచినది.

అన్నమీయక పాలిచ్చినందుకు కాళీపదుఁడు కోపగించి

పాలు పాఱఁబోసి యేడ్చుచున్నాఁడు. సతికి తెలివివచ్చినది. తమ్ముని, మఱపింపలేక సావిత్రికూడ ఏడ్పు ప్రారంభించినది. సతి ఆ యేడ్పులు వినలేక వ్రేళ్లతో చెవులుమూసికొని కఱ్ఱబొమ్మవలె నచ్చటనే పడియుండెను.

మఱి రెండు నిమిషములు కాఁగానే, "అక్కా, అక్కా లెమ్ము," అనుచు సావిత్రి తలుపుపై గ్రుద్దినది. సతి పలుకలేదు. సావిత్రి మరల కేకవేసినది—"లెమ్మక్కా, విశుదాదాగారి పిన్ని ఏ మేమో అన్నియు పంపినది, ఒక మాఱు వచ్చి చూడుము,"

సతి మెల్లఁగా లేచి తలుపుతీసి చూచినది. కావడి పట్టుకొని వంటబ్రాహ్మణు డొకడు భుజముపై కావడి నుంచుకొని నిలిచియున్నాఁడు. కావడిలో ఒకప్రక్కను నీటితో నిండియున్న కళసి మఱియొకప్రక్కను పండ్లు, కూరకాయలు, మిఠాయి మొదలగునవి ఉన్నవి.

"ఇదియేమి? ఇవి అన్నియు ఏల తెచ్చితివి?" అని సతి క్షీణకంఠముతో నడిగినది.

"సంక్రాంతి నేఁడు, నేఁడు మా యమ్మగారి అన్నదానవ్రతము. బ్రాహ్మణగృహములన్నిటికిని పంపుచున్నారు."

కావడి దింపి అన్నియు నచ్చట నుంచి బ్రాహ్మణుఁడు వెళ్లిపోయెను. మిఠాయి, పండ్లు, ఇచ్చి సావిత్రి తమ్ముని శాంతపఱచినది, వంట వస్తువులు తీసి సతి వంట మొదలుపెట్టినది. సతి నేత్రములనుండి అగ్నివలె కాలుచుండు అశ్రుబిందువులు కారి-

నవి. సతి భగవంతుని స్మరించి కనుల నీరు పెట్టుకొన్నదో, లేక
మనుష్యు నెవనినైన తలచుకొని కంట నీరు పెట్టుకొన్నదో
చెప్పుట కష్టము.

మఱి రెండు మూఁడురోజులు గడచినతరువాత వెను-
కటి స్థలములో సతికి మఱియొక జాబు కనఁబడినది. దీనిలోకూడ
మొదటిదానిలోవలెనే అనేకవిధములగు ప్రలోభనము
పుట్టించు మాటలుండెను. సతి జాబును చించి పాఱవైచెను;
సావిత్రికి తెలిసినయెడల ఆమె భయపడునేమో యని తలఁచి
సతి చెల్లితో నేమియు చెప్పలేదు.

ఈ యేఁట వైశాఖమాసమున అన్నపూర్ణాదేవి అనేక
వ్రతములు చేయుచున్నట్లున్నది. ఏదో యొక వ్రతసందర్భ-
మున ఏడెనిమిదిరోజుల కొకమాఱు ఫలములు, కూరకా-
యలు, మిఠాయి మొదలగువానితో నిండియున్న కావడి
జాహ్నవి యింటికి వచ్చుచుండెను. దారిద్ర్యదశ కస్తూరివంటిది,
ఎవరును చాటింపకయే బయలు పడుచుండును. ఇది యెఱిఁగి
కూడ సతి ఊరకుండెను—దుర్దాంతమగు దారిద్ర్యపిశాచ-
ముతో పోరాడిపోరాడి యలసి పడియున్నది; యుద్ధము
చేయుటకు మఱి శక్తి లేదు. లేమివలన కలుగుబాధ కొంచెము
దూరమయి కొద్దిదినములు హాయిగా గడిచినవి. ఇన్నాళ్లకు
మనస్సు చులకనయి సతి నాలుగు విషయములనుగురించి
కొంచె మాలోచింపఁ గలుగుచుండెను. కాని భాగ్యదేవత
అనేక దినము లీరీతిగ నడిపింప దలచుకోలేదు. తారా

పూరునుండి హాఠాత్తుగ నొకనాఁడు అప్పులవారు తమకు బాకీయున్న మూఁడువందలరూపాయలును, వానికి వడ్డీమూఁడు వందలను వెంటనే చెల్లింపవలెనని నోటీసు పంపిరి. చెల్లింపని-పక్షమున తనఖాగానుంచిన వారియింటిని అమ్మించి సొమ్ము రాఁబట్టుకొనక మానరఁట.

ఆ నాఁడు జాహ్నవి పఱుపుపైనుండి లేవలేకపోయినది, కాని తాను భోజనము చేయనియెడల పిల్లలకుకూడ తిండి-యుండదని ఎఱిఁగి, లేచి పిడుచఁడన్నము తిని మరల ప్రక్కపై పరుండఁబడినది. జాహ్నవిదేహము మనోవ్యథవలన అసలే బలహీనమై యున్నది, ఇప్పుడు జ్వరముకూడ వచ్చినది. సావిత్రి కళలేని ముఖముతో తల్లి పఱుపుప్రక్కను కూర్చుండియుండెను. సతి సగము కూలియున్న మూలగదిలోనికి పోయి తలుపు మూసికొనినది——లోన నిద్రించుచుండెనా?

నేఁడు తాము పడుచుండు బాధ లన్నిఁటికిని మూల కారణ మెవరని సతి తనలోతాను యోచించుచుండెను. వారి యప్పు భోజనాదులనిమిత్తమై చేసిన యప్పు కాదు. నేఁడు వారి దురవస్థ లేమివలన కాదు. తమపై నిప్పుడు పడ సిద్ధముగ నున్న విపత్తునకు మూలము, కేవలము సతి సుఖమునకై జరిగిన ప్రయత్నమొక్కటియే. ఆహా! ఎంత దుఃఖము, ఎంత బాధ! ఇట్టి యాపదసమయమున ఎవరు తమకు తోడ్పడఁ గలరు? ఎవరు తమ కాశ్రయ మీయఁగలరు? "నాయనా, మేము దీనులము, నిరుపేదలము, మా కాఱువందల రూపా

యలు ఋణ మీయఁగలరా?" అని వారడుగఁగలవా రెవ
రును లేరా!—బహుశః ఉన్నారొకరు! కాని సిగ్గువిడిచి ఆయన
కడకు పోయి ఎవ రడుగఁగలరు?

ఇట్లనుకొనుచుండ, సతికి తా నూహించుచుండిన
యాతఁడు తనయంత తానే వచ్చి సాయము చేయవచ్చును
గాఁబోలు అని తోఁచినది. ఛీ ఛీ, ఎంత హేయమగు జీవ
నము నాది! బిచ్చపుదానివలె కేవల మితరుల దయాధర్మముల
నాధారము చేసికొని బ్రతికియుండవలసి వచ్చినది. వే ఉపాయ
మేదియు లేదా?

"అక్కా, గాలివాన వచ్చుచున్నది. బట్టలు తీసి లోపల
నుంచుము, నేను వానిని ముట్టుకొనకూడదు," అనుచు బయటి
నుండి సావిత్రి కేకలు వినఁబడినవి.

సతి తలుపు తెఱచినది. తన మనస్సుననుండు ఆందోళన
వలెనే మహావిప్లవ మొకటి సృష్టి నాక్రమించుచున్నది. బట్టలు
తీసి గదిలో నుంచిన తరువాత ఇంటిలో నీళ్లు లేవని హఠాత్తుగ
నామెకు జ్ఞప్తికి వచ్చినది. మరమ్మతు లేక కూలిపడుచున్న
నూతిలో నీళ్లు లేకుండెను. ఆ రాత్రి తుపాను చల్లారునట్లు
కానరాలేదు. అక్క చేతిలో కుండచూడగానే, "ఇంట నీళ్లు లేవు
కాఁబో లక్కా! నేను పోయి తెచ్చెదను, కడవను నా కిమ్ము,"
అని యన్నది.

"నీ వమ్మదగ్గఱ కూర్చుండి యుండుము, నే నొక్క
కఱుగునపోయి నీళ్లు తెచ్చెదను," అని చెప్పుచు సతి వెళ్లినది.

సతి నీటిలోనికి దిగి కడవ ముంచి ఎత్తుకొనఁబోయి హఠాత్తుగ గట్టుపై నెవరో కనఁబడుటవలన భయముచే వణఁకుట మొదలుపెట్టినది...ఎవరది? సతి జాగ్రత్తగ చూచి పోల్చుకొన్నది—గట్టుపై నిలిచియున్నవాఁడు నరేంద్రుఁడు.

భయముచే సతి కేకలువేయఁబోయినది గాని యామె గొంతు పెగుల లేదు, నీటిలోనే వణఁకుచు నిలిచియుండెను.

నరేంద్రుఁడు, నవ్వుచు, "భయ మేల సుందరీ? నేను పులిని కాను, ఎలుఁగుబంటిని కాను," అన్నాఁడు. "నేను రెండు త్తరములు నీపేర వ్రాసితిని. ఒకదాని కైనను జవా బిచ్చితివి కావే!"

సతి ధైర్యము తెచ్చుకొని క్షీణకంఠముతో పలికినది—"మంచిని కోరువారగుచో పొండు, తక్షణమే పొండు; మీరు పోనియెడల నేను కేకలు వేసెదను."

"నీవు బుద్ధిశాలివి అని విన్నాను, కాని నీకు బుద్ధి ఉన్నట్లు కానరాదే! ఒడిలోపడ సిద్ధముగానున్న సిరిని కాలితో తన్నుచున్నావు! ఇట్టి దశలో నున్ననీవు రాణివయ్యెదవు, మీయిల్లు, జప్తు కాఁబోవుచున్నదని విన్నాను, మీకు నిలువనీడ ఉండదు! నేను చెప్పినదానికి ఒప్పుకొనినచో మీ తల్లికి మీ తమ్మునకు మీ చెల్లెలికి ఇక కష్టములుండవు."

సతి నీటిలోనే నిలిచి వణఁకుచున్నది. యముఁడే నరేంద్రునివేషముతో వచ్చి ఎదుట నిలిచి యున్నట్లు సతికి తోఁచుచున్నది. అపాపిష్టుఁడు మరల ప్రారంభించెను—"ఏ

ను నెదవు? తల్లియు చెల్లెలును ఇంటింటికిం బోయి బిచ్చ మెత్తు కొనుచు తిండిక లేక ఒక్కొక్కరు ప్రాణములువదులుట మేలా? నేను చెప్పినదానికి సమ్మతించుట మేలా?"

సతి కడఁను వదలి రెండు చేతులతో కన్నులు మూసి-కొనినది. తన యౌషధము పనిచేసిన దనుకొని నరేంద్రుఁ డుత్సాహముతో ని ట్లనసాగెను—"హరి మూలమున మీ-సమాచారమంతయు నేను తెలిసికొనుచున్నాను. నీవు నాకంట పడిననాఁటినుండి నీ నామము నేను జపింపని రోజు లేదు. మంచి యవస్థలో నున్నయెడల ఎవ్వరిని లక్ష్య పెట్టవలసినవారు కారు మీరు. కనుక నింతకాలమును నాకు ధైర్యము లేకపోయినది. నీవు నాదానివగుచో నీ కేఁక నెట్టికష్టములు నుండవు— నీ వేది కోరిన నది క్షణములపై దొరకును. నీ విప్పుడు బహు కష్టములలో నున్నావు, నీ కెంతసొమ్ము కావలెనో చెప్పుము, ఇప్పుడే ఇచ్చెదను."

"పో, నీవు పో, నీవు పోనిచో ఈక్షణమే నీటిలో మునిఁగి ప్రాణములు వదలెదను," అని సతి ఆర్తకంఠముతో పలికెను.

"సరే, అట్లైన నేనిప్పుడు పోయెదను—కాని రే వేళకు వచ్చెదను; వద్దనకుము. వర్షము వచ్చుచున్నది, నీ విఁక నింటికి పొమ్ము."

"నీవు మొదట పొమ్ము. తరువాత నేను నై వచ్చె దను," అని సతి అన్నది.

"ఏమి, నేను సర్పమునా, దగ్గఱకు వచ్చిన కఱిచెద నను-కొనుచున్నావు?—సరే, నేఁటికి సెలవు."

ఆ పాపి నవ్వుచు వెళ్లిపోయెను, సతి వణఁకుచు నీటిలో చతికిలఁ బడిపోయినది. మానవునిలో నుండఁగల కలుష వాంఛ-లన్నియు మూర్తీభవించి నలుదిక్కుల పాశము పన్నుటకు వచ్చిన ట్లామెకు తోఁచినది. ఆ పాశమును ఛేదించగల శక్తి, పాపము, సతిలో నే మున్నది? అంధకారరూపమును ధరించిన పిశాచదళ మామెదగ్గఱకు వచ్చి ఆచీఁకటిలో తాండవమాడు చుండెను. ఊపిరితీయుట కైనను సాహసములేక సతి ఆ నీటి-లోనే చతికిలపడినది.

సతి దక్షిణమువైపు తలయెత్తి చూచినది. గట్టుపై నెవరో పలుగెత్తుచు హఠాత్తుగ నిలిచి, నిశ్చేష్టుఁడై ఆమెవంక తేఱచూచి, వడివడిగా నడచిపోయెను. అతఁడు విశ్వేశ్వరుఁ-డని సతి పోల్చుకొన్నది. నరేంద్రుఁడు గట్టు దిగుచుండఁగా విశ్వేశ్వరుఁడు చూచి యుండవలెను.

నీటిలో కూర్చుండియుండ తనపై నరేంద్రుఁ డుఱుకు-నేమో యని సతి భయపడినది. కాని ఇప్పుడు ధైర్యము తెచ్చుకొని లేచి యింటికి వచ్చినది. దృఢసంకల్పమొకటి ఆమె మనస్సున ప్రవేశించినది. సతిని చూచి సావిత్రి ఆతురతతో, "అక్కా, ఇంత యాలస్యమేమి? ఆలస్యమైనదని నేనుకూడ చెఱువునొద్దకు రావలె ననుకొనుచుంటిని—బట్ట యంతయు

తడిసిపోయిన దేమి అక్కా? నీటిలో పడిపోతివా?" అని యడిగినది.

"ఔను, పడిపోతిని."

తల్లి చెవిని యీమాట పడగానే గుండె బ్రద్దలగునట్లామె నిట్టూర్పు విడిచినది.

మఱునాఁటి యుదయము జాహ్నవి సావిత్రితో, "రాత్రి గాలికి మామిడికాయలు చాల పడిపోయినవి. కొన్ని-మామిడికాయలును, మల్లెపూలును తీసికొనిపోయి విశ్వేశ్వ-రుని పిన్నికిచ్చి రమ్మమ్మా," అని యనెను.

మామిడికాయ లిచ్చి వచ్చి తల్లితో సావిత్రి ఇట్లన్నది. "అమ్మా పిన్ని అక్షయ తృతీయకు గంగాస్నానమునకై "నవ-ద్వీప్"కు పోవుచున్నదఁట, 'మీ అమ్మ కులాసాగా నున్నయెడల అమ్మ, అక్కయ్య నాతో రాఁగలరా' అని అడిగినది. ఇంటికి వెళ్లినప్పు డెల్ల ఆమె నన్నెంతో ఆదరించుచుండు నమ్మా. నాకు మిక్కిలి సిగ్గుగానుండును—"జాహ్నవి యామాటలు విని ఊరకుండెను. సతిండ్లు కొంచెము చిట్లించుకొనెను.



## పంద్రెండవ పరిచ్ఛేదము

### పతి విశ్వేశ్వరునకు జాబువ్రాయుట

విశ్వేశ్వరుఁడు ధనము కూడఁబెట్టుటకై పలువిధములగు ప్రయత్నములు చేయుచుండెను—విశేషముగ డబ్బు పోగు-కానిదే పశ్చిమమునకు పోయి అచ్చట యథోచితముగ పని ప్రారంభించుటకు సాధ్యముకాదు. స్వగ్రామమునుండు దారిద్ర్యమునుగూర్చి విశ్వేశ్వరునకు దుఃఖము లేకపోలేదు, కాని పల్లెటూళ్లలో అందరు నేదో విధముగ జీవితములు గడపుకొనుచుందురని అతని ఊహ. ఇంతేకాక, కోరనిదే ఎవరికైనను సహాయము చేయఁబోయినయెడల చివరకు తానెంత సిగ్గు పడవలసివచ్చునో సతి మూలమున తెలిసికొనెను.

పిన్నిని నవద్వీపమునకు తీసికొనిపోయి గంగాస్నానము, దేవునిదర్శనము చేయించి విశ్వేశ్వరుఁడు నాలుగైదు దిన-ములలో నింటికి తిరిగి వచ్చెను. ఇల్లు చేరునప్పటికి సాయంకాల మైనది. పిన్ని వంట మొదలుపెట్టినది. విశ్వేశ్వరుఁడు తాను పెట్టిన ధాన్యపు డిపోను, కట్టించిన మగ్గముల సాలను చూచు-టకు పోయెను. పని సరిగా జరుగుచున్నది. ఇంటికి వచ్చి విశ్వే-శ్వరుఁడు భోజనమునకై కూర్చుండెను. అన్నపూర్ణ విచార-ముగ కూర్చుండియుండుట చూచి పిన్ని మనస్సులో నేదో

దుఃఖమున్నదని పోల్చుకొని విశ్వేశ్వరుఁడు, "అట్లున్నావేమి పిన్నీ?" అని యడిగెను.

"ఏమియు లేదే!" అనుచు పిన్ని నిట్టూర్పు విడిచినది. ఇట్టినిట్టూర్పులు క్రొత్తవి కావు కనుక విశ్వేశ్వరుఁడు భోజనము చేయసాగెను. కొంచెె మూరకుండి పిన్ని, "ఆహా చూచుటకు దుఃఖ మగుచున్నది," అని తనలో తా ననుకొన్నది.

"ఎవరిని చూచిన దుఃఖమగు చున్నది పిన్నీ?"

"భట్టాచార్యుల కొమార్తెను చూచిన—ఆమె నన్ను చూచుటకు వచ్చి ఇప్పుడే వెళ్లినది."

"సతియా? నిన్ను చూచుటకు వచ్చినదా? ఏల వచ్చి-నది?" ఇట్లని కండ్లు చిట్లించుచు విశ్వేశ్వరుఁడు పిన్ని వైపు-చూచెను. "వచ్చిన తప్పేమి? నవద్వీప్‌నుండి వచ్చితివని విని తల్లి చూచి రమ్మని పంపియుండవచ్చును," అని పిన్ని యన్నది.

విశ్వేశ్వరుఁ డేమియు ననలేదు. పరధ్యానముగ భోజ-నము ముగించి పడకగదిలోనికి పోయెను. దేనిని గురించియో ఆలోచించుచు విశ్వేశ్వరుఁ డిటునటు పచారు చేయుచుండెను.

"లాంతరులో చమురు లేదు కాఁబోలు నాయనా. తీసి కొనిరమ్ము చమురు వేసెదను," అని పిన్ని బయటనుండి కేక వేసినది.

"ఇప్పుడే నిద్ర పోఁబోవుచున్నాను పిన్నీ, దీప మవసరము లేదు," అని యనుచు విశ్వేశ్వరుఁడు పరుండెను. విశ్వేశ్వరుఁడు తనలో తా నేదో ఆలోచించుచు నిద్రింప ప్రయత్నించుచు

ప్రక్కకు తిరిగి ప్రక్కనుండు పెద్ద బాలీసుపై కాలువేసి పరుండెను.

ఉదయమే లేచి ముఖము కడుగుకొని తానప్పుడు చేయవలసిన పని యేమని విశ్వేశ్వరుఁ డాలోచించుచుండెను. ఎన్ని దినముల బట్టియో చూడని పుస్తకరాశిపై అతని కనులు పడెను. మంచముపై కూర్చుండి పరధ్యానముగ తలవైపు చేయి చాచి గోడబీరువాలో మొదటివరుస పుస్తకములపై నుండు గ్రంథమును తీసెను. అది ఇంగ్లీసు వేదాంతగ్రంథము దానిని చూచి విశ్వేశ్వరుఁ డాశ్చర్యపడెను, అది దాని సరియైన స్థలమున నుండక, సంస్కృత గ్రంథములపై నున్నది. తా నది ఉంచి యుండఁడు. పిన్నికూడ ఆగదిలోనికి రాదు. పుస్తకములపై నుండు కాగితపు అట్ట పైకి ఉబ్బియుండుటవలన లోపున నేదో యున్నదని అతనికి తోఁచినది. విశ్వేశ్వరుఁ డట్ట విప్పిచూచెను. లోపున నొక ఉత్తరము కనఁబడినది—పైని ఆడువారి దస్తూరితో విశ్వేశ్వరుని విలాసమున్నది.

ఏమీ యాశ్చర్యము! అది వ్రాసినవా రెవరు? అతఁడు కవరు చించి చూచెను. ఆఖరు పుట త్రిప్పిచూచి, మిగుల నాశ్చర్యముఁజెంది జాబు మొదటినుండి చదువ నారంభించెను. కొంత చదువఁగా నతనిమనస్సు కలతజెంద మొదలుపెట్టినది. మనస్సును స్థిమితపఱచుకొని మరల మొదటినుండి చదువసాగెను.

"...ఉత్తరము విప్పఁగానే ఇది వ్రాసిన దెవరని మీ

రాశ్చర్యపడుదురు. బహుశః పేరు తెలిసికొనుటకు ప్రయత్నించెదరేమో. కనుక ప్రారంభములోనే ఉత్తరము వ్రాయుచున్నది సతి యని తెలియఁజేయుచున్నాను.

"మీ కనేక విషయములనుగుఱించి వ్రాయవలెనని కూర్చుంటిని. కాని ఏమి వ్రాయవలెనో ఇప్పటికిని నిశ్చయించుకొన లేదు. వ్రాయవలసినవి అనేక సంగతు లున్నవి నిజమే, కాని ఎక్కడ ప్రారంభింపవలెనో తెలియకున్నది. ఒకటి వ్రాయఁబోయి మఱియొకటి వ్రాయుదు నేమో యని భయ మగుచున్నది—కాని నా కిఁక లజ్జయేల? చేతికి వచ్చినట్లు వ్రాసి కొని పోయెదను, ఏది మొదట నేది చివర అను నాలోచనతో నాకు పనిలేదు.

"నేను నేఁడు చేయఁబోవు పనిని మసివ్రాసి మారడి కాయగా చేయు నవసరము నాకు లేదు, నేను నిర్దోషినని సప్రమాణముగ నే నెవ్వరికిని తెలియఁజేయఁ గోరలేదు, నే నీ సమాచారము మీతో చెప్పక వీలు లేదన్నంత సంబంధము మీకు నా సుఖదుఃఖములతో లేదు. ఐనను మీ కిదియంతయు తెలియఁజేయకుండగ నే నేల సెలవుతీసికొనలేకున్నానో నాకే తెలియకున్నది.

"ఐదురోజుల క్రిందట గాలివాననాఁటి సాయంకాలము మా యింటి వెనుకనుండు చెఱువునొద్ద జరిగినది మీకు జ్ఞప్తి యున్నదా? వెళ్లిపోవుచుండఁగా మీకు కనఁబడినవాఁడు చాంద్ పూర్ జమీందారు, నరేంద్రబాదురీ. నీటిలోనూర్చుండి

యున్నది నేను. మీ రది పోల్చుకొని యుండవలెను, తప్పదు. కాని నే నక్కడేల యుంటినో మీరు యోచించ లేదేమో! లేక అట్టి దృశ్యములు కంటఁబడినప్పు డందఱు నెట్లూహింతురో మీరుకూడ నట్లే ఊహించితిరా? మంచియింటి యాఁడుబిడ్డ లట్టిపని చేయఁగలరా యని యోచించి చూచితిరా?

నేను నిరపరాధినని మీకు నమ్మకము పుట్టించుటకు నే నీ జాబు వ్రాయుట లేదు. నే నపరాధిని, ఆ పాపాత్ముని మాటల వలన పతితనైతిని. ఆ ప్రలోభనమునుండి నన్ను మరలించుకొనుట నాకిప్పు డసాధ్యము. కాని నే నతనిని మోసపుచ్చితిని. అతఁడు కోరినదాని కనేక రెట్లిచ్చెదనని నే నొప్పుకొంటిని—అతఁడు నా దేహమును కోరెను, నేను నా యాత్మను సహితము దానము చేసితిని. అతఁడు నాజీవనమును ఒక్క జన్మమున మాత్రమే అపవిత్రము చేసి యుండును, నాశనము చేసి యుండును; కాని నేను నా యిహపరములను, నా సర్వమును నరకద్వారపాలకుల పాదములకడ సమర్పణము చేసితిని—అట్టి సందర్భమున నేను మోసపుచ్చితినని యనుట సరియైన మాట కాదేమో! స్పష్టముగ చెప్పెదను గమనింపుము. అతఁడు నా కనేకముగ రూపాయ లీయఁగోరెను. అతఁడు మీకు కనఁబడిన నాఁడు కాక మఱియొకనాఁడు, అనఁగా అటు మొన్నను, మధ్యాహ్న మప్పుడు మరల వచ్చెను. ఆనాఁటి యుదయమే అప్పులవారు మాయింటి యెదుట చాటింపించిరి—మూఁడు రోజులలో మే మిల్లు ఖాళీ చేయవలెను. అతఁడు వచ్చి వేయి

రూపాయలనోటు నాపాదములయొద్ద నుంచెను. నే నా రూపా యలు తీసికొంటిని. ఈ రాత్రి యతఁడు వచ్చి చెఱువుగట్టుపై నిలిచియుండును, నే నతనితో లేచి పోయెదనని మాట యిచ్చి-తిని. నేను పోవుచున్నాను—నిజముగా నేను నేఁడు పోవు-చున్నాను, కాని అతని యొద్దకు కాదు, మఱియొకని యొద్దకు.

నే నెవరియొద్దకు పోవుచున్నానో అతఁడు ఈప్రపంచ-మున నుండు వారికంటె సదయుఁడో నిర్దయుఁడో నే నెఱుఁగను, అతఁడు నా కెట్టిశాస్తి నిచ్చునో నేను చెప్పలేను, అతఁ డేమి చేసినను చేయనిండు, అతఁడు నాపై నెట్టిశిక్ష విధించినను నే నది అందుకొనుటకు సంసిద్ధురాలను, కాని ఈ ప్రపంచమున-నున్న ఏ మానవుఁడు విధించినను నే నంగీకరింపను. ఆ పాపా త్ముఁడు నరేంద్రుఁడు, నాలో నిట్టి యాశను పుట్టించి, నన్నీవిధ ముగ నరకద్వారమునకు లాగుకొనివచ్చి, నేను బహుకష్ట ములలోఁబడి అపరిమితదుఃఖము పొందుచు మతితప్పియున్న ప్పుడు నా కిట్టి దారి చూపించనియెడల నే నిప్పుడు ప్రాణ త్యాగము చేయుటకు సాహసించి యుందునా? ఎంత మాత్ర మును సాహసించి యుండను.

నా తల్లి, నా చెల్లెలు, నా తమ్ముఁడు, రేపు నిలువ నీడ లేక వీధులఁబడి తిరుగుచు ముష్టి యెత్తుకొను చుండవలసి వచ్చు నేమో! తిండికి లేక కడుపు మాడి చావవలసి యుండు నేమో! అట్టిసందర్భమున కేవలము నాసుఖము నే కోరుచు నిట్టి యుపా యము నేఁ డెట్లు పరిత్యజింపఁగలను? నా యాత్మ శాశ్వత-

కాలము బాధఁ జెందుచుండు నేమో యని ఆత్మహత్యకు జడి. యుదాననా నేను? బాధను నేను శాశ్వత మిత్రముగ భావించు చున్నాను. రాఁబోవునవి ఇప్పటి కష్టములకు మించునవా? మించినను మించునుగాక, దానివలన నేను భీతిఁజెందను. లోకులు నన్ను నిందింతురా? నిందించిన నిందింతురుగాక! నా తల్లి, నా చెల్లెలు, నాతమ్ముఁడు రేపు బాధనుండి విముక్తులౌదురు, కొంత కాలముసుఖముగా జీవింతురు. అంతలో భగవంతుఁడు వారిపై ప్రసన్నుఁడు కావచ్చును. భగవంతుని ప్రసన్నత ననుభవించు యోగ్యత నాకులేదు, అది నే నెఱుఁగుదును. కనుక, ఇంత కాలమునకు కొంచెము శాంతినొంది నిశ్చింతగా సెలవు తీసి కొనుచున్నాను. ఆ రూపాయ లొకచోట పడియుండఁగా నాకు దొరకినవని నేను సావిత్రితో చెప్పితిని—సరళస్వభావము సావిత్రిది, ఆమె నామాట నమ్మినది. ఆ రూపాయ లుంచు కొనుటవలన తప్పులేదని ఆమెచే నమ్మించితిని. మఱునాఁడు నెత్తిపై పడఁబోవు నాపద తొలఁగునను నాశవలన సావిత్రి ముఖమున ఆనంద ముదయించినది. అట్టి ప్రఫుల్లత నాకు ఆమె ముఖమున కనఁబడి ఎంతో కాల మైనది. ఆ రూపాయలు తన యక్క హృదయమున నుండురక్తమని, పాపము, సావిత్రి ఎఱుఁగదు. అక్కకుకల్గుచున్న దుఃఖ మామె కెన్నఁటికిని తెలియకుండునటుల నేను భగవంతుని ప్రార్థించుచున్నాను.

మా కష్టములను గుఱించి మీతో నే నేల చెప్పలేదని మీ రనెద రేమో? అది మీ రనఁదగిన మాటయే—మీరు

మిగుల దయగలవారు—ఈ యనాథులపై దయఁజూపుటకు పెక్కుమాఱులు మీరు వచ్చితిరి, పెక్కుమాఱులు దయఁ జూపితిరి, కాని ఇఁక మఱి వద్దు, ఇప్పటికే అధికమైనది. మీ ప్రసాదము బాణమై నాగుండెను పొడుచుచున్నది, ఋణ మింతకు మించనీయఁజాలను.

"మీతో చాల సంగతులు చెప్పెదనని వ్రాసితిని, చాల వ్రాసినాను, ఐనను మఱి రెండు మూఁడు మాటలున్నవి. అవి చెప్పనిదే నేను చెప్పగోరినది ముగియదు! ఒకమాఱు మీరు నాకు రూపాయ లిచ్చి దయచూప వచ్చితిరి, జ్ఞప్తి యున్నదా? నే నా రూపాయలు పుచ్చుకొనలేదు. నిజముగా మాకప్పుడు రూపాయ లవసరము లేకుండెననుకొనుచున్నారా? పుచ్చుకొనకుండుటకు కారణ మది కాదు. మీరు మాకెవరు, మీ రూపాయలు మేము పుచ్చుకొనుటకు? మీరు కోరి-యున్నచో నాకు సర్వమును ఒకప్పుడు ఈయఁగలిగియుందురు —ఆసంగతి మఱచితిరేమో! కాని నేఁడు బిచ్చపుదానిని చూచి దయగొని సహాయము చేయవచ్చితిరి. అట్టి మీ కరుణ నాకక్కఱలేదు. నేను గర్వముతో మీ కొకమాట చెప్పవలసి యున్నది—అదిచెప్పుట ఇదియే మొదటిమాఱు, ఇదియే కడపటిసారి. మీ భార్యనగుటకు నేను కేవల మయోగ్యురాలను కాను, ఐనను మీరు నన్ను భార్యగా నంగీకరింపకుంటిరి. మఱి యొకరి నెవరినైనను మీరు పెండ్లియాడినచో మీ హృదయ-మున ప్రేమకు కొఱతలేదని నేను నమ్మియుందును, కాని అట్లు

జరుగలేదు. మీరు స్త్రీజాతియెడ మిగుల నిరాకరణమని ఊహించితిని. కనుక నేఁడు నేను మృతినొందు సమయమున, ఆ యధమమగు స్త్రీజాతినే మీరెప్పుడో యొకనాఁడు ప్రేమింతురని శపించి పోవుచున్నాను. అట్టి యధమజాతికి చెందిన స్త్రీహృదయమున అగాధ మహాసముద్ర మొకటి దాఁగియున్నది—ఇది మీ రెప్పుడో పోల్చుకొనెదరు. స్త్రీకి ప్రేమనిచ్చి స్త్రీ యిచ్చుప్రేమను పొందుటకంటె శ్రేష్ఠమగు సుఖము ప్రపంచమున నుండదని ఆ నాఁడే మీరు పోల్చుకొనెదరు.

"ఇఁక నేను జాబు ముగించి సెలవు పుచ్చుకొనుచున్నాను, ఇదియే నా కడపటి సెలవు. నా వ్యవహారము చూచి మీరు విసుఁగుజెందుచున్నారేమో, నాది ఇంతదియంతగా చేయు స్వభావమనుకొనుచున్నారేమో? స్త్రీలు భరించుకష్టములు, దుఃఖములు భరించుటకు నేను వెనుదీయలేదు. అన్ని దుఃఖములను అమ్లానవదనముతో భరించితిని. కాని నా దుఃఖములకు దరిలేదు, అంతము లేదు. కనుక నాజీవన వ్రతము ముగింప నిశ్చయించితిని. చావు తప్ప నాకు వేఱు మార్గ మే మున్నది?...అట్టి హేయమగు ప్రస్తావమునకు మాటలతోనైన నంగీకరింపవలసి వచ్చుటకు కారణము నా దురదృష్టమే. చెవిని పడఁబోవుచుండు నంతమాత్రాన మంచియిండ్లస్త్రీలు చెవులు మూసికొనునట్టి మాటలు, నిలిచి పూర్తిగా వింటిని, చివర కిట్టి యుక్తి పన్నితిని; అంతయు చేయఁగలిగితిని, చేయలేనిది—మఱి నే నేమి చెప్పఁ-

గలను? ఆత్మహత్యఁ దలంపు మిక్కిలి భయంకరమైనది. కాని ఆ ప్రస్తావము నెదుట నదియైనను మహాసుఖదాయకముగు పని-యని తోఁచుచున్నది. అంద ఱును నన్ను నిందింతురు—నిందింప నిండు. కాని మీరు నన్ను నిందింపకుడు. మీపాదములకడ నాకు స్థానము దొరకియుండినయెడల నాకు నేఁడిట్టిదశ పట్టియుం-డదు. నా తల్లిని, చెల్లెలిని తమ్ముని విపత్తులనుండి తప్పించుటకు నేఁడు నేను నాప్రాణములను ధారపోయవలసిన యవసర ముండి యుండదు.

"వేఱొకరిచే పరిగ్రహింపఁబడినప్పటికిని, విధవనై యున్న-ప్పటికిని పరపురుషుని చింత మనస్సులోనికి రానిచ్చుచున్నానని నీవనుకొనకుము. నేను హిందువుల యింటఁ బుట్టినపిల్లను. ఎంత కష్టముగనున్నను రెండురోజులలో ప్రస్తుతావస్థలలో పూర్తిగా నన్ను నేను ముంచుకొని సర్వమును మఱువగలను. హిందూస్త్రీల కాశక్తి యున్నది. మీ సన్నిధానమువలన నా హృదయమున నొక యాశ ఉదయించినది, కాని అది త్వరలో మాయమైనది. కమలవలె (కమలమాట మీకు జ్ఞప్తియున్నదా?) నాకు కూడ సుఖసంపదలు ప్రాప్తించియుండినయెడల అంతయు మఱచి యుందునేమో. కాని నా కాయదృష్టము కలుగలేదు. దారిద్ర్య మనెడు పాషాణఫలకమును నీదయాస్వరూపము పరిస్ఫుటము గాఁగోరుచుండెను, నేను దానిని అంధకారమున దాఁచియుంచు చుంటిని. నీ సమ్ముఖమున నిజము చెప్పుచున్నాను నమ్ముము— ఆదయామూర్తిని బయటకి తీసి నేనైనను ఎన్నడును చూడ

లేదు; చూచుటకు సమయముకూడ నాకు చిక్కలేదు. నేడు సమయము చిక్కినది, కాని యిప్పుడు దాని ప్రయోజనము లేదు—నేడు నేను విశ్రాంతి నొందుచున్నాను. కనుకనే కాఁబోలు మీరు వచ్చి నా సముఖమున నిలిచియున్నారు.

"కోపముతో మీ కనేక కఠినమగుమాటలు వ్రాయవలెనని తలఁచితిని, కాని ఈ ఉత్తరము వ్రాయుచున్నకొలఁది అట్టి తలంపు దూరము కాసాగినది—ప్రపంచములో నెవరిపై గూడ నాకు హక్కున్నదని నమ్మి నేను కోప ముంచుకొనగోర లేదు, ఐనను మీపై నిట్టిభావ ముదయించి యుండుటకు కారణమేమో నాకు తెలియకున్నది.

"నిజము చెప్పుచున్నాను నమ్ముడు, నా మనస్సులో మీపై ఇప్పుడెట్టి కోపమును లేదు. మిమ్ములను సహాయము చేయుమని కోరకుండుట అన్యాయమని నా కిప్పుడు బోధపడినది. మీపై కోపగించుట నా కుచితమగు పనికాదు, కాని జరిగినదాని నిప్పుడు మార్చలేను కదా. మా అమ్మను చెల్లిని ఇఁక మీరు చూచుచుండవలెనని నాకోరిక—కాళీపదుని కూడ చూచుచుండుడు. వారి కెట్టి యాపదయు రాకుండ కాపాడుడు. చేతనైనయెడల అన్నను మంచిదారికి తీసికొనిరండు. నేను పోఁగానే వారి కష్టములన్నియు దూరమగునని నా కేలనోగాని తోఁచుచున్నది. నన్ను గుఱించి మీరు దుఃఖింపకుడు. నేను చావకతీరదు, ఆ

పాపాత్ముని రూపాయ లందుకొనిన తరువాత మృత్యువుతప్ప నాకు వేఱుదారి లేదు. మీకు సాధ్యమగుచో మంచివరుని చూచి సావిత్రికి వివాహము చేయుడు. నా ప్రణామ మందుకొనుఁడు, నాకిఁక సెలవీయండి."

ఇట్లు,

సతి.



## పదుమూఁడవ పరిచ్ఛేదము

### సతి

ఉత్తరము చదువుట పూర్తియైనది. విశ్వేశ్వరుఁడు రాతి బొమ్మవలె కూర్చుండియుండెను, చలనములేను, యోచనశక్తి లేదు. ఉత్తరము చదువుచున్నంతసేపు ఈఁతరాక అగాధజలమున మునిఁగి తేలుచున్న వానియవస్థలో నతఁడుండెను, ఇప్పుడు పూర్తిగా మునిఁగిపోయెను, లోతందని నీటిలో ప్రాణములు విడువఁబోవుచున్నాఁడు, చేతు లాడవు!

హఠాత్తుగ బయటినుండి అన్నపూర్ణకంఠము వినఁబడినది—ఆమె ఆర్తకంఠముతో, "విశూ! విశ్వేశ్వర్" అని పిలుచుచుండెను. విశ్వేశ్వరుఁడు బదులు పలుకలేకున్నాఁడు.

అన్నపూర్ణ గదిలో ప్రవేశించి, "గదిలో ఉన్నావా నాయనా? ఊరిలోని సంగతివిన్నావా?" అని యడిగెను.

"విన్నాను."

"అట్లైన కూర్చుండి యున్నావేమి? ఉపాయ మిప్పటికి లేకపోదు!"

"దేని కుపాయము?"

"అట్లైన నీవు విన్నది యేమి? రామశంకర భట్టాచార్యుని యిల్లు అప్పులవాండ్రు స్వాధీనపఱచుకొనెదరఁట, మూఁడు రోజులక్రింఁదట నోటీసు ఇచ్చినారఁట. నే నిక్కడ

లేకపోవుట యెంత దురదృష్టము! నిధితల్లి ఇప్పుడే చూచి వచ్చినది. అప్పులవారి మనుష్యులు, అమీనాను, ఇల్లు ముట్టడించి యున్నారంట. బయటికి లాగుకొనివచ్చి అందఱిని రోడ్డుపై విడిచిపెట్టెదరు. వెళ్లు మస్మా, త్వరగా వెళ్లు. నేనుకూడ ఇప్పుడే వచ్చెదను. నీవు ముందుగా వెళ్లి వారి నాఁపుచేయుము నాయనా."

పిన్ని సరిగా మాటలాడలేక పోయినది. కన్నీరు ధారలై కాఱుచుండెను. విశ్వేశ్వరునకుకూడ దుఃఖమువచ్చుచుండెను. ఇప్పుడైన నేదో చేయవచ్చునని విశ్వేశ్వరునకు తోఁచినది. సతి—సతిప్రాణము నిలుపుట కిప్పటికిని వేళ మించిపోలేదేమో యని తోఁచి, విశ్వేశ్వరుఁడు సతియింటికి పరుగెత్తెను.

భట్టాచార్యుని భగ్నద్వారము నెదుట ఇరుగు పొరుగులవారు గుంపుకూడి యున్నారు. అప్పులవారు కోర్టు వారితో కలసి లోనికి ప్రవేశింపఁ బోవుచున్నారు. లోపలినుండి ఏడ్పులు వినఁబడుచున్నవి—ఆ యసహాయాక్రందనములు విని ఇరుగుపొరుగులవారు మిగుల నామోదించుచు పలువిధముల స్వాభిప్రాయములను చాటుచున్నారు—"ఇంత అహంభావ మున్నవారికి ఈ దశపట్టక మఱి యేమౌను? మేమిరుగుపొరుగులవారము కదా మాతో చెప్పనక్కఱలేదా? సహాయముచేయుమని ధర్మముల నడుగ రాదా? నిరుపేదల కింత పౌరుషమేలనో!"

విశ్వేశ్వరుని చూచి ఆ గుంపులోనుండు నొకఁడు అత-నితో నిట్లనసాగెను—"చూచితివా నాయనా! మన మిప్పు డేమి చేయఁగలము?—కాని ఆపెద్దమనుష్యుఁడుమాత్రము తనకు రావలసిన రూపాయ లెట్లు వదలుకొనగలఁడు! ఈ ఏడ్పు, గందరగోళము లేకుండ నెమ్మదిగా బయటికివచ్చుట మేలు—కాదా?"

విశ్వేశ్వరుఁ డామాటలకు ప్రత్యుత్తర మీయలేదు. ఆ ఏడ్పు లతని మనస్సున వేఱొకవిధమగు భావములను కల్పించుచుండెను. విశ్వేశ్వరుఁడు తొందరతొందరగా లోనికి పోఁబోవుచుండుట చూచి అప్పిచ్చిన పెద్దమనుష్యుఁడు ఆదరముతో నతనికి దారి విడిచెను—అమీను మొదలగు-వారుకూడ ప్రక్కకు జరిగి అతనిని లోనికి పోనిచ్చిరి.

ఏ గదినుండి ఏడ్పు వచ్చుచుండెనో విశ్వేశ్వరుఁ డా-గదివైపు పఱుగెత్తెను. పెత్తల్లి ద్వారముదగ్గఱ కూర్చుండి పెద్ద కేకలు వేయుచు నేడ్చుచున్నది. సావిత్రియు కాళి పదుఁడును గదిలో నేల దొరలుచు నేడ్చుచున్నారు. జాహ్నవి ఎవరినో గట్టిగా పట్టుకొని ఇటునటు కొట్టుకొనుచు నేల పడి-యున్నది. విశ్వేశ్వరుఁ డామె ప్రక్కకు వచ్చి నిలిచి ఆర్త-కంఠముతో, "సతీ" అని పిలిచెను. అందరును కన్నులు విప్పి అతనివైపు చూచిరి. "విశూ బాబూ, అక్క—మా అక్క!" అనుచు కాళీపదుఁ డేడ్వసాగెను. "ఏమైనది కాళీ!" అని విశ్వే శ్వరుఁడు వికృతకంఠముతో నడిగెను.

"ఏమైనదో తెలియదు, అక్క మాటాడ లేదు," అన్నాఁడు శాస్త్రి; "అక్క చచ్చిపోయినది," అన్నది పెత్తల్లి.

విశ్వేశ్వరుఁడు ముడుకులపై వాలి తల్లిని ప్రక్కకు త్రోయుచుండ నామె నోట మాటపెగిలినది, ఆర్తస్వరముతో నామె, "ఎవరు నీవు! మతియొక్క క్షణము నాబంగారు తల్లి, నా ధనమును, కౌఁగిలించుకొననిమ్ము," అని యన్నది.

"అమ్మా, నేను 'విశు'ను, న న్నొక్కచూపు చూడనిమ్ము, బ్రతికించఁగలమేమో—" అని విశు అనుచుండ జాహ్నవి కనులు తెఱచి చూచినది, ఆమె దుఃఖము ద్విగుణమైనది, మిగుల నార్తకంఠముతో, "ఎవరు నీవు, నాయనా? విశ్వేశ్వరుఁడా? నా సతిని నీ పాదములయొద్దకు తీసికొనిపోవలెనని వచ్చితివి నాయనా? నా సతికి నేఁడు పెండ్లియా? చావ సిద్ధముగ నున్న ముసలివాని కిచ్చి ఆమెకు పెండ్లి చేయలేదా? మాసతి విషము తిని చావలేదా? నేను కలగనుచున్నానా నాయనా? రమ్ము తండ్రీ, రమ్ము," అని యన్నది.

విశ్వేశ్వరుఁ డతి కష్టముతో జాహ్నవిని ప్రక్కకు జరిపెను. చేతులపై ముఖమునుంచుకొని సతి బోరగిల పడియున్నది, చటాలున ఆమె నొత్తిగించుటకు విశ్వేశ్వరునకు ధైర్యము చాలలేదు. యోగ నిమగ్నులై యున్నవారి యోగమును భంగము చేయఁబోవుచున్నవానికి ఆ యపరాధమువలన తాను భస్మమగునేమో యని భయమగుచుండును—విశ్వేశ్వరునిలో నట్టి సంకోచము కనిపెట్టి సావిత్రి మెల్లగ లేచి వచ్చి,

రెండుచేతులతో సతిని ప్రక్కకు త్రిప్పుచు, గద్గదస్వరముతో, "చూడుఁడు, కాని చూడవలసినది మఱి యేమియు లేదు, ప్రాణముపోయి చాల సేపయినది," అని యనెను.

ఐనను సతి బ్రతికియున్న దేమో యని విశ్వేశ్వరున కాశ వదలలేదు, ఆమె ముక్కుదగ్గఱ చేయి నుంచి నాలుగైదు మాఱులు చూచెను. ఆమె కన్నుల చుట్టు నల్లని గుడ్డు లేర్పడి యున్నవి; అత డామె కనుఱెప్పలను విడదీసిచూచెను; నోటిలో వ్రేలు పెట్టి నాలుక నేమైన వేడియున్నదేమో యని చూచెను—కాని అంతయును అంతమైనది.

"దేహ మంతయు చల్లఁబడిపోయినది."

"వ్యర్థప్రయత్న మేల చేసెదవు నాయనా, విశ్వేశ్వరా, వేషము వేయునది కాదు నా సతి? ఇంతకాలమును బాధ నోర్చియున్నది, తనబాధ నెవరికిని ఒక్కమారైనను తెలియనీయ లేదు. ఇఁక భరించలేక నేఁడు వెళ్లిపోయినది—ఇఁక నన్ను కొంచెము విడువండి తండ్రీ! నాతల్లి తపించితపించి, చివరకు చల్లబడిపోయినది నాయనా. ఇంత నిశ్చింతగా ఒక్కనాఁడైనను నాసతి నిద్రించలేదు. మనస్తాపము చల్లారినది బాబూ, మన సార నన్ను కొంచెము చూడనీ," అని ఒక్కొక్కమాట యనుచు తల్లి వడ్చినది.

క్రమక్రమముగ నిల్లు మనుష్యులతో నిండినది.

"ఎంతఘోరము, ఎంతఘోరము!" "ఇట్లు జరిగిన దేమి?"

"ఎట్లు చనిపోయినది?" "ఏమి తిన్నది?" "విష మెక్కడ-దొరకినది?" "విషమేల తిన్నది?" "ఎవరైన నేమైన అన్నారా?" అనుచు ఒక్కొక్క రొక్కొక్క ప్రశ్న వేయసాగిరి. పెద్ద కోలా-హలము ప్రారంభమగుటచే పెత్తల్లి నోరు మూసినది. పరోప కార బుద్ధిగల ఊరిపెద్దలు నిజము తెలియఁగోరుచు వాదనలు చేయుచున్నారు. వెదుకగా వెదుకగా సతి తలదగ్గఱ తైలము సీసా యొకటియు, చిన్న చీటి యొకటియు దొరకినవి. ఆచీటిలో సతి ఈవిధముగ వ్రాసినది. "నే నాత్మహత్య చేసుకొను చున్నాను. నాతల్లిగాని, చెల్లెలుగాని, మఱే యేబంధువులు-గాని దీని విషయమై రవంతయైన నెఱుఁగరు—సతి."

అప్పులవారి మనుష్యుఁడొకడు లోనికి వచ్చి, "బాబూ, నేఁటికి మేము పోవుచున్నాము, ఇంట నేదో విపత్తుసంభవించి-నట్లున్నది—కాని రేపువచ్చిమాత్ర మీవిధముఁగ వృథాగా పోము," అని కేక వేసెను.

అన్నపూర్ణ విశ్వేశ్వరుని దగ్గఱకు పిలిచి చెంగునుండి నోట్లకట్ట యొకటి విప్పి కుమారుని చేతఁబెట్టి అతని చెవిలో, "వారిని పంపివేయుము నాయనా, మఱే రేపు రానక్కఱ లేదని చెప్పుము," అని యన్నది.

విశ్వేశ్వరుఁడు బయటికి వచ్చి అప్పిచ్చినవానితో కూర్చుండి బాకీ మొత్తముతేల్చి ఏడువందలకుపై గారూపా యలు వానిచేతిలోపెట్టి, తనఖాపత్రముపై చెల్లు వ్రాయించి, ఆ పత్రము పుచ్చుకొని మరల నింటిలోనికి వచ్చెను

విశ్వేశ్వరుఁ డింటిలో ప్రవేశించఁగానే పలువిధములగు ప్రశ్న లారంభించుచుండుట చూచి, "మనుష్యుఁడు పాపము, మిగుల మంచివాఁడు, కొన్నాళ్లీవలకు జప్తు ఆఁపుచేయించుట కొప్పుకొని వెళ్లి పోయెను," అని యనుచు నతఁ డందఱియుత్సాహమును చల్లార్చెను. ఆవిషయమున సందడికి మఱి తావు చిక్కక ప్రజలు రెండవ విషయమునుగూర్చి ప్రసంగము ప్రారంభించిరి. "ఇఁక దీని సమాచార మే మానో! పోలీసు వారికి తెలియఁజేయకుండుటకు వీలు లేదు కదా! ఇన్‌స్పెక్టరు గారికి కబురుపంపి చాలసేపైనది, అతఁడు వచ్చువేళయైనది, తారాపూర్‌నుండి పెద్ద డాక్టర్ కూడ వచ్చు సమయమైనది," అని ఎవరో అన్నారు. విశ్వేశ్వరుఁ డేమియు ననక కాళ్లు ముడుచుకొని అరుగుపై కూర్చుండెను.

డాక్టరు, ఇన్‌స్పెక్టరు—ఇద్దఱును కలసి వచ్చిరి. విశ్వేశ్వరుని చూచి ఆదరముతో ఇద్దఱును నమస్కారము చేసిరి, విశ్వేశ్వరుఁడు శుష్కవదనముతో వారి నమస్కారము లందుకొని వారితో కలసి ఇంటిలోనికి వెళ్లెను. డాక్టరు మృతదేహమును పరీక్ష చేయుచుండెను. ఇన్‌స్పెక్టరు తైలము సీసాయును, ఉత్తరమును, తీసి తనిఖీ చేయుచుండెను.

అన్నపూర్ణ విశ్వేశ్వరునియొద్దకు వచ్చి నెమ్మదిగా చాలసేపు మాటలాడినది. విశ్వేశ్వరుఁడు దేనికిని ప్రత్యుత్తర మీయ లేదు; మాటలాడుటకుఁ గాని తా మిప్పుడు చేయవలసి-

నది ఇది అదియని చెప్పుటకుఁగాని తగిన శక్తి వానిలో లేక పోయినది. డాక్టరు విశ్వేశ్వరుని పక్కకు పిలిచి ఇట్లనెను.

"ఆమె చనిపోయి చాలసేపైనది. బెలడోనా కలిసిన తైలమామె చావునకు కారణము—ఇది ఆత్మహత్య యని స్పష్టము."

"ఈ తైల మే డాక్టరుగారి ఆసుపత్రినుండి వచ్చినది? ఓహో, నాగ్ డాక్టరుగారి ఔషధాలయము నుండియా!—ఎట్లిచ్చుటకి వచ్చినదో!" అని ఇన్‌స్పెక్టరు అడిగెను.

ఏడ్చుచు పెత్తల్లి జబాబు చెప్పినది—"మా తోడి-కోడల నడుమునొప్పి నిమిత్తము తీసికొని వచ్చితిమి. నొప్పి త్వరగా బాగై పోవుటచేత సీసా అంతయు మిగిలిపోయినది."

విశ్వేశ్వరున కంతయు బోధపడినది. డాక్టరుగారి ముఖము, ఇన్‌స్పెక్టరుగారి ముఖము చూచుచు అతఁ డచ్చటనే నిలిచియుండెను. "ఇట్టి సందర్భములో శవమును ఆసుపత్రికి తీసికొనిపోవుట మనకర్తవ్యము. -మీా అభిప్రాయ మేమి విశ్వేశ్వరబాబూ?" అని డాక్ట రడిగెను.

విశ్వేశ్వరుని దేహమున వణకు పుట్టినది; "వే ఉపాయ మేదైన నున్నయెడల చెప్పుఁడు, నాకు సాధ్య మగునంతవఱకు నేను మిమ్ములను సంతోషపఱచెదను. ఇది మాయింట్లో జరిగిన దనియే మీారు భావింపవలెను—ఇట్టి యాపదలో మీారు నాకు సహాయము చేయరా?" అని మృదుస్వరముతో విశ్వేశ్వరుఁ డనెను.

"నాకెట్టి యభ్యంతరమును లేదు, సహజముగ వచ్చిన చావని నే నిప్పుడే వ్రాసి ఈయఁగలను, మీరు ఇన్‌స్పెక్టరు-గారిని కొంచెము లోఁబఱచుకొనుఁడు".

ఇన్‌స్పెక్టరును హస్తగతము చేసికొనుటకు చాల సేపు పట్టలేదు. ఆరోజులలో నచ్చట కలరా ప్రబలముగా నుండుటచే, కలరావలన సంభవించిన మృత్యువది యని వ్రాసి డాక్టరుగారును ఇన్‌స్పెక్టరుగారును సెలవుతీసికొనిపోయిరి. అంతయు నింతసులభముగా ముగియుట చూచి గ్రామస్థులకు మిక్కిలి అసంతుష్టి కలిగి అనేకవిధముల మాటలనుచు ఎవరి యింటికి వారు పోయిరి.

కొందఱు తమసాధుత్వమును తెలియఁజేయుచు నతి-దీనముగా విశ్వేశ్వరునితో మాటలాడుచు, అతనిని స్తోత్రము చేసిరి. తమ చేతిలో నిప్పుడేమియు లేదనుటకు అనేక ప్రమాణములు చూపసాగిరి. ఉండినయెడల వారింతనఱ కూరకుండవలసినవారా; ఇన్‌స్పెక్టరును డాక్టరును సంతోషపఱచి అప్పుడే పంపివేసియుందురు!—ఈ యింటిలో జరిగినదానిని గుఱించి ఎవ్వరికి తెలియకమునుపే అన్ని యేర్పాట్లును జరుపఁగలిగి యుందురు! అక్కడి వారిలో కొందఱు, "ఈకర్చు లన్నియు అతని పిన్నిచేతివి, ఈ అబ్బాయియు బహుఁగడుసువాఁడు. తానుచేయవలసిన దేమియు లేదు, పిన్ని మిగుల మంచియామె," అని యన్నారు. మఱికొందఱు తమలో తామేమేమో ఆలోచించుచు, తల లూచుకొని, ఇంకను

అక్కడనే యుండినయెడల సతి మృతదేహమును మోసికొని పోవలసి వచ్చునేమోయని జడిసి, కాఁబోలు, అక్కడనుండి మెల్లమెల్లగ జారిపోయిరి.

విశ్వేశ్వరుఁడు తన గుమాస్తాల నిద్దఱినియు, చాల-కాలమునుండి తనవలన సహాయముపొందుచు, తనమాటను మన్నించుస్నేహితు నొకనియు పిలిపించి—ఈముగ్గురిని అంగణములోనికి తీసికొనివచ్చి తాను గదిలో ప్రవేశించి పిన్ని ముఖము చూచుచు నొక ప్రక్కను నిలిచెను. అన్నపూర్ణ ఏడ్చుచు మెల్లగా జాహ్నవితో నిట్లనెను—"సతిని నాన్నగారి యొడిలో నుంచి రావలెను, లెమ్ము, వదినా! ఆమె కష్టములను మనము చల్లార్చలేకపోతిమి, ఆమెను నాన్నయొద్దకు పోనిమ్ము."

తల్లి గుండెబద్దలగునట్లు ఏడ్చుచు మాటమాటకు ఆగుచు ఇట్లన్నది—పెండ్లి కాని బిడ్డ నా సతి, నాన్నదగ్గఱకు పోవుచున్నది. ఆ సైనుపంచె విప్పించి చిన్నప్పుడు కట్టుకొనుచుండు దానినీలాంబరిచీర కట్టించుము వదినా...ఆ చీర కట్టుకొని తండ్రి చేయి పట్టుకొని చిన్నప్పుడు ఇటునటు ప్రతిదినము తిరుగుచుండెను...నల్లనిగాజులు తొడిగించుము వదినా...నా సతిని విధవ వేషముతో పోనీయను—తండ్రి కోపగించును......"

అట్టి సమయమున జాహ్నవికి బుద్ధిచెప్పుట నిష్ప్రయోజనమని యెంచి, అన్నపూర్ణ సావిత్రితో, "వచ్చి అమ్మను పట్టుకొనుమమ్మా," అన్నది. సావిత్రి తటాలున లేచివచ్చి సతి మృతదేహమును కౌఁగిలించుకొని, వెక్కివెక్కి యేడ్చుచు, "అట్లనకు

మత్తయ్యా. మాఅక్క ఎన్నఁడు ఎక్కడికి పోలేదు, ఇప్పు డెక్కడికి పోవునత్తయ్యా? నేఁడు మమ్ముల నందఱిని విడిచి ఎట్లు పోఁగలదు అత్తా!" అని యన్నది.

చాలసేపటివఱ కేమియుననక చివర కన్నపూర్ణ జాహ్నవితో నన్నది—"పోయినవారు పోఁగా, మిగిలియున్న వారిని చూచుకొన నక్కఱలేదా వదినా? లెమ్ము, వారు బ్రతికియుండు మార్గము చూడనక్కఱలేదా!"

జాహ్నవి లేచి కూర్చుండి, ముసుఁగు ముందుకు లాగుకొని సావిత్రిని ప్రక్కకు తొలఁగించినది; సతిని ఒడిలోనికి లాగుకొని ఆమె ముఖమును కొంచెము సేపు చూచి ముద్దుపెట్టుకొని ఏడ్వలేక ఏడ్వలేక ఇట్లన్నది—"ఇఁక పొమ్మమ్మా సతీ, నాయొద్దను నీకు కష్టమే తప్ప యేమియు లేదు. నాన్నగారియొద్దకు పోయి, చిన్ననాఁటి బిడ్డవై అతనియొడిలో పరుండుము. ఒక్కమాఱు "అమ్మా" అనవు తల్లీ? ......... నిన్న రాత్రి నా కాళ్లదగ్గఱపరుండి నా కాళ్లను తడుముచుంటివి......నా యొద్ద నెలవుపుచ్చుకొనుచుంటివి......నే నది యెఱుఁగకుంటిని! ......"అమ్మా" అని ఒక్క మా టనుమనియందును తల్లి! నేఁడు నిజముగా పోవుచున్నా వమ్మా? ఇదిగో బాబూ విశ్వేశ్వరా, సతిని అందుకొనుము."

జాహ్నవి నిజముగా సతిని విశ్వేశ్వరున కర్పించుచున్నట్లు ఆమె క్షీణదేహమును తనచేతులపై నెత్తఁబోయినది. అచ్చటనుఁడు ముగ్గురు బ్రాహ్మణు లాదేహము నందుకొని

బయటికి తీసికొనివచ్చిరి. విశ్వేశ్వరుఁడు ముఖము వాల్చుకొని వారి వెనుకవచ్చెను. సావిత్రి పిచ్చిదానివలె పరుగెత్తుకొని-వచ్చి విశ్వేశ్వరునికాళ్ళదగ్గఱపడి, ఏడ్చుచు, "విశూదాదా, నీ కాళ్లు పట్టుకొనుచున్నాను, అక్కను తీసికొని పోవద్దు, నా అక్కను నాకిచ్చి వేయుము—అక్కను నా కిమ్ము, ఇమ్ము, ఇమ్ము!" అని పిచ్చిదానివలె కేకలు వేసినది.

విశ్వేశ్వరుఁ డేడ్చుచు పిన్నిని పిలిచెను.

అన్నపూర్ణ బయటికి వచ్చి సావిత్రిని పట్టుకొని బల-వంతముగా లోనికి తీసికొని పోయి, తల్లియొడిలో నుంచెను.

సావిత్రి, "అమ్మా—అక్కా—అక్కా—అక్కా!" అనుచు నేడ్వ సాగినది.

కాళీపదుని తోడ్చుకొని శవముతో విశ్వేశ్వరుఁడు ఏటియొడ్డునకు పోయెను. దేహము మిగుల కృశించి యుండు-టచే సతిని ఇద్దఱు మోసికొని పోఁగలిగిరి. శవమునకు స్నానము చేయించి క్రొత్తబట్ట కట్టించి చితిపైనుంచి కాళీ-పదునిచే చేయవలసినది చేయించిరి. పిమ్మట కాళీపదుని దూరముగ తీసికొనిపోయి మంచిమాటలతో నోదార్చిరి. విశ్వేశ్వరుఁ డొక చెట్టున చేరఁబడి చూచుచుండెను. సతి వక్షపంజరమునుండి జ్వాలలు హుంకారము చేయుచు లేచుచున్నవి.

---

## పదునాల్గవపరిచ్ఛేదము

### విశ్వేశ్వరుఁడు

జాహ్నవిని అన్నపూర్ణ తనయింటికి వచ్చి కొన్నాళ్లుండుమని చాల బలవంత పఱచినది. జాహ్నవి వినలేదు. "ఆయన ఈయింటిలోనే చనిపోయినారు, నాసతి ఈయింటిలోనే పోయినది—సతి యొక్కతెయే ఇంటిలో పడి యుండి, 'అమ్మా అమ్మా,' అని ఏడ్చుచుండ దానిని విడిచి నేనురాలేను వదినా," అని జాహ్నవి యన్నది.

ఎన్నాళ్ల క్రిందటనో మఱచిన అక్కకొడుకుమాట జ్ఞప్తికి వచ్చి పెత్తల్లి అతనియింటికి వెళ్లినది, కనుక కొన్నాళ్ల-వఱకు అన్నపూర్ణ ఈయింటికి వచ్చి పండుకొనవలసి వచ్చినది. ప్రాణముల యెదుట మానాభిమానము లన్నియు నెగిరిపోవును కదా—ఈ యింట పండుకొనినయెడల రాత్రి సతి వచ్చి పీక పిసుకునని పెత్తల్లికి భయమఁట. సతి దయ్యమయి ఈయింటికి రాదని బ్రహ్మ వచ్చి చెప్పినను పెత్తల్లికి నమ్మకము పుట్టదు. చిర స్నేహితురాలగు తొంత ఈ యింటికి వచ్చి ఇక్కడనేయుండి వారికి అన్ని పనులలో తోడ్పడుచుండెను.

విశ్వేశ్వరుఁడు పిచ్చివానివలె దినములు గడపుచుండెను. ఎన్నడు నూహింపని విపత్తు హఠాత్తుగ వచ్చి మీఁద పడున ప్పుడు మన స్సేరీతిగ కలఁతఁజెందునో, విశ్వేశ్వరుని హృదయ

మీా దుర్ఘటనవలన నారీతిగ కలఁతఁజెందినది. సతి హృదయరక్త ముతో నిండియున్న ఆనోట్లను సావిత్రియొద్ద పుచ్చుకొని ఆ పాపాత్మునకు మరల నిచ్చివేయవలెనని విశ్వేశ్వరునకు కోరిక పుట్టినది. ఆహేయమగు వస్తువు సావిత్రికడ చాలరోజు లుండ కూడదు. ఆరూపాయ లెట్టివో సావిత్రి యెఱుగదు.

విశ్వేశ్వరుఁ డొకనాఁడు నదీతీరమునకుఁ బోయినప్పుడు, దూరముననుండు శ్మశానమతని కంటపడెను. చితిలో కాలుచు సతి యింకను నిట్టూర్పు విడుచుచున్నట్లు అతనికి తోచినది.

అతఁడు భయముఁజెంది గ్రామములోనికి తిరిగి వచ్చి చాలసేపటివఱకు గ్రామ పథముల నిటునటు సంచారము చేసెను.

జమీాందారుల యుద్యానవనమున గొప్ప సభ కూడి యున్నది. జమీాందారులు దశమినాఁటి వెన్నెలలో పుష్ప-సౌరభముతో నిండియున్న వాయువు నారగించుచు, తెల్లరాళ్ల మండపముపై, తబలా, హార్మోనియము, ఫిడేలు మొదలగు వానితో గానసభ జరుపుచున్నారు. విశ్వేశ్వరునిదృష్టి అటు పోయినది. అది చూడఁగాచూడఁగా పృథ్వి ఇంతసౌందర్య మయమై యుండినను దానిపై నుండు మానవులలో కొందఱి కంత దుఃఖమేలనో, బోధపడలేదు. కొందఱు సుఖ సముద్రమున ఈఁతలుకొట్టుచుండ కొందఱాహారములేక ప్రాణ-ములు విడుచుచుండుటయేలనో? ఒకరి విషయ మొకరికి అక్కఱ లేకుండుట యేమి? ఒకరి దుఃఖమును గుఱించి ఒకరు తెలిసి-కొనకుండుట యేమి? ఈ యానందము, ఉల్లాసము, శోభ,

ఐశ్వర్యము—ఇవియన్నియు పైశాచిక హాసమా; లోపల నుండుదైన్యమును దాఁచుచుండు కృత్రిమశోభయా ఇది యంతయు! ఆ సంగీత మతనిమనస్సు నాకర్షించి యుంచ లేకపోయినది; అతఁ డక్కడనుండి తిరిగిపోయెను. ఆ ఘోర-మగుగానము వినఁబడకుండునట్లు దూరముగపోవుచుండ కొంత సేపటికి కరుణారసముతోనిండిన పాటయొకటి అతిమధురమగు ఫిడేలువాద్యముతో కలసి అతని చెవినిపడెను. విశ్వేశ్వరుఁ డాగి శ్రద్ధతో ఆపాటను వినుచు ఆనందింపసాగెను.

జననీ రమ్మా! శరణంబిమ్మా!
అద్దరిజేర్చి నా కాశ్రయమిమ్మా!
కామితంబులవి సిద్ధింపక నే,
యాశయంబులవి ఫలమందక నే,
నాదుజీవ మిల ముగియఁగనున్నది—
సర్వంబును నంతంబగుచున్నది!

విశ్వేశ్వరుని తల తిరుగుట మొదలుపెట్టినది. జాలి-పుట్టించుచుండు ఈ పాట ఈ యుత్సవదినమున నెవడు పాడు-చున్నాడో! ఆ పాటలో శరీర విముక్తులైన ఆత్మ లెన్నియో కలిసి తమదుఃఖమును వ్యక్తపఱచుచున్నవని పాటపాడు చుండినవాఁ డెఱుఁగునో లేదో?

పృథ్వి నెవరు నను ప్రేమింపరు, యీ
పృథ్వికి ప్రేమము తెలియదు, తల్లీ!

ప్రణయనిలయమగు తావక కౌఁగిలి
జేరగ నాహృది త త్తరపడియెడు!

విశ్వేశ్వరుఁడు కనుల నీరు పెట్టుకొనెను. కరుణాహీన మగు ఈ పృథ్విపై ప్రేమ యనునది నిజముగా నున్నదా? ఎవరు తమజీవనములను ఎవరిపాదములకు సమర్పించి అంతర్ధాన మగుచున్నారో ఎవరైన తెలిసికొనఁ గోరుచున్నారా? సతి ఈ రీతిగ తనప్రాణముల నర్పించెనని విశ్వేశ్వరుఁ డెఱఁగియుండెనా? ఆమె యతనిని నమస్కరించి పృథ్విని విడిచి వెడలినది—ఆమె యాత్మకు వాంఛిత వస్తువు దొరకినదా? అతని హృదయమున నిప్పుడు పొంగి పొరలుచుండు అనుభూతి, ప్రేమ—ఇవియా ఆమె కోరినది—ప్రేమ యనున దిదియేనా ? ప్రపంచమున నట్టి సుశీలము, సహనము, సౌందర్యముగల బాలిక మఱియొకతె, తిండికిలేక కష్టపడుచు, రాత్రింబగళ్లు విచారగ్రస్తురాలై, పాపాత్ముఁ డెవఁడో చేయు దుష్కృత్యములకై బాధచెందుచు, ఎవనినో తనలో తాను ప్రేమించుచు ప్రాణత్యాగముచేసిన యెడల, దానినెఱఁగియుండికూడ విశ్వేశ్వరుఁడిప్పుడు దుఃఖించు చుండునట్లువలె దుఃఖించకయుండునా? భరింపరాని బాధ అతని హృదయమును కెలకెలఁబెట్టదా? సామాన్యమైన కథ చదివి అందు వర్ణించియున్న ఘటనలవలన దుఃఖముఁజెందుచు నిజః ముగా జరిగిన యిట్టి ఘటనవలన మనస్సు కరుగకుండునంత నిర్దయుఁ డెవ్వఁడైన నీ ప్రపంచములో నుండునా?

కోరికలన్నిటి నేఁ ద్యజియించితి,
కామితంబులవి కల్లల టెంచితి
దుఃఖపూర్ణమహాద్భాండము వగులగ
మీరరాని పరితాపము నొందితి
ప్రణయసీమ, జననీ! యిటుగనుమా.
ఒక్కసారి యీ ధాత్రికి రమ్మా,
దుర్భరమగు నీదుఃఖభారమున
క్రుంగిన నను నీయొడి నిడుకొనుమా!

విశ్వేశ్వరుఁ డస్ఫుటకంఠముతో, "మంచిపని చేసితివి సతీ! ఈ ప్రపంచమును తప్పించుకొని పాఱిపోతివి!" అని యనెను.

పాట యాగినది కాని దానిలోనుం డార్తనాదము మాత్ర మాగక గాలియందు సంచారము చేయుచున్నట్లుండెను. అక్కడ నిలిచియుండుట కష్టమని తోఁచి విశ్వేశ్వరుఁడు మెల్ల మెల్లగ ముందుకు పోయెను.

కొంతదూరము రాఁగానే నిండు వెన్నెలను కూలి పడుటకు సిద్ధముఁగ నున్న భట్టాచార్యుల యింటిద్వార మతని కంటఁబడెను. సిరిలేని ఆ యంగణమున నది విధవవలె నతనికి కనఁబడెను. విశ్వేశ్వరుఁడు మెల్లగా అంగణమున ప్రవేశించెను. తులసికోటయెదుట దీపము పెట్టి, చేతులు జోడించుకొని, ముడుకులపై వ్రాలి, ఎవరో ప్రణామము చేయుచున్నారు. ఎవ రది? సతియా? సతివలెనేయున్నది—ఆ విరియఁబోసియున్న

జుట్టు, సన్నని దేహము, చిరిగియున్న చీర, వాల్చియున్న తెల్లని ముఖము—ఏదిచూచినను సతియనే తోఁచి విశ్వేశ్వరుఁడొక్కమాఱు, "సతీ" అని పిలువబోయెను. కాని కంఠములో నుండి మాట బయటికి రాలేదు.

తులసికోటయెదుట వ్రాలియున్న యామె నెమ్మదిగా లేచినది; లేవఁగానే విశ్వేశ్వరుఁ డామె కంటఁ బడెను— ఆశ్చర్య మొంది మెల్లగా, "ఎవ రది?" అని ఆమె యడిగినది.

విశ్వేశ్వరుఁడు కంఠము పోల్చుకొని, "సావిత్రీ!" అని యనెను.

"ఎవరు? విశుదాదా? మీరా వచ్చినారు, అమ్మను పిలువనా?"

సావిత్రి కంఠము వినఁగానే విశ్వేశ్వరుని హృదయము కరిగి కనులు తడిసైనవి. విశ్వేశ్వరుఁడు నెమ్మదిగా నామెతో, "వద్దు సావిత్రీ, నీతో నొకమాట చెప్పవలసియున్నది వినుము," అని యనెను.

సావిత్రి అతనివైపు చూచుచు నిలుచుండెను.

"అక్క నీచేతి కేమైన నిచ్చిపోయినదా సావిత్రీ?"

"ఇచ్చినది, చాల నో ట్లెక్కడనో అక్కకు దొరకినవి, వానిని నా చేతి కిచ్చినది."

"అవి అన్నియు నున్నవా? ఒక్కటైనను కర్చుచేయ-లేదా?"

"ఒక్కటైన ఖర్చు చేయలేదు."

"అవి తెచ్చి నా కిమ్ము."

సావిత్రి గదిలోనుండి నోట్లకట్ట యొకటి తెచ్చి విశ్వేశ్వరుని చేత పెట్టినది. అవి పుచ్చుకొనఁబోవ విశ్వేశ్వరుని హృదయమున నాందోళన పుట్టినది, కాని అది పోల్చుకొననియెడల సావిత్రి ఏమనుకొనునో యని ఊహించి యతఁడు మనస్సును స్తిమితపఱచుకొని ఆ నోట్ల నందుకొనుచు, "మీ అమ్మ వీని సమాచార మేమైన నెఱుఁగునా?" అని యడిగెను.

"ఎఱుఁగదు. ఒకనాఁ డెప్పుడో చెప్పవలెనని అనుకొన్నాను."

"అట్లైన మఱి చెప్పకుము. ఎవరి రూపాయలు మీ అక్కకు దొరకినవో వారికి ఆరూపాయలను మరల నిచ్చెదను." సావిత్రి మెల్లగా తలయూఁపి సమ్మతిని తెలియఁజేసినది.

సావిత్రి మిగుల దుఃఖించుచున్న దనియు, లేచి ఇటు నటు తిరుగుచుండ లేదనియు, తిండి తినుచుండ లేదనియు, ఎవరితోను మాటలాడుచుండదనియు విశ్వేశ్వరుఁడు పిన్ని చెప్పఁగా విన్నాఁడు. కొమార్తె మనస్సును త్రిప్పుటకు జాహ్నవి చేసిన ప్రయత్నము లన్నియు నిష్ఫలము లగుచున్నవఁట. సావిత్రిని కొంచెమోదార్చుటకై రెండుమాట లాడవలెనని విశ్వేశ్వరునికి కోరిక కలిగి, "అక్కడ కూర్చుండి నీ వేమి చేయుచుంటివి సావిత్రీ?" అని యతఁ డడిగెను.

"తులసికోటయొద్ద దీపముంచుటకు పోతిని."

"చేతులు జోడించి ఏమో అనుచుంటివి?"

సావిత్రి తలవాల్చుకొని నెమ్మదిగా ప్రత్యుత్తర మీయ సాగెను—"ఆత్మహత్య చేసికొనినవారికి సద్గతి లభింపదని విన్నాను, కనుక తులసికోట యెదుట దీపముంచి—"ఇంతవఱకు అని మఱియేమియు ననలేక పోయినది.

బాలిక నేత్రములనుండి యేవిధముగ నశ్రుధారలు ప్రారంభమైనవో విశ్వేశ్వరుని నేత్రములనుండికూడ నదియే విధముగ ప్రవహించినవి. చాలసేపటివఱ కట్లూరక నిలిచి చివరకు విశ్వేశ్వరుఁడు కంఠము సవరించుకొని, "మీయక్క స్వర్గమున నున్నది సావిత్రీ, ఆమెవంటి పుణ్యాత్మురాలికి దుర్గతి కలుగఁగలదా? నీ వట్టి మాటను నమ్మఁగలవా సావిత్రీ?" అని యడిగెను.

"అక్క స్వర్గమునకు వెళ్లినదని మీ రనుచున్నారా? ఆమె అక్కడ క్షేమముగ నున్నదా?"

"ఆహా, క్షేమముగ నున్నది."

సావిత్రి మ్రుదుకులపై వ్రాలి విశ్వేశ్వరునిపాదములకు ప్రణామము చేసినది. తరువాత నెమ్మదిగా, "అట్లైన నేను మఱి యేడ్వను; అక్క మమ్ముల నందఱను విడిచి పోయినది, మమ్ములను మఱచి పోవచ్చును—అందులో దుఃఖింపవలసిన దంతగా లేదు. ఆమె సుఖముగా నున్నది—అంతే చాలును," అని యన్నది.

ముత్యములవరుసవలె సావిత్రి నేత్రములనుండి అశ్రుబిందువులు పడసాగెను. సావిత్రిని అట్టియవస్థలో విడిచి వెళ్లుట

విశ్వేశ్వరునకు సాధ్యముకాలేదు. సావిత్రి అచ్చటనే పడి వీడ్చుచుండునేమో యని భయపడి, కొంతసే పాలోచించి, "అమ్మ యెక్కడ? కాళీ ఎక్కడ?" అని యడిగెను.

"అమ్మ కాళీని పరుండఁబెట్టుచున్నది, వాఁడు రాత్రింబగళ్లు, 'అక్కా అక్కా' అని యేడ్చుచుండును, ఎంత యోదార్చినను ఊరకుండఁడు."

"నీవు కూడ చాల ఏడ్చుచున్నావు సావిత్రీ, ఏడ్చుటవలన నేమి ప్రయోజనము, అక్క తిరిగి వచ్చునా? దానివలన అమ్మకు దుఃఖ మధికమగుచుండుటతప్ప వేఱేమి లాభము?" సావిత్రి తలవాల్చి వెక్కి వెక్కి యేడ్చుచు, "నే నెప్పుడును అక్కను విడిచి యుండలేదు," అన్నది.

"శాశ్వతమిత్రులనుకూడ మఱువవలసివచ్చుచుండును, ఇదియే లోకమున జరుగుచుండు క్రమము."

"ఇంత త్వరగా నే నెట్లు మఱువఁగలను? అక్క స్నేహితురాలు 'కమల' నేడు వచ్చినది, ఆమె యక్కను చూచి చాల కాల మైనది, ఐనను అక్కమాట చెప్పుచు వీడ్చి యేడ్చి జీర్ణించిపోయినది—ఆమెయే అక్కను మఱువ లేకున్నప్పుడు నేనెట్లు మఱువఁగలను?"

"ఎవరు వచ్చియుండి రంటివి? నరేన్ బాదురీ భార్యయా? ఆమె చాల కష్టపడుచున్నదని విన్నాను, నిజమే?" అని విశ్వేశ్వరుఁ డడిగెను.

నరేంద్రుని పేరు చెప్పఁగానే అతనిపైనే కాక, అతనితో బాంధవ్యముగలవా రందఱిపైనిఁగూడ విశ్వేశ్వరునకు కోపము వచ్చినది. కాని సావిత్రి యనినమాటలు విని అతని మనస్సు కరిగినది, సావిత్రి, "కమలక్క భర్త మంచివాఁడు కాఁడని విన్నాను, ఆమెను చాల బాధపెట్టుచుండునఁట. కమలక్క మాట యనుచు అక్క తఱచుగా కనుల నీరు పెట్టుకొను-చుండెను. కమలక్కయెడల అక్కకు అమితప్రేమ," అని యని నది. సావిత్రిమాటలు విశ్వేశ్వరునకు అనేక దినముల క్రిందట జరిగిన ఘటన నొకదానిని జ్ఞప్తికి తెచ్చినవి—తాను కమలను పెండ్లియాడవలెనను విషయమును గుఱించి సతికిని తనకును సంభాషణ జరిగినది, ఆ మాటలు నేఁ డతనిహృదయమున బాధ కలిగించినవి.

మఱునాఁడు తెల్లవాఱుజాముననే లేచి విశ్వేశ్వరుఁడు చాంద్‌పూరునకు బయలుదేఱెను. కొద్దినిమిషములలో జమీం-దారుగారి హృదయహీనమగు పాషాణసౌధము విశ్వేశ్వరుని కంటఁ బడినది. జమీందారుగారు బయటి యుద్యానవనమున నొక బెంచిపైఁ గూర్చుండి గాలి సేవించుచుండిరి. మనస్సున నేదో దుఃఖమున్నట్లు అతని ముఖము మిగుల కళాహీనముగ నుండెను. విశ్వేశ్వరుఁడు లోనికివచ్చి అతనియెదుట నిలిచెను. జమీందారుగా రాశ్చర్యమొంది, "ఎవరు మీరు?" అని యడిగిరి.

"నా పేరు విశ్వేశ మైత్ర. నే నుండునది మజుత్‌పూర్."

"మిమ్ములను నే నెచ్చటనో చూచినట్లున్నది; కూర్చుం-
డుఁడు."

"చూచి యుండవచ్చును. మీరు మజూత్ పూరు షికా-
రుగా తఱచుగావచ్చుచుందురు——ఎప్పుడో నేను మీకంటఁ
బడియుండవచ్చును."

నరేంద్రుఁడు కొంచెము తడఁబడుచు, "ఏమిపనిమీఁద
వచ్చినారు?" అని యడిగెను.

"పని యున్నది, రహస్యస్థలమునకు పోగలమా?"

"ఈ స్థల మట్టిదే, చెప్పవలసినది ఇచ్చటనే చెప్ప
వచ్చును."

విశ్వేశ్వరుఁడు మఱియేమియు ననక జేబులోనుండి
నోట్లకట్ట యొకటి తీసి నరేంద్రుని చేతి కిచ్చుచు, ఇవి మీ
నోట్లు లెక్క చేయుఁడు, వేయిరూపాయలు," అని యనెను.

నరేంద్రుఁడు తెల్లబాఱి నిశ్చేష్టుఁడై విశ్వేశ్వరుని వంక
చూడసాగెను. విశ్వేశ్వరుఁడు ముఖము మఱియొకవైపునకు
త్రిప్పుకొనెను. కొంతసే పూరకుండి నరేంద్రుఁడు, "మీరు
వేఱువిధముగ భావింపనిచో మీ కొకమాట యడుగవలెనని
యున్నది," అని యనెను.

"అడుగ వచ్చును."

"ఈ నోట్లు మీ కెక్కడ దొరకినవి?"

"మీ రెవరి కిచ్చితిరో ఆమె నాచేతి కిచ్చినది. ఆమె
మాకుటుంబములోనిదని నేను భావించుచుంటిని."

"ఆమెయా! ఆమె మీ కిచ్చినదా! ఆమె చనిపోయిన-దని విన్నాను!"

"చనిపోయిన దనుట సరియైన వార్తకాదు—ఆమె ఆత్మహత్య చేసికొనినది."

"ఔనౌను, వదంతికూడ నదియే—ఆ యాత్మహత్యకు కారణము మీ రెఱుఁగుదురా?"

"ఆహా, ఎఱుఁగుదును, మీ కు సందేహమేల ? దానికి కారణ మిదిగో, ఈ నోట్లు; మీ చేతనున్న యీనోట్లే ఆమె మరణమునకు కారణము. మీ యొద్ద నివి పుచ్చుకొనవలసి వచ్చినది; పుచ్చుకొని మీ చేతులలోనుండి తప్పించుకొనుటకు మార్గము ఆత్మహత్య ఒక్కటే అని ఆమెకు తోచినది."

అట్లైన మీకు చాలసంగతులు తెలియును, మీతో దాఁగుడుమూఁతలాడి లాభము లేదు. కాని నాపై మీ రన్యాయముగ దోషారోపణము చేయుచున్నారు. ఆమె నోట్లు పుచ్చుకొనని యెడల నాబల మేమిచేయఁగలదు? నేను—నేను బలము ప్రయోగించ లేదు, ఆమె—"

"నోరు మూయుము, నోరు మూయుము, పాపీ, నీకు మాటలాడుటకు నోరెట్లు వచ్చుచున్నదిరా! నీ హృదయములో కంపము పుట్టుట లేదా? ఆమెను నీవలలో వేసికొనుటకు ఎన్ని మాఱులామెకొఱకు పోతివో జ్ఞప్తిలేదా ? గొప్పయింటి పిల్లవాఁడవు కావా నీవు! లంజెలతో కాలముగడపుచున్నావు, గడుపుము కాని నీకు అక్కచెల్లెండ్రు, తల్లి, భార్య ఉన్నారే—!

కులవంతులయింటి యాఁడుబిడ్డ లిట్టి పాపకృత్యమునకు సమ్మ తింపరని నీ వెఱుఁగవా? సమ్మతించువారు భరింపరాని దుఃఖమున నున్నప్పుడే సమ్మతింతురు. ఆమె తన తల్లి, తమ్ముడు, చెల్లెలు, వీరి ప్రాణములు నిలుపుటకై నీ రూపాయలు పుచ్చుకొనుట కంగీకరించినది. కాని తప్పించుకొని స్వర్గమునకు పాఱిపోయినది. ఇదిగో నీ సొమ్ము తీసుకొనుము—దుఃఖితుల దుఃఖమును తొలఁగింపఁ గల ధనము, ప్రాణము లేనివారికి ప్రాణమీయఁగల ధనము, నీచేతిలోపడి, అమాయికయగు నొకసాధ్వీమణి ప్రాణ- మును అకాలమున హరించినది. ఛీ ఛీ, పాపాత్ముఁడా, నీకంటె నధముఁ డెవ డుండునురా!"

నరేంద్రుఁ డేమియు పలుక లేదు. అతఁడు మోసపోతి- నని పోల్చుకొనిన కొద్దిరోజులకు సతి మరణమునుగుఱించి విని కొంచె మనుతపించెను. ఆ యనుతాప మిప్పుడు పూర్తి యైనది. కొంతసే పైన తరువాత విశ్వేశ్వరుఁ డి ట్లనెను— "హరి మీయింట చేరి బాబుగిరి నేర్చుకొనుచున్నాఁడని విన్నాను, వాని నొకమాఱు పిలువుము."

నరేంద్రుఁడు మరబొమ్మవలె నతని యాజ్ఞను పాలిం- చెను. తనయింటిలో జరిగిన దుర్ఘటననుగుఱించి నలుగురు ననుకొనుచుండఁగా హరి విన్నాఁడు. హరి సిగ్గుతో ముఖము వాల్చుకొని అచ్చటకు వచ్చి నిలిచెను.

విశ్వేశ్వరుఁ డతనిని వ్రేలితో చూపించుచు నరేంద్రు- నితో ని ట్లనెను—"ఇతఁడా మీనాటకములలో స్త్రీవేషము

చేయువాఁడు? ఇతనిని నీవిఁక విడిచిపెట్టవలెను. తల్లియు, చెల్లె-లును, ఇతనికొఱకై ఇప్పటికిని కనుల నీరు పెట్టుకొనుచున్నారు. ఆ కన్నీరు నిన్ను మఱింత త్వరగా నాశనము చేయును. ఇప్పుడే ఇతనిని మీయింటినుండి పంపివేయుము."

"తీసికొని పొండు, అతనిని మీతోనే తీసికొనిపొండు. నే నిఁక నాటకము లాడించను, నాటకశాల మఱి యుంచను. ఈనాటకములే నన్నీ దశలోనికి తీసికొనివచ్చినవి. లేకున్న నేను చెడ్డవాఁడను కాను, మీ రెఱిఁగియేయుందురు."

"నే నెఱుఁగుదును. నీభార్య కమలయు, సతియు అట్టి-బాలికలు మఱికొందఱును నాకు చెల్లెండ్రవంటివారు. గుణవతియగు నీభార్య నీ వ్యవహారమును చూచి మిగుల దుఃఖించుచున్నదని వినుచున్నాను—ఆమెకూడ నేఁడో రేపో ఆత్మహత్య చేసికొని నీ పాపమును రెండింతలుచేయును.

నరేంద్రుఁడు ముఖము వాల్చి నిలుచుండెను. విశ్వేశ్వ-రుఁడు హరివైపు చూచుచు, "నీవు నాతో నింటికి రావలెను," అని యనెను.

హరి మిగుల దీన నయనములతో నరేంద్రుని వైపు-తిరిగి యిట్లనసాగెను. "నరేన్ బాబుగారూ, మీరు నన్ను—" అతనిని మాట పూర్తి చేయనీయక నరేంద్రుఁడు ప్రత్యుత్తర మిచ్చెను—"ఆహా, వెళ్లుము. మీరందఱును నన్ను మఱింత పాడుచేసితిరి. మీరు చేసినది చాలును, నా కిఁక నాటకము లక్కఱలేదు. నాయింటినుండి పొమ్మిఁక."

అవమానము పొంది ముఖ మెఱ్ఱఁగాఁ జేసికొని హరి జమీందారుగారి యిల్లువదలి మెల్లఁగా బయటికి వచ్చెను. విశ్వేశ్వరుఁడు కూడ లేచి, "నరేశ నేను పోవుచున్నాను. నీతో నేను చెప్పవలసినది మఱి యేమున్నది? నీవు చంపిన సతి-కిని నీభార్య కమలకును నొక్కటే ప్రాణము—వారిద్దరికిని అట్టి యన్యోన్యానురాగము. క్షమింపుమని నీ విప్పుడు సతిని గోరుచున్నచో కమల దుఃఖమును తొలఁగింపుము—ఇంతే నేను చెప్పవలసినది," అని యనెను.

విశ్వేశ్వరుఁడు బయటికి వచ్చి, "నీ వెక్కడికిఁ బోవుచు-న్నావు హరీ?" అని హరి నడిగెను.

మఱి యెక్కడికి పోయెదను! గొప్పవారి యాశ్రయము నా కిఁక నక్కరలేదు. అతని నాటక సమాజాభివృద్ధికొరకు నే నెంతో పాటుపడితిని, దానికి ప్రతిఫలముగా నా కెట్టి బహుమానము దొరకినదో మీరిప్పుడే చూచితిరి. ఒక్కమా ఱింటికి పోయి అమ్మను చూచి కండ్లకే దారి కనఁబడునో ఆ దారినే నడిచి పోయెదను."

"నీ వట్లు పో నక్కఱలేదు. అమ్మను సుఖపెట్టుచు నీ గ్రామములోనే పౌరుషముతో తలయెత్తుకొని తిరుగుచు నుండ-వచ్చును. ముఖస్తుతి చేయుచు వీనివెంట, వానివెంట తిరుగుట మాని మంచియింటఁబుట్టినవానివలె పనిపాటులు చేసికొనుచుండిన నీకు తోడ్పడువా రనేకు లుందురు."

---

## పదునైదవ పరిచ్ఛేదము

### సావిత్రి వివాహమున కేర్పాట్లు

భట్టాచార్యుని పాతయింటి మరమ్మతు మెల్ల మెల్లగా పూర్తియైనది. భట్టాచార్యులవారి యింటి సిరి పెంపొందుట చూచి పేటవారి మనస్సులలో నీర్ష్య జ్వాలలు పుట్టినవి. వారి యిల్లుక్రొత్తదైనది. వారికి రోజు లెట్టికష్టము నెఱుఁగక గడచు-చున్నవి. హారికూడ మరల నింటికి వచ్చెను. అతఁడు బుద్ధిగా ప్రవర్తించుచు విశ్వేశ్వరుని పనిపాటులలో తోడ్పడు-చున్నాఁడు, హారిని నిందించి తల్లికి దుఃఖము కలిగించుమాట లనుచుండుటకు ఇరుగుపొరుగుల వారికిప్పు డవకాశము చిక్కు-చుండ లేదు. అట్టివారిచేతిలో నిప్పటికిని గల యుపాయములు రెండే—చనిపోయిన సతిపేరెత్తి ఏదో ప్రేలుచుండుట, లేక బ్రతికియున్న సావిత్రిపై నేదో యపవాదములు సృష్టించుట. "విశ్వేశ్వరుఁడు ఇంటికి అల్లుఁడు కాఁబోవు చున్నాఁడు, కనుక నే ఈయాకర్షణ్ణ," అని కొంద అనుచుండిరి. "బహిరంగముగ అల్లుఁడగుట మేలు, ఇట్లు రహస్యముగ నల్లుఁ డగుటవలన చిక్కులు కలుగవచ్చును," అని వారిలో తెలివితేటలు గల వా డొకఁడు కండ్లు చికిలించుచు ననెను. ఇట్లుండ విశ్వేశ్వ-రుఁడు సావిత్రికొఱకై మంచివరుని చూచుచున్నాఁ డనియు

రాఁబోవు శ్రావణమాసమున సావిత్రి వివాహమనియు తెలియఁగానే అందఱి ఆమోదమునకు భంగము కలిగినది.

ఉత్సాహములేని విశ్వేశ్వరుని మనస్సున కొంచెము వేఁడి పుట్టింపఁ గోరుచు అన్నపూర్ణ విశ్వేశ్వరునితో నిట్లనెను—"ఆలస్యము చేయకుమమ్మా విశూ, సావిత్రికి పదునైదేండ్లు వచ్చినవి, పిల్ల నోటితో నేమియు ననదు, కాని లోలోపున క్రుంగిపోవుచున్నది. వరునికొఱకు గట్టి ప్రయత్నమొకటి చేయుము."

"నేను ప్రయత్నము చేయుచుండుట లేదా పిన్నీ? కాని మంచి వరుఁడు దొరకవలెనుకదా. ఎంతో వెదుకగా వెదుకగా నేఁ డొకఁడు దొరకెను. అతనియొద్దనుండి జాబిప్పుడే వచ్చినది. అతఁడు విద్వాంసుఁడు, రెండుమూఁడు పెద్దపరీక్షలుపాసైనాఁడు, మంచివంశము, స్థితిగతులు మంచివి. పిల్లవానితండ్రి బ్రతికియున్నాఁడు—ఏమి పిన్నీ, అట్టివాఁడు తగిన వరుఁడేనా?"

"నీవు చెప్పినదానినిఁ బట్టి మంచి సంబంధమనే తోఁచుచున్నది. కాని సరియైన సమాచారము తెలిసికొననిదే ఏమియు నిశ్చయింపకుము. తొందరపడి తరువాత విచారింపఁగూడదు."

"భయపడకుము పిన్నీ, నేను జాగ్రత్తగానేయుందును."

"అట్లైన సరియే, కాని వరుని కెంత కట్నము కావలెను విశూ?"

విశ్వేశ్వరుఁడు నవ్వుచు జబా బిచ్చెను, "అట్టివరుఁడు రూపాయలీయక దొరకునా? డబ్బు ధారాళముగ కర్చుచేయ-

వలసి యుండును పిన్నీ, సందేహ మేల? కాని దానినిగురించి ఇప్పటినుండి యోచన యేల, పెండ్లినాఁడు వినెదవు; కాని, నీ రూపాయలపెట్టె మాత్రము నాచేతి కొప్పఁజెప్పుము పిన్నీ."

పిన్ని కోపగించుచు, "పో! అన్ని విషయములలోను నీకు కుఱ్ఱతనమే. సరే, ఏది యెట్లైన ఆలస్యముమాత్రము కానీయకుము."

కొద్ది దినములలో వరునివక్షమువారితో మాటలుజరిగి అంతయు స్థిరమైనది—అన్నపూర్ణ అప్పు డన్నది—"ఇఁక నాలస్యము చేయకూడదు బాబూ, పై వారమున మంచితిథి యొకటి యున్నది. ఆనాటి ముహూర్తము నిశ్చయింపుము."

"వారముదినములలో నన్నియు నెట్లు సిద్ధపఱుపఁగలము పిన్నీ?"

"అనాయాసముగ చేయవచ్చును. నేను చెప్పిన ట్లన్ని యేర్పాట్లును చేయుచుండుము—ఏల సిద్ధము కావో చూతము!"

విశ్వేశ్వరుఁడు నడుము బిగించుకొని సిద్ధపడెను. భట్టా-చార్యుల యింటికి వెనుక వైపున పెద్ద పురియిల్లొకటి లేచినది. విశ్వేశ్వరుఁడు అంగణము చక్కఁజేయించి రెండుప్రక్కల గడ్డి పాకలు వేయించెను. పనిచేయు మనుష్యులకు లోటు లేదు, పేటవారందఱును వచ్చి, ఏదో సంభంధము కలుపుకొని పనిలో సహాయపడుచుండిరి. పెత్తల్లికూడ మరల వచ్చినది.

పెండ్లి దగ్గఱపడ్డది. ఆచారానుసారము సావిత్రికి పసుపు రాసి స్నానము చేయించిరి. ఇరుగు పొరుగులవా రొక్కొక్కరు అవివాహితావస్థలోనుండు సావిత్రికి కడపటి విందునకై* పిలువసాగిరి. పెండ్లికి ముందు రోజు కాక, ఆముందు రోజున అన్నపూర్ణ సావిత్రిని తనయింటికి విందునకై తీసికొనిపోయినది. —ఆనాఁడు అన్నపూర్ణ, సావిత్రి ఇద్దఱును కలిసి వంటచేయ సాగిరి. విశ్వేశ్వరుఁ డది చూచి ఆశ్చర్యపడుచు, "నేఁడు మీ రిక్కడ నున్నారేమి పిన్నీ?" అని యడిగెను.

"సావిత్రిని విందునకు తీసికొని వచ్చితిని. బనరాసు చీర కట్టుకొని తమ్మెట్లు పెట్టుకొనిన సావిత్రి నీకంటి కెట్లున్నదో చూచి చెప్పుము విశూ."

విశ్వేశ్వరుఁడు సావిత్రివంకఁ జూచెను. సావిత్రికి ముస్తాబువలన అందమురాలేదని విశ్వేశ్వరునకు తోఁచినది. ముతకి చింకిబట్ట కట్టుకొని, జుట్టు విరయఁబోసికొని యున్నప్పుడే సావిత్రి అతని కంటికి ఇంతకంటె మిక్కిలి యందముగ కనబడెను. విశ్వేశ్వరుఁ డేదో తనలో తా నాలోచించుకొనుచు గదిలోనికి పోయెను.

సావిత్రీవిశ్వేశ్వరుల భోజనములయినవి. సావిత్రి లేచి అన్నపూర్ణ గదిలోనికి వెళ్లి, తా నప్పుడు కట్టుకొని యున్న బట్టలు విప్పి తన మామూలుబట్టలు కట్టుకొనినది. తమ్మెట్లు తీసి బాలీసుపై నుంచినది. తరువాత నేమి

*ఇది బంగాళాదేశమునం దుండు ఆచారము.

చేయుటకును తోఁచక పిన్ని పఱపుప్రక్కను పడియుండు మహాభారతము తీసి పట్టుకొని ముఖమెత్తఁగా, ఎదుట నిలు చుండియున్న విశ్వేశ్వరుఁ డామెకంటఁబడెను.

విశ్వేశ్వరుఁడు దగ్గఱకు వచ్చి పఱపుపై నొక ప్రక్కను కూర్చుండి, "ఏమి చూచుచుంటివి, మహాభారతమా?" అని యడిగెను.

సావిత్రి లేచి నిలుచుండి "ఔ"ననుచు తల యూఁచినది.

"ని న్నొకప్రశ్న యడుగవలసియున్నది సావిత్రీ, జవాబు చెప్పెదవా?"

సమ్మతిని తెలియఁజేయుచు సావిత్రి మఱియొకమాఱు తల యూఁచినది.

"నాదగ్గఱ సిగ్గుపడకుము సావిత్రీ—సిగ్గుపడ నవసరము లేదు. నేను నీకు వరునిగ నిశ్చయించినవాఁడు మిక్కిలి మంచి వాఁడు, అతనిని పెండ్లియాడుటకు నీ కసమ్మతిలేదు కదా?"

"అట్లడుగుచున్నా రేమి? మీరెవ్వరిని నిశ్చయించి తిరో, అది నా మంచికొఱకే, నాకెట్టి సందేహమును లేదు."

"నిజమే సావిత్రీ, నీకు దేనివలన సుఖము కలుగునో యని నేను రాత్రింబగళ్లాలోచించుచున్నాను, కేవలము నీ—"

విశ్వేశ్వరునివాక్యము పూర్తికానీయక సావిత్రి "అది నే నెఱుఁగుదును," అని యనుచు సావిత్రి విశ్వేశ్వరునకు సాష్టాంగ నమస్కారముచేసినది. విశ్వేశ్వరుఁడు తడబడుచు,

లేచి నిలిచి, ముఖము గంభీరము చేసికొని "నేనతి బలహీను-
డను సావిత్రీ," అనుచు దుఃఖముతో కొంచెము నవ్వెను.
మఱికొంత సేపైన తరువాత తలవాల్చుకొనియున్న సావిత్రితో
నతఁడు, "నీవు చెప్పవలసిన దేమైన నున్నయెడల చెప్పుము
సావిత్రీ," అని యనెను.

సావిత్రి విశ్వేశ్వరునివై పొకమాఱు చూచి మరల
క్రిందికి చూచుచు మృదుకంఠముతో నిట్లనెను—"మిమ్ముల
నొకమాట యడుగఁ లేనని యున్నది—పెండ్లియైన తరువాత
వారు నన్ను తీసికొని పోవుదురా ?"

"ఆహా, తప్పక తీసికొనిపోయెదరు. అట్లడుగుచున్నా-
వేమి సావిత్రీ ?"

"అట్లైన అమ్మదగ్గఱ నెవరుందురు? అక్కలేదు; నేను
కూడ లేకున్న అమ్మను, కాళీని ఎవరు చూచుచుందురు? పెండ్లి
యైన తరువాత వారు నన్నిక్కడ నుండనీయరా? కొద్దికాల
మైన నన్నుంచలేరా?"

విశ్వేశ్వరుఁడు కొంచెము నవ్వెను. సావిత్రి సిగ్గు విడిచి
యిట్లడుగుట ఆ నవ్వునకు కొంతవఱకు కారణమై యుండ-
వచ్చును. విశ్వేశ్వరుఁడు, "అది యెట్లు సావిత్రీ?" అని యనెను.

సావిత్రి కొంచె మాలోచించి నిట్టూర్పువిడిచి, "నేను
భయపడ నక్కఱలేదు, మీ రిక్కడనే యుందురు కదా. ఇప్పు
డన్నయ్యకూడ అమ్మమాట వినుచున్నాఁడు. మీరే అమ్మను

చూచుచుందురు, నే నావిషయమై చింతించుట అనవసరము, చెప్పుట అంతకంటె అనవసరము," అని యన్నది.

"పెండ్లి యనిన నీకు సిగ్గువేయ లేదా?," అని విశ్వేశ్వరుఁ డడిగెను.

సావిత్రి లేదనుచు తలయూఁచినది.

"అందఱుకు సిగ్గుపడుచుందురు కదా, నీకు సిగ్గు లేకుండు టకు కారణ మేమి సావిత్రీ?" అని విశ్వేశ్వరుఁ డడిగెను.

"సిగ్గుపడుచుందురు, నిజమే, కాని వారు నావలె తమ తల్లిదండ్రుల దుఃఖమునకు కారణముకారు."

"అట్లనకుము సావిత్రీ, నీవెవరికి బరువు."

"బరువు కానా? నాకొఱకు మీరెంత కష్టపడుచున్నారో, ఎంత వెదుకవలసివచ్చినదో నే నెఱుఁగనా?"

"అది యొక కష్టమా సావిత్రీ! నీవు సుఖింపవలెనని యే సదా నేనాలోచించుచుండునది. నీవు సుఖముగా నుండునప్పుడే మేము సుఖము పొందఁగలము. ఈసంబంధము నీకిష్టము లేనిచో మఱియొక సంబంధమునకై ప్రయత్నించెదను."

"సంబంధము మంచిది కాదని యెఱిఁగి మీరు నాకు పెండ్లి చేసినను నేను సుఖించెదను—ఆ మాట మీరు తెలిసి కొనుఁడు. అట్లైనను మిమ్ములను దేవతగా భావించెదను. మా యమ్మను మీరు ఎట్టిబాధనుండి రక్షించితిరో నే నెన్నటికైన మఱువగలనా? మీచేతికి అక్క మమ్ముల నొప్పఁజెప్పివెళ్లినది."

సావిత్రి హృదయము భక్తితో నిండినది, తలవాల్చుకొని

యామె మెల్లఁగా నచ్చటినుండి వెళ్లిపోయినది. అటుచూచుచు, దేవతలగు వీరు మర్త్యలోకమున కేల వచ్చిరని విశ్వేశ్వరుఁడు స్తంభితుఁడై తనలో తా ననుకొనెను.

విశ్వేశ్వరుఁడు మరల పెండ్లియింటికి పోయి నడుము బిగించి పనిచేసిచేసి రాత్రి చాలసేపయినతరువాత ఇంటికి వచ్చి పరుండెను. మఱునాఁడు మధ్యాహ్నము పెండ్లివారు వచ్చిరి. విశ్వేశ్వరుఁడు విడిది సిద్ధముచేసి యుంచెను, వారు రాఁగానే వారిని మిగుల నాదరముతో అందులో దింపెను. వరుని రూపము, అతని సౌందర్యము చూచి విశ్వేశ్వరుఁ డానందించెను, కాని పెండ్లిపెద్ద నడవడి, అతని యహంకారము, అతని ధనకాంక్షలలో సంతసింపదగిన దేమియు కానరాలేదు. ఎట్లైన నేమి ఆరాత్రి గడచినది. మఱునాఁ డుదయమే లేచి విశ్వేశ్వరుఁడు కండ్లు నులుముకొనుచు పెండ్లియింటికి వచ్చెను. భూపాలరాగముపై పాడుచుండు సనాయిపాట పందిరిలో నుండి వినఁబడుచున్నది.

సావిత్రి తులసికోటకు ప్రణామము చేసి నిలువఁబడినది. అప్పటికి ఇంకెవరును లేవలేదు. అందరికంటె పెండ్లికూఁతురు ముందుగ లేచినదని యెగతాళిచేయుచు నేమైన ననవలెనని విశ్వేశ్వరునకు బుద్ధి పుట్టినది. కాని నోట హాస్యపుమాటలు రాలేదు.

---

## పదునాఱవ పరిచ్ఛేదము

### సావిత్రి పెండ్లి తప్పిపోవుట

సాయంకాలము కావచ్చుచున్నది. రాత్రి ప్రారంభము-ననే వివాహాలగ్నము. విశ్వేశ్వరుఁడు నానావిధములగు ఏర్పాట్లు చేయుచు, అన్నియును సరిగా జరుగుచున్నవో లేదో చూచుచు నిటునటు పరుగెత్తుచుండెను. అంతఃపురములోని ఏర్పాట్ల భారము అన్నపూర్ణపై నుండెను. దీపములు పెట్టిన కొంత-సేపటికి సావిత్రి పెండ్లి ముస్తాబుతో వచ్చి తల్లిదగ్గఱ కూర్చుం-డెను. జాహ్నవి ఉలికిపడి లేచి రుద్ధకంఠముతో, "నీ విచ్చటకు వచ్చితి వేలనమ్మా? పీటలపై కూర్చుండు వేళ అయినది, వెళ్లు-మమ్మా, వెళ్లుము," అని యన్నది.

"వెళ్లెద నమ్మా, నీయొద్ద కొంచెము కూర్చుండి వెళ్లెదను."

అన్నపూర్ణ సావిత్రిని కానక జాహ్నవి గదిలోనికి పఱుగెత్తి వచ్చినది. సావిత్రి నక్కడ చూచి తల్లిని చీవాట్లు పెట్టినది. జాహ్నవి మెల్ల మెల్లఁగా లేచి సావిత్రిని చేయిపట్టి తీసికొని పోయి పీటపై కూర్చుండఁబెట్టి వచ్చినది. ఆఁడువారు చేయుచుండు సందడివలనను, ఉత్సాహముతో ప్రారంభమైన వాద్యములవలనను, బయట గొప్ప కోలాహలము పుట్టినది ఎవరో పెద్దమనుష్యుఁ డొకఁడు హఠాత్తుగవచ్చి, ఏమండి

వరుఁడు వచ్చి గడపయెదుట నిలిచియుండఁగా మీ రిచ్చట నున్నా రేమి? రండు, రండు," అని విశ్వేశ్వరునితో ననెను.

"ఇదిగో వచ్చుచున్నాను," అనుచు విశ్వేశ్వరుఁడు మెల్లఁగా సభవైపునకువచ్చెను. ఏదో యొక ఎఱుఁగరాని భయమువలన విశ్వేశ్వరుని కాళ్లు చేతులు నిజముగా వణఁకు చుండెను.

వరుఁడు సభలోనికి వచ్చి కూర్చుండి యుండెను. వరుని పక్షమువారికిని వధువుపక్షమువారికిని అతి తీవ్రమగు వాద ప్రతివాదనలు జరుచుచున్నవి. వరుఁడు ముఖము గంభీరముగ జేసికొని మాటాడక కూర్చుండియున్నాడు. విశ్వేశ్వరుఁడచ్చటికి వచ్చి ఒకప్రక్కను నిలిచి వరునివైపు పోకమాఱు చూచెను. మగ పెండ్లిపెద్ద అంత స్వల్పకట్నమునకు తా నొప్పుకొని పెండ్లి లోనికి దిగినందునకు మిగుల అనుతాపముఁజెందుచు మాట లనుచుండ, ఊరిపెద్ద లతనిచుట్టు చేరి మంచిమాటలతో నతనిని శాంతపఱచుచుండిరి.

"ఇఁక నాలస్య మేల, లోపల నంతయు సిద్ధముగా నున్నది," అని ఎవరో వచ్చి అనిరి. విశ్వేశ్వరుఁడు హరిని పిలి పించి అతఁ డే మేమి యనవలెనో నేర్పెను. హరి చేతులు జోడించి నిలిచి "ఇఁక కన్యాదానము కావచ్చునని సెల వీయుఁడు," అని యనెను.

"అహా, అవశ్యముగా, అవశ్యముగా!" అనుచు కేకలు వినఁబడినవి. కాని వానితోపాటు, "మొదట కట్నము రూపా

యలు తీసికొనిరండు, తరువాత నది కావచ్చును," అను మాటలు డంకాశబ్దమువలె మగ పెండ్లి పెద్దనోటినుండి వెలువడెను.

"అహా సందేహ మేల? సంచి నందుకొనుఁడు ఇదిగో! వరుని ఇఁక తీసికొని పోవచ్చునా?"

పెండ్లిపెద్ద రూపాయలు లెక్కించుచు కూర్చుండి, వారి నాగుమని ఎడమచేతితో సంజ్ఞచేసెను. విశ్వేశ్వరుఁడును హరియును మిగుల విసుగుఁజెంది మాటాడక నిలిచియుండిరి. పెండ్లి పెద్ద రూపాయలులెక్కించి, "కట్నములు మూఁడువేలు సరిగానున్నవి, ఇఁక పెండ్లికొమార్తె యాభరణములు చూడవలెను. అంతయు కానిచ్చి పిమ్మట గొడవ చేయవలసినవాఁడను కాను నేను. పెండ్లికొమార్తెను సభలోనికి తీసికొనిరండు—మా ఆచార మదియే," అని యనెను.

విశ్వేశ్వరుఁడు కొంచెము కోపగించి, "మమ్ముల నంత తక్కువగా తలఁపకుఁడు. లోనికి వచ్చి అచ్చటనే చూడవలెను," అని యనెను.

"కోపగించవలసిన దిందులో నేమియులేదు బాబూ, కొంచెమిచ్చి పుచ్చుకొనుబుద్ధి యుండవలెను, పిల్లను సభలోనికి తీసికొని వచ్చిన నేమితప్పు? అదియే మాదేశాచారము." మొగపెండ్లిపెద్ద యాడిన ఈ మాటలకు సభలో ననేకులామోదించిరి.

విశ్వేశ్వరుఁ డెట్టి చలనమునులేని కంఠముతో, "మీా

యాచారము లిక్కడ పనికిరావు. పిల్ల నిక్కడికి తీసికొని రాము," అని యనెను. సభ్యులలో కొందఱు "దీనివిషయమై వివాదపడుటవలన లాభములేదు, లోనికి పోయి జరుపవలసిన దచ్చటనే జరుపుఁడు," అని యనిరి.

మగపెండ్లి పెద్దయును ఆ పక్షమువారు మఱికొందఱును వధువుపక్షములోనివారు కొందఱును కలసి అంతఃపురము లోనికి పోయిరి. మగపెండ్లిపెద్ద గార్దభకంఠముతో, "పిల్లను తీసికొనిరండు," అని యనెను.

హరి ముసుఁగు వేసికొనియున్న సావిత్రిని నడిపించుకొని వచ్చి మగపెండ్లి పెద్దఎదుట కూర్చుండఁబెట్టెను. పెండ్లిపెద్ద పిల్ల యాభరణముల నొక్కొక్కదానిని చూచి ప్రసన్నుఁడై, నిలుచుండి, ఇట్లనెను—"పిల్లను మరల ఇంటిలోనికి తీసికొనిపోక మీ స్త్రీవిధానములు ప్రారంభము కానిండు—అన్నట్టు, కన్యాదానము చేయువారేరీ?" హరి విశ్వేశ్వరుని వైపుచూచెను; విశ్వేశ్వరుఁడు హరిని చూపించుచు, "కన్యాదానము చేయువాఁడితఁడు, ఇతఁడు పెండ్లికొమార్తె యన్నగారు," అని యనెను.

"అనఁగా—అట్లైన—నేను చెప్పిన దేమనగా—మీ రామాట మొదటనే చెప్పవలసియుండెను—అట్లైన నే నిందు లోనికి దిగియుందునా? ఇప్పుడు మీరు మఱియొక వేయి రూపాయ లిచ్చినఁగాని నే నీ పెండ్లి కొప్పుకొనను—మీరు మంచివారు, మీ జాతి పోఁగొట్టుట నా కిష్టము లేదు," అని మగపెండ్లిపెద్ద అన్నాఁడు.

అతఁ డింకను నేమో మాటలాడఁబోవుచుండుట చూచి, విశ్వేశ్వరుఁ డతనికి అడ్డువచ్చి, "మఱియొక వేయి యొందు కీయవలె నయ్యా? అవసరము లేని ప్రసంగము లెత్తుచున్నారు మీరు, మీకు పెండ్లి చేసికొనవలెనని లేదా!" అని యడిగెను.

"ఓహో, నీ వెవరయ్యా మధ్యను? నేను ఆడు పెండ్లి పెద్దతో మాటలాడుచుండఁగా—"

హరి మిగుల దుఃఖితుఁడగుచు, "ఆయనయే పెండ్లి పెద్ద, చెప్పవలసినది ఆయనతోనే చెప్పుఁడు," అని యనెను.

"బోధపడుచున్నదయ్యా, మీ రనేక విద్యలు నేర్చియున్నట్టున్నారు, ఎవరు పెండ్లి పెద్దయో అనియే నిశ్చయము కాలేదు! మీ కుల మెంత పవిత్రమైనదో మీ మోసముకూడ నంత యుక్తిగలది. ఇట్టి యింట పెండ్లి చేసికొనుట కెవరైన వత్తురా?"

విశ్వేశ్వరుఁ డతి కష్టముతో కోప మణఁచుకొనుచు, "చెప్పఁగోరున దేదో చెప్పుఁడు, నేనే పెద్దను," అని యనెను.

"మఱియొక వేయిరూపాయ లీయనిదే మేము పెండ్లి చేసికొనము."

"ఏల? పరతుప్రకారము రూపాయలు మీకు ముట్టినవే? మీరే లెక్కపెట్టుకొని తీసికొన్నారు?"

"మీది యింత పవిత్రమగు కులమని నేను మొదట ఎఱిఁగియుంటినా? పిల్ల యక్క నడవడి మంచిది కాదని విన్నాను—ఆమె విషము తిని చచ్చిపోయినదఁట!"

"జాగ్రత, ముందువెనుకలు కొంచెమాలోచించి మరీ మాటలాడుడు," అని గర్జనచేయుచు విశ్వేశ్వరుఁ డనెను.

"ఆలోచన యేల? అట్లైన నేను పెండ్లి చేయనే చేయను; మీ రేమి చేయఁగలరో నేనును చూచెదను! లెమ్ము అబ్బాయి, బయటికి నడువుము." వరుఁడు వరాసనమునుండి లేచి నిలిచెను. హాఁ హాఁ అని నివారించుచు వరుని నలుగురును పట్టుకొనిరి. కొంతమంది పెండ్లిపెద్దలు దగ్గఱకు వచ్చి, "ఏమండీ, మీరు చేయునది? తొందఱ పడకుఁడు, అంతయు మేము సరిచేసెదము, తొందర పడవద్దు; ఇట్టిపని చేయరాదు," అనుచు నతనిని శాంత పఱుప ప్రయత్నించిరి.

"పిల్లకు పెండ్లి చేయఁగోరువారి కింత పౌరుషము, ఇంత పొగరు ఏల? పిల్ల కెట్లు పెండ్లి యగునో నేనును చూచెదను."

"ఓర్చి యుండుఁడు, ఓర్చి యుండుఁడు."

పరుల హితమును కోరు పెద్దమనుష్యు లిద్దఱు వచ్చి కఱ్ఱబొమ్మవలె నిలిచియున్న విశ్వేశ్వరుని వీపుపై మెల్లఁగా చేతితో తట్టుచు నిట్లనిరి—"ఇంత చేసిన తరువాత ఈస్వల్ప-మునకై ఇంత గడబిడయేల బాబూ! వేయిరూపాయలు మాత్రమే కదా, ఇచ్చి వేయుము నాయనా. కావలెనన్న మేము చందాఎత్తి నీ కా వేయియును వెనుకనుండి యిచ్చెదము. వెళ్లుము బాబూ, రూపాయ లతనికిచ్చి అంతయు చక్కఁ జేయుము, లేనియెడల పెండ్లి తప్పిపోవును."

అరుగుపైనుండు నారీబృందము కఱ్ఱబొమ్మలవలె నిలిచి

పోయిరి, గాజుల చప్పుడు లేదు, మాటలు లేవు. ఎవరో మూర్ఛఁజెంది అచ్చట పడియుండుట విశ్వేశ్వరుఁడు చూచెను. అన్నపూర్ణ దగ్గఱ కూర్చుండి, విశ్వేశ్వరుఁ డటువైపు తిరుగఁగానే, "వచ్చి రూపాయలు తీసికొని పొమ్ము, శుభలగ్నము మించి పోఁగలదు, ఆలస్యము కానీయకుము," అని కేకవేసినది.

నేల పడియున్న స్త్రీ జాహ్నవియని విశ్వేశ్వరుఁడు పోల్చుకొనెను. హరి భయపడుచు దగ్గఱ నిలిచి ఆమెవైపు చూచుచుండెను. సావిత్రి ఆ ముసుఁగుతోనే క్రిందికి చూచుచు నిలిచియుండెను. విశ్వేశ్వరుఁడు స్థిరకంఠముతో, "నేను చివరమాట యొక్కటి చెప్పుచున్నాను, వినుఁడు!—పిల్ల యక్క దేవత వంటిది, నే నింకొక్కరూపాయయైన నీయ దలఁచుకొనలేదు. ఇష్టము లేనిచో మీరు పోవచ్చును!" అని యనెను.

"అది యేమి విశ్వేశ్వర్ !" "వద్దు వద్దు విశ్వేశ్వర్!" అని నాలుగు వైపులనుండి నివారించుచు కేకలు లేచినవి. హరికూడ దిగులుఁ జెందుచు, "అట్లనుచున్నా వేమి విశు దాదా!" అని యనెను. విశ్వేశ్వరుఁ డెట్టి సంకోచము లేని కంఠముతో, "నీ వూరకుండుము హరీ," అని యనెను. ఇట్లనుచు సభవారివంక తిరిగి, "నేను మఱియొక్కరూపాయయైన నిచ్చెదనని మీ రెన్నఁటికిని ఆశింపకుఁడు. కాని వరునితో నేను చెప్పవలసిన దొక్కమాట యున్నది—నే నతనికి నేఁ డర్పింపఁ వచ్చిన రత్నముయొక్క విలువ నతఁడు పోల్చుకొనఁ గలిగిన యెడల తాను బహు అదృష్టవంతుఁడనని నిశ్చయముగా తెలిసి-

కొని యుండును. ఈ వస్తువే వెల కమ్మకమానో చూచెదరా?"
అని యనెను.

విశ్వేశ్వరుఁడు సావిత్రియొద్దకు వచ్చి ఆమె కిరీటము నటు పారవైచి, ముసుఁగును తీసి, సావిత్రి ముఖమును వరుని వైపుత్రిప్పి, "ఇటు చూడుఁడు, ఈ రత్నము విలువ పోల్చుకొనఁగలరేమో?" అని యనెను.

వరుఁడు ముఖము గంభీరముగ చేసి, "నాన్నగారుండఁగా నన్నడిగి ప్రయోజనములేదు," అని ఉత్తరమిచ్చెను.

"రారా నాయనా, వారికి పెండ్లి చేయవలె నని లేదు; సిగ్గుమాలినతన మిది యంతయు—రమ్ము, మనము పోదము," అని తండ్రి యనెను.

యథార్థముగ హితమును కోరుచు ఒకరిద్దఱు, "వద్దు బాబూ, విశూ, ఇప్పుడైనను తెలివి తెచ్చుకొనుము," అని యుపదేశించిరి.

"బాగుగ నాలోచించక నేనేమియు చేయుచుండ లేదు," అని విశ్వేశ్వరుఁ డన్నాఁడు.

"పోనిండు, వేయిరూపాయ లక్కఱలేదు, ఐదువందలీయుఁడు," అని వరపక్షమువా రన్నారు.

"మఱియొక్క దమ్మిడి యైన నీయను," అన్నాఁడు విశు.

గడుసువారిద్దఱు వచ్చి కండ్లతో సంజ్ఞచేయుచు వరుని తండ్రికి రహస్యముగ సలహాయిచ్చిరి—"మఱి ప్రయోజనము లేదు, తరుణము మించినది. వచ్చినదే లాభమని తలఁచి మొదటి

షరతుల నొప్పుకొనుడు." ఇట్లతనిచెవిలోచెప్పి అందఱు విను నట్లతనితో నిట్లనిరి—"మీరు తొందర పడకుఁడు, కొద్దిరూపా యల కాలోచించక మొదటి షరతులప్రకారము జరుగనీయ మని మాప్రార్థన. మంచిసంప్రదాయముగల ఇల్లు, జాతిభ్రష్టు లనుగా చేయుట న్యాయముకాదు. ......ఇదిగో, అబ్బాయి హరీ, నీవు పిల్లను తీసికొని వచ్చి పీటపై కూర్చుండఁబెట్టుము. ఇదిగో, పెండ్లికొడు కిక్కడా! లెమ్ము బాబూ, వచ్చి పీట మీఁద కూర్చుండుము. కానిమ్ము బాబూ విశూ, ఇఁక జాలమేల?"

విశ్వేశ్వరుఁడు చలనము లేని కంఠముతో జవా బిచ్చెను, నాతో నేమియు చెప్పవద్దు. ఇట్టి ఘటన జరిగిన తరు వాత ఇట్టి నీచులచేత పిల్లనుపెట్టువాఁడు వారికంటె నీచుఁడై యుండవలెను." ఇట్లని చేతులుజోడించి అందరిని సమస్కరించి క్షమించమని కోరి పెండ్లి మఱిచేయమని చెప్పెను.

అక్కడనున్న వారందఱు కట్టకట్టిపోయిరి. విశ్వేశ్వరుఁడు అనునట్లు చేయువాఁడని అందఱు నెఱిఁగినదే. వరపక్షము వారు మిగుల నవమానితులై, కోపముతో చేతులు విసరుచు పెండ్లియిల్లు విడిచి బయటికి పోసాగిరి. హితముఁ గోరుచు మిత్త్రుఁ డొకఁడు, విశ్వేశ్వరునితో, "ఇప్పటికైనను వారిని మఱ పించి ఒప్పించఁగలను, లేకున్న బ్రాహ్మణ బాలిక, జాతి పోవును," అని యనెను.

"జాతి యేలపోవును ? తగినవరుని మఱియొకని చూచి పెండ్లి చేయవచ్చును."

"మఱియొక వరుఁ డెక్కడ దొరకును?"

"వరునికొఱకు దూరముపో నక్కరలేదు—దగ్గఱనే యున్నాఁడు." అతిథులను సత్కరించుభార మిద్దరు మిత్రులపై వేసి వరుఁడు తానే యని విశ్వేశ్వరుఁ డనెను.

హఠాత్తుగ పిడుగుపడి, ఊరిపెద్దల యామోదమునకు భంగము కలిగినది. "ఏమి సమాచారము! ఏమి సమాచారము!" అనుచు నందఱును ఆశ్చర్యపడి యడుగుచుండుటవలన పెద్దకలవరము పుట్టినది.

"ఏమియు లేదు—నాకు తండ్రి లేడు, నేనే మీకభ్యర్థన మొనరించి ఈ శుభకార్యములో మీరు తోడ్పడ వలసినదని ప్రార్థించుచున్నాను.

పిన్ని స్త్రీసమూహమధ్యముననుండి వచ్చి విశ్వేశ్వరుని తల రెండుచేతులతో పట్టుకొని తనగుండెపైనుంచుకొని పసిబాలుని ముద్దుపెట్టుకొనురీతిని అతనిని ముద్దుపెట్టుకొని, రెండు చేతులను విశ్వేశ్వరుని తలపైనుంచి మిగుల ప్రేమతో నతని నాశీర్వదించినది.

పనిపాటులులేని యువకబృందము ఉత్సాహముతో వచ్చి విశ్వేశ్వరుని ముట్టడించి అతని నక్కడనుండి తీసికొని పోయిరి. స్త్రీలు సందడి చేయుచు విశ్వేశ్వరుని చుట్టుచేరిరి. శంఖారావ మారంభమైనది. వరుని ముక్కుపైఁగాని చెవులపైఁ

గాని జాలిఁగొనినవా రా స్త్రీసమూహమున నొక తెయైనను లేకుండెను. "పెండ్లికొడుకు కాఁగానే సరదా కాదు, అందటి గిల్లులకు ఓర్చియుండగల శక్తి యుండవలెను!" అని నవ్వుచు యువకులలో కొందఱు కేకలు వేయుచుండిరి.

పిల్లను తీసికొనివచ్చి పీటపై కూర్చుండఁబెట్టిరి. శుభ-దృష్టి మొదలగు సంస్కారములు కొన్నియైన తరువాత "చూడుము వదినా, చూడుము—నీ కదృష్టము లేదు—అటు వైపొక్క సారి చూడుము," అని అన్నపూర్ణ జాహ్నవితో ననెను.

వివాహమైపోయినది. "అత్తయ్యా! ఇటువంటి నొకరు రెండు," అని హరి భయముఁ జెంది అన్నపూర్ణతో ననెను. సావిత్రికి జ్వరము తగిలినది. జాహ్నవి సావిత్రియొద్దకు వచ్చి వాలియున్న ఆమె తలను తనయొడిలోనుంచుకొన్నది. అన్న-పూర్ణ సావిత్రి ముఖముపై నీళ్లుఁ జల్లి ఆమెకు విసరసాగెను. కొంతసేపటికి సావిత్రి ముఖము కొంచెము తేటినట్లు కనఁబడఁగానే తల్లి, "ఏమమ్మా! ఇట్లు చేసితి వేమి? నేఁడు సముద్రము తోడి మణిని సంపాదించితినమ్మా," అని యన్నది. సావిత్రి తల్లి భుజముపై మెడనుంచి రెండుచేతులలో తల్లిని కౌఁగిలించు కొనినది.



## పదునేడవపరిచ్ఛేదము

### అన్నపూర్ణమందిరము

కాలచక్రము మెల్లఁగా నడుచుచున్నది. సర్వమును ప్రతిసంవత్సరమునవలెనే యున్నది, కాని, కొబ్బరిచెట్లక్రిందను పుస్తక మొకటి చేతపుచ్చుకొని ఇటునటు పచారిచేయుచుండు విశ్వేశ్వరునకు తలయెత్తి చూచునప్పటికి అంతయును క్రొత్తఁగా కనఁబడుచున్నది.

జమాఖర్చులపుస్తకములు కొన్ని చేతపుచ్చుకొని గుమాస్తా యొకఁడు విశ్వేశ్వరుని దగ్గఱకు వచ్చెను.

"ఈ లెక్క మీరు కొంచెము చూడవలెను—మందిరము పూర్తియగు నప్పటికి మీ ఎస్టిమేటునకు మించునని తోఁచుచున్నది," అని గుమాస్తా అన్నాఁడు.

"ఎస్టిమేటుకు దాటకుండ ఏదియు కట్టించలేము; ఏది కట్టించినను ఎస్టిమేటును దాఁటియే వెళ్లును; రమ్ము గదిలోనికి పోయి లెక్కలు చూతము," అని విశ్వేశ్వరుఁ డనెను.

లెక్క పుస్తకములలో నొకదాని పుటల నిటునటు తిరుగ వేయుచు విశ్వేశ్వరుఁడు మందిరము పూర్తియగుట కింక నెన్ని దినములు పట్టునని గుమాస్తా నడగగా, త్వరలోనే పూర్తి యగు నని గుమాస్తా జవాబు చెప్పెను.

"సంక్రాంతినాఁటికి పూర్తికావలెను, ఆనాఁడు ప్రాణ ప్రతిష్ఠ చేయించవలెనని పిన్ని నిశ్చయించినది."

"అంతకు పూర్వమే పూర్తి యగును."

లెక్కచూచుట కాఁగానే విశ్వేశ్వరుఁడు లేచి స్నానమునకై ఇంటిలోనికి పోయి, "పిన్నీ, నూనె," అని కేక వేసెను.

పిన్ని యప్పుడు వంటపనిలో నున్నది; సావిత్రి దగ్గఱ కూర్చుండి పసుపు నూఱుచుండెను; "విశుకు కొంచెము నూనె యిచ్చి రమ్మమ్మా," అని పిన్ని సావిత్రితో ననెను.

వధువు కొంచెము సంకోచించి, ముసుఁగు తలపైకి లాగుకొని నూనెగిన్నెతో బయటికి వచ్చినది. కూర తరుగుచు పంచెలో కూర్చుండియున్న నిధుతల్లి కంటఁబడకుండునట్లు విశ్వేశ్వరుఁడు ప్రక్క వరండాలోనికి పోయి స్తంభము ప్రక్కను నిలిచియుండెను. వధువు నూనె తీసికొని వచ్చి ముసుఁగు కొంచె మెత్తుకొని చూచినది. కాని నూనె కోరినవా రక్కడ లేరు—నూనెగిన్నె నక్కడ నుంచి ఆమె వంటింటిలోనికి తిరిగిపోయినది. ఆమెనుచూచి, "విశు ఉన్నాఁడమ్మా అక్కడ?" అని పిన్ని యడిగెను.

"లేరు," అని తలవంచి వధువు జబాబిచ్చెను.

"ఎక్కడికి వెల్లినాఁడో కొంచెము చూచి రమ్మతల్లీ—నూనె లేకుండ స్నానమునకు పోవునేమో!"

కాని వధువున కంతకంటె బాఁగ బోధపడినది; కనుక

జంకుచు జంకుచు ముసుఁగు కొంచెము వెనుకకు త్రోసి చేత నూనెగిన్నె పట్టుకొని అంగణములోనికిఁ దిగి, ఆయన యెక్క-డికి వెళ్లినారని కూరలు తరుగుచుండు నిధుతల్లిని మెల్లఁగ నడిగినది. ఆమె ఎఱుగనని చెప్పినది.

సావిత్రి అంగణముదాఁటి పడకగది వరండాలో రెండడు-గులైనను వేయకమునుపే వెనుకనుండి యెవరో ఆమె పైట చెంగును పట్టి లాగిరి. సావిత్రి తడఁబడుచు, ఎవరికంటనైన పడునేమో యనుభయముతో నాలుగు వైపులను చూచినది. ఎవ్వరును కానరాలేదు. అప్పుడామె భర్త పాదముల దగ్గఱ "నూనె" అనుచు గిన్ని నుంచినది.

"అది కనఁబడుచునే యున్నది, కాని ఒక మంచి వినోద మున్నది, వినెదవా!" అని విశ్వేశ్వరుఁ డనెను.

సావిత్రి అతిదీనముగ చూచుచు, "పనియున్న దిప్పుడు, నన్ను పోనిండు," అని మృదుస్వరముతో నన్నది.

"పొమ్ము, నిన్నెవరు పిలువవచ్చిరి! ముసుఁగంత పైకి యున్నదేమి, ఎవరైన చూడఁగలరు, మఱి కొంచెము క్రిందికి లాగుకొనుము!" అనుచు విశ్వేశ్వరుఁడు ఆమె ముసుఁగును మఱి కొంచెము క్రిందికి లాగెను. అచ్చట నుండుట ప్రమాదకరమని ఎఱిఁగి వధువు ఇంటిలోనికి పాఱిపోయినది.

"ఇదిగో, ఇది వినుము, వినుము—సరే జ్ఞప్తియుంచు-కొనుము—పగ తీర్చుకొనెదను, చూచుచుండుము."

వీటిలో స్నానము చేసి వచ్చి విశ్వేశ్వరుఁడు భోజనమునకై కూర్చుండియుండెను. వడ్డించుచు పిన్ని అనేకప్రశ్నలడుగుచుండెను.

పిన్ని యడుగు ప్రశ్నల కన్నిటికిని, "ఔను," "ఆహా!" "నిజమే!" అనుచు అతిక్లుప్తముగ ఉత్తరము లిచ్చుచు విశ్వేశ్వరుఁడు నడుమనడుమ తలయెత్తి వంటయింటి తలుపునందువైపు, కిటికీవైపు చూచుచుండెను—తా నిట్లు కోపముతో నిచ్చుచుండు జవాబులు వంటయింట నుండు నెవరి చెవినో పడునని విశ్వేశ్వరుఁ డాశించుచుండెను.

భోజనముచేసి విశ్వేశ్వరుఁడు పడకగదిలోనికిపోయెను. గంట, గంటన్నర నిద్రపోయి లేచి, అతఁడు పని చూచుకొనుటకై బయలుదేఱెను.

సాయంకాలము కాకమునుపే విశ్వేశ్వరుఁ డింటికి తిరిగి వచ్చెను. జాహ్నవిని చూచుటకు పోయిన అన్నపూర్ణ ఇంకను రాలేదు. కలహమాడుచు నిట్టి మంచి సమయము పాడుచేసికొనుట వట్టి తెలివిమాలిన తనమని తలఁచి, విశ్వేశ్వరుఁడు ఈగది, ఆగది వెదకి, సావిత్రి నెచ్చటను కానక తుదకు దేవతార్చనగదిలోనికి తొంగిచూచెను. సావిత్రి పట్టుచీర కట్టుకొని, రాగి తబుకున పువ్వులనుంచి ఆగదిలో కూర్చుండి మాల గ్రుచ్చుచుండెను. విశ్వేశ్వరుఁ డొక్కమూరు ప్రేమనిమగ్నులై యున్న దేవతాద్వయముల ప్రతిమలను చూచి, పిమ్మట క్రిందను, ముఖము వాల్చుకొని పూలదండ గ్రుచ్చుచున్న సావిత్రవంక

చూచెను. అతినిపుణుఁడగు శిల్పి యెవఁడో పైనుండు దేవి ముఖమున విచిత్రభావమొకటి వ్యక్తముఁ జేసెను; సింహాసనము నెదుట, క్రిందను కూర్చుండియున్న యువతి ముఖమునకూడ ఆ మధురచ్ఛాయలే కానవచ్చుచుండెను. విశ్వేశ్వరుఁడు చప్పుడు చేయక మెల్లగా దగ్గఱకు వచ్చి, "ఎవరికొఱకీ మాల?" అని యడిగెను.

సావిత్రి ఉలికిపడి తలయెత్తి చూచి, ముసుఁగు ముం-దుకు లాగుకొని, "దేవత కొఱకు," అని మృదుస్వరముతో ననెను.

"ఏ దేవత కొఱకు?"

సావిత్రి ముఖమెత్తి భర్త వైపొకమాఱు చూచినది. "నీ దేవత ఎన్ని రోజుల కొకమాఱు మాఱుచుండును సావిత్రీ? దేవతాపదవి నిచ్చుటకుఁగాని తీసికొనుటకుఁగాని నీ కెంతో కాలముపట్టన ట్లున్నదే!" అని విశ్వేశ్వరుఁడు గంభీరముగా ననెను. సావిత్రి చిఱునవ్వునవ్వుచు ముఖము వాల్చినది. రెండు చేతులతో నామె ముఖము నెత్తి పట్టుకొని ఆమె దాఁచుచున్న చిఱునవ్వును కనులార నొకసారి చూడవలెనని విశ్వేశ్వరుఁనకు బుద్ధిపుట్టినది. విశ్వేశ్వరుఁడామెకు దగ్గఱగా వచ్చి కూర్చుండి, సగము గ్రుచ్చిన పూలదండను ఆమె చేతులలో-నుండి లాగి తీసికొని, "నేను మాత్రము నా పదవిని సులభముగ వదలువాఁడను కాను, కనుక ఈ మాల నాది," అని యనెను.

సావిత్రి భయపడుచు ప్రత్యుత్తర మిచ్చినది—"ఏమి విూరుచేయునది! పాపము వచ్చును, పూజకొఱకు అత్తయ్య—"

అట్లైన ఏదేవతకొఱకో చెప్పితివి కావేల? పూర్వము నీనోటితో నుచ్చరించిన పండితవాక్యములు మఱచిన ట్లున్నావు!"

సందర్భము జ్ఞప్తికి తెచ్చుకొని, భర్తధోరణి గ్రహించి సావిత్రి పూలపళ్లెము వెనుక దాఁచి, భర్త చేసిన పనివలన పాపము కలుగునని భయముఁజెంది, విగ్రహమునెదుట తల నేల మోపి ప్రణామము చేసినది. విశ్వేశ్వరుఁ డంతలో ఆ సగము గ్రుచ్చిన మాలను చక్కఁగా తన మెడలో వేసికొనెను. సావిత్రి దేవునికి ప్రణామముచేసి తల యెత్తఁగానే విశ్వేశ్వ రుఁడు ప్రారంభించెను—"ఇటుప్రక్క మఱియొక దేవుఁడు నిరీక్షించుచు నిలిచి యున్నాఁడు. ఆహా, ఎట్టిభక్తురాలుకదా, ఈ దేవునకొక్క నమస్కారమైనను పెట్టలేదు, ఎట్టి దురదృష్టము వీనిది, పాపము!"

సావిత్రి తడఁబడుచు భర్తవైపు పోకమాఱు చూచినది. అనేక విషయము లామెకు జ్ఞప్తికివచ్చియుండవచ్చును. తన యెదుట నిలిచియున్నవాఁడు నిజముగా విశ్వమున కీశ్వరుఁడే యని ఆమెకు తోఁచియుండ వచ్చును. అత్యుత్సాహముతో హఠాత్తుగ సావిత్రి మోకాళ్లపై వ్రాలియువ్రాలక మునువే పైనుండి వచ్చి రెండుచేతు లామెను గట్టిగా పట్టుకొనినవి. "చాలును చాలును," అని అనురాగముతో విశ్వేశ్వరుఁ డను-

చుండు మాటలు సావిత్రి చెవినిపడినవి. సావిత్రి సిగ్గుపడి లేచి మఱియొక వైపు చూచుచు, "నమస్కారము చేసినయెడల తప్పా?" అని మృదుస్వరముతో నడిగెను.

"తప్పే, సందేహ మేల? గురుపు శిష్యులవలె కేవలము నమస్కారములు ఆశీర్వాదములు చేయుచుండుటకు సిగ్గు పడ వలసినదే!"

"సిగ్గేల? దేవునికి నమస్కారము చేయుటకు సిగ్గేల?"

విశ్వేశ్వరుఁడు రెప్పపాటులేక సావిత్రివంక చూచుచుండెను. ఆచూపులో నింద, దుఃఖము, ప్రేమవలనపుట్టిన అభిమానము ఉండెను. ఆ చూపు సహింపలేక సావిత్రి ముఖము వాల్చుకొనినది.

విశ్వేశ్వరుఁ డప్పు డామెను—"సావిత్రీ, ఇప్పటికిని నీ నోట ఆ మాటయే? నే నిప్పటికిని నీకు పరుఁడనేనా?" అని యడిగెను.

విశ్వేశ్వరుని ధోరణివలన సావిత్రి మనస్సున బాధకలిగి, మ్లానముఖముతో ఆమె, "ఇంతమాత్రమున దూరమైనట్లేనా?" అని యన్నది.

"కాక మఱేమి? దేవుఁడని, దేవతయని ఎవరినందురు?"

"అనాథల కాశ్రయ మిచ్చువానిని, దుఃఖితులగువారి దుఃఖమును దూరముచేయువానిని, దారిప్రక్కను భిక్షమెత్తు కొనుదానిని సింహాసనముపై కూర్చుండఁబెట్టు వానిని—"

విశ్వేశ్వరుఁడు, సావిత్రిని దగ్గఱకు లాగుకొని ఆమెను తన గుండెపై నుంచుకొనుచు మెల్లఁగా నిట్లనెను—“కాని ఎవరు హృదయపూర్వకముగ ప్రేమించుచుందురో, ప్రేమను కోరుచుందురో వారు మానవులు. నీవు నా కింత దగ్గఱ నుండి కూడ అట్లనఁగూడదు, నా హృదయమున నున్నది నీ వెలుఁగవా?”

సావిత్రి యిప్పుడు భర్తగుండెపై ముఖమును దాఁచుకొనినది—భర్తతో నీ విధముగ చెప్పఁబోవుచుండెను—“నీవు నా కిచ్చినది నే నెన్నఁడైన ఆశింపఁగలిగినదా? నేను నీకు తగినదాన నని ఇప్పటికిని అనుకొనఁగలనా? తుపాను కెగిరిపోవు గడ్డిపరకలవలె మేము కొట్టుకొనిపోవుచుండ నీవు మాకాశ్రయ మిచ్చితివి; అంతేకాదు, ఎన్నఁడును మే మాశింపలేనిదికూడ మా కిచ్చితివి—నాకు నీపాదములకడ స్థానము నిచ్చితివి. ఇంతకు మించిన దేదియు తలంపకుము—భరించు శక్తి నాకు లేదు.”

హఠాత్తుగ బయటినుండి, “చిన్నక్కా!” అని బాలకంఠమున మాటలు వినఁబడినవి. “కాళీ వచ్చినాఁడు,” అనుచు సావిత్రి బయటికి వెళ్లిపోయినది.

విశ్వేశ్వరుఁడు పుస్తక మొకటి చేతపట్టుకొని పుటలు తిరగవేయుచు కూర్చుండెను. అతని హృదయ మానందముతో నిండుచుండెను. పుస్తకములోనుండి హఠాత్తుగ జాబొకటి అతని యొడిలో పడినది. అది ఆ జాబు,—సతి విశ్వేశ్వరునకు వ్రాసిన

జాబు. ఆ జాబునందుండునవి సతి కడపటి మాటలు. ఆ జాబున నున్నదంతయు విశ్వేశ్వరుఁడు జ్ఞప్తికి తెచ్చుకొనెను—మిగుల బాధఁజెంది, శపించుచు సతి యనిన మాటలం దున్నవని ఆ జాబు మొదట చదివినప్పుడు విశ్వేశ్వరునకు తోఁచినది. కాని ఇప్పుడతని కట్లుతోఁచుచుండ లేదు—అది వేదనతో నిండియున్న హృదయముతో, శుభమును కోరుచు, ఆమె తనకిచ్చిన అనంతాశీర్వాదమని తోఁచినది. 'అట్టి యధమజాతికి చెందిన స్త్రీలలో నొకరిని భార్యగా నెంచుకొనెదవు, ప్రేమించెదవు. ఆ యధమజాతికి జెందిన మానవ హృదయములలో ప్రేమ సముద్రము దాఁగి యున్నదని స్వానుభవమువలన తెలిసికొనెదవు. స్త్రీహృదయ మిచ్చిన ప్రేమ నందుకొనుట, ఆమెకు ప్రేమ నిచ్చుట—వీని కంటె శ్రేష్ఠమగు సుఖ మీ లోకమున లేదని ఒప్పుకొనెదవు'—సతి ఈధోరణిలో వ్రాసిన మాట లతనికి జ్ఞప్తికి వచ్చినవి. ఇది శాపమా! కాదు కాదు—ఇది భవిష్యత్తును చెప్పు దైవజ్ఞుని మాటలు! మూఢుఁ డగుటచే అప్పుడు వాని యర్థ మతఁడు తెలిసికొన లేకుండెను—"నీవు సుఖింతువు గాక!" అని సతి వ్రాసిన చివరమాట లతని కంటఁబడెను, విశ్వేశ్వరుఁ డా జాబును తల కద్దుకొని దీపముపై పట్టుకొని తగులఁ బెట్టెను.



## పదునెనిమిదవ పరిచ్ఛేదము

### అన్నపూర్ణ భాండాగారము

చైత్రమాసమున విగ్రహమును ప్రతిష్ఠ చేయించవలె-
నని అన్నపూర్ణ తలంచినది. కాని అనేక కారణములవలన అది సాధ్యము కాలేదు. విశ్వేశ్వరుని వివాహమయి రెండేండ్లైన తరువాత దైవికముగా ఆ పెండ్లిముహూర్తమే మందిర ప్రతిష్ఠకై నిర్ణయింపఁబడినది.

ఈలోగా సావిత్రికి మఱియొక పెద్ద దెబ్బ తగిలినది. ఈలోకములో నెట్టి యవస్థలో నున్నను శాంతి లేదనునట్లు జాహ్నవి హఠాత్తుగ నొకనాఁడు ప్రాణమువిడిచి చిరశాంతిని పొందినది. సావిత్రి మొదట భరింపరాని దుఃఖము పొందినది. కాని రానురాను అమ్మ అక్కఱయొద్దకుపోయి సుఖముగా నున్న-దని మనస్సును సమాధాన పఱచుకొనినది. చిన్నకొమార్తె సుఖముగా నుండుటచూచి, తల్లి తన భాగ్యహీనురాలగు కొమార్తె సతిని సుఖపెట్టఁగోరుచు నామెయొద్దకు పోయిన దని యనుకొనుచు సావిత్రి కన్నీరు తుడుచుకొనుచుండెను. వారి పెండ్లియాడి సుఖముగా నున్నాడు. కాళీపదుఁ డక్కను వదలి యుండలేకున్నాడు. భట్టాచార్యుల యిల్లిప్పుడు నూతనజీవుల తోను నూతనసుఖదుఃఖములతోను నిండియున్నది.

మందిర ప్రతిష్ఠ జరిగినది, అందుండు అన్నపూర్ణాదేవి విగ్రహ ప్రతిష్ఠకూడ జరిగినది. ఉత్సవముతో గ్రామము మిగుల నాందోళితమైనది. అన్నపూర్ణ తన యాస్తియంతయు నిచ్చి గొప్ప సత్రమును కట్టించి, సదా దాన ధర్మములు జరుగు ఏర్పాటు చేయునని అందఱును తలచుచుండిరి. విశ్వేశ్వరుని యుద్దేశముకూడ నొకటనదియే, కాని పిన్ని అట్టిదాని కొప్పు కొనలేదు—పిన్ని విశ్వేశ్వరునితో ని ట్లన్నది:

“తిండికిలేనివారికి భగవంతుఁ డేదోవిధముగ తిండి నిచ్చుచున్నాఁడు, కాని మనుష్యుని దౌర్జన్యమువలనను, సంఘ-ముయొక్క దౌర్జన్యమువలనను, పీడితులగువారిదుఃఖము అన్ని దుఃఖములకంటె భరించరానిది. డబ్బులేనివారికి ఆఁడుబిడ్డలవలన మనదేశమున కలుగుచుండు బాధ నివారణార్థమై నాడబ్బుతో నేదైన నేర్పాటొకటి చేయుము విశూ. దానధర్మములమూల-మున పుణ్యము పొందవలె నను కోరిక నాకు లేదు నాయనా. తలిదండ్రులు నిరుపేదలగుటవలన మనదేశమున పాలుత్రాగు పసిబిడ్డలు శాశ్వతముగ నగ్నిజ్వాలలో పడి కాలకుండునటుల నేదైన చేయఁగలిగినయెడల నేను పుణ్యాత్మురాల నగుదును. నా యాస్తి మిగుల సామాన్య మైనది, దీనివలన ఒక్క బిడ్డకైనను కన్నీరులేకుండ చేయగలిగినయెడల నాయర్థము సార్థక మగునని నా నమ్మకము.”

విశ్వేశ్వరుఁడు తల్లియాజ్ఞను పాలించుచు, “అన్నపూర్ణ

భాండాగారము"ను స్థాపించెను. తన పేరు వద్దని పిన్ని చాల అభ్యంతరపెట్టినది, కాని విశ్వేశ్వరుఁడు పట్టినపట్టు వదలలేదు.

అన్నపూర్ణమందిరమున ఆ నాఁడు గొప్ప సందడి జరిగినది. గ్రామముననుండు ఆబాలవృద్ధు లందఱికిని విందు చేసిరి. బీదసాదలకు భోజనము పెట్టించి బట్టల నిప్పించిరి.

సావిత్రికూడ ఆ నాఁడు పైటచెంగు నడుముకు కట్టి ఉదయమునుండి పనిచేయుచుండెను.

చాల ప్రొద్దుపోయినది. విం దింకను పూర్తికాలేదు. అన్నపూర్ణ సావిత్రిని చూచి, "ఏమి తల్లీ, నీకేమి పిచ్చియా! ప్రాణములు పోగలవు, కొంచెము కూర్చుండుము, నోట గ్రుక్కెఁడు నీళ్లు పోసికొనుము," అని యనుచు నామెను అన్నము రాసులనడుమనుండి బయటికి లాగుకొని వచ్చి, అన్ని వైపులను జనసమ్మర్దముగ నుండుటచేత అన్నపూర్ణ సావిత్రిని మందిరములోనికి బలప్రయోగమున తీసుకొనివచ్చినది.

ఎదుట అన్నపూర్ణాదేవి విగ్రహము, ఉజ్జ్వలశోభతో ప్రకాశించుచున్నది. సావిత్రి మొలనుచుట్టిన చెంగు విప్పి చెమట తుడుచుకొని విసరుకొనుచున్నది. అట్టిసమయమున ద్వారముప్రక్కను నిలిచి యెవరో, "మిక్కిలి దాహముగా నున్నది, దేవి చరణామృతము కొంచె మీయుము మమ్మా!" అని యనిరి. సావిత్రి మెడత్రిప్పి చూచినది—దేహమంతయు కూర అన్నముతో నిండియున్న విశ్వేశ్వరుఁ డామె కంటఁబడెను; అలసియున్న అతని దేహమంతటను చెమట కారుచున్నది.

మఱి యెవ్వరు నచ్చుట లేకుండుటఁజూచి విశ్వేశ్వరుఁడు మందిరములో ప్రవేశించెను. సావిత్రి పైటచెంగుతో భర్తను విసరుచు, "మీా రింత శ్రమపడుచున్నా రేమి?" అని యనెను.

"నీవా!" అని యనుచు విశ్వేశ్వరుఁడు చిఱునవ్వు నవ్వెను. సావిత్రి త్వరత్వరగా దేవి చరణామృతమును, ఒక గ్లాసు షరబత్తును తెచ్చి భర్త కిచ్చెను. విశ్వేశ్వరుఁ డది త్రాగి మిగుల ననురాగముతో, "సావిత్రీ నేఁ డే తిథియో జ్ఞాపక మున్నదా?" అని యడిగెను.

"జ్ఞాపక మున్నది" అనుచు సావిత్రి నవ్వినది.

"నేఁ డింత పని తొందరలోను మాటిమాటికిని నా కెందుకోగాని ఆ మాటయే జ్ఞప్తికివచ్చుచున్నది! కాని సావిత్రీ, పెండ్లినాఁడు వా రా విధముగ చేయక యుండిన నేమైయుండును!"

"ఎన్నిమాఱు లడిగెద రా మాట? ఏమైయుండును— మంచిదై యుండును!"

"నాకేనా మంచి? మరి సావిత్రమ్మగారికికూడ మంచేనా"

సావిత్రి మిగుల ననురాగముతో ప్రత్యుత్తర-మిచ్చెను—"ఇప్పు డవి యన్నియు ననుకొనుచున్నా రేమో. కాని అప్పుడు నేను కేవల మొక జడపదార్థమువలె నుంటిని. అప్పు డేమిజరిగినను దాని మంచి చెడ్డలు నేనెఱుఁగక పోయి-

యుందును—అమ్మ నాపదనుండి తొలగించుటయే అన్నిటికంటె గొప్ప పుణ్యమని నమ్ముచుంటిని. ఎట్టికోరికను కోరుటకైనను నా కప్పుడు శక్తి లేకుండెను."

విశ్వేశ్వరుఁడు రెప్పపాటులేక ఆ యనురాగముతో నిండియున్న సావిత్రిముఖము చూచుచు, తనలో తాను, "ఔను నిజమే, నీ వట్టి సన్న్యాసివే! అట్లు కాకున్న అజ్ఞానములో మునిగియున్న నావంటి నిర్జీవునిలో నవజీవన మెట్లు పుట్టించఁ గలిగియుందువు?"



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1951.